శ్రీరస్తు.

# ద్విపద భారతము.

## విరాటపర్వము.

తిమ్మకవి ప్రణీతము.

పనప్పాకము. శ్రీనివాసాచార్యులచేఁ

బరిష్కృతముం బ్రకటితము.

చెన్నపురి:

శ్రీ "వైజయంతీ" ముద్రాశాలఁ

ముద్రితము.

౧౯౧౧.

 [వెల ౧-౨ అణాలు.

# Editor's Note.

While preparing the M. S. S. of this book for the Press I have had to remove some lines and to alter others. My reasons for taking this liberty were two-fold. First, as this book is mainly intended to be read by ladies, I considered it necessary to remove such descriptions and speeches as, in my opinion, were unsuited to be placed in their hands. Secondly, as the M. S. I was able to procure was very incomplete, being worm-eaten and ill-written, I have had to introduce new lines and alter others in order to preserve the continuity of the story and to remove errors in prosody and diction. In many places, I introduced lines of my own composition where the M. S. was found to be at variance with Tikkana's original.

I have on hand a few more Parvas ready for the Press, which I shall publish one after another in size and type uniform with this book.

In my opinion this book can well be set down as a text-book for the students of the High School and Lower Secondary classes. The Dwipada style of cmoposition is a compromise between the monotonous vachanam and the highly conventional Padya-Prabandham, and as such will very well meet the needs of the Telugu student population.

I am sorry I am not now in a position to give the reader any information regarding the author or the magnate in whose name the book is inscribed. In the subsequent volumes I hope to be able to place before them the results of my inquiries in this direction. For the present, I can with confidence say that the author belongs to a past decade and deserves a high place among Classic poets and should find a place in the library of every true lover of Telugu Literature.

P. SREENIVASA CHARLU.

# భూమిక.

---

శ్రీమహాభారతకథ నెఱుంగనివారు హిందువులయందుండుట యరుదు. అది సర్వనీతిబోధకంబును, సనాతనధర్మనిరూపకంబును, వర్ణాశ్రమాచారవిజ్ఞానప్రదాయకంబును నగుటంజేసి మనపురాతనగ్రంథంబుల నెల్ల నుత్తమం బగుట య ట్లుండ మనోహరకథారత్నంబులకు గనియౌటంజేసి మనవారి కెల్లరకుం బఠనయోగ్యం బగుచున్నది. దుర్యోధనాదులమాయలకు నెల్ల లోఁబడి పాండవులు సిరులం బాసి యరణ్యంబులఁ బండ్రెండేండ్లు వాసము చేసి పదుమూఁడవయేఁ డజ్ఞాతవాసం బొనర్ప విరాటరాజ్యంబుఁ జేరిరి. అందు వా రొందినరాయిడుల వర్ణించు పర్వము విరాటపర్వము నాఁ బరఁగు.

విరాటపర్వమును సాంతముగఁ జదివినఁ బుత్త్రపౌత్త్రాభివృద్ధియును, గోధనసమృద్ధియుఁ, గామితార్థసిద్ధియుఁ గలుగునని పెద్ద లండ్రు. వాన లేనికాలమునం జదివిన వర్షంబు గురియు ననియు సస్యంబులు పూర్ణఫలం బిచ్చు ననియుం బ్రతీతి

గలదు. ఏది యెట్లున్న నీపర్వమును సావధానం బుగఁ బఠించువారు నీతిసంపన్ను లగుదు రనుట నిస్సంశయంబు.

ఈగ్రంథమును ముద్రణమునకై సంస్కరించు నెడఁ గొన్నిపాదములను మార్చియు ననేక ము లగుక్రొత్తపాదములను జేర్చియు సమగ్ర మొనర్చి ముద్రింపించి యున్నాఁడ.

ఇంకను గొన్నిపర్వములు ముద్రణమున నున్నవి. అవియు శీఘ్రకాలమున వెలువడఁ గలవు. నాశక్తికొలఁది నాంధ్రశారదాదేవికి నే నొర్చుసేవలం బాఠకు లనుగ్రహించెదరు గాక యని ప్రార్థించు

పనప్పాకము. శ్రీనివాసాచార్యులు.

## విషయసూచిక.



ఆ—౧.



ఆ—౨.

ఆ—3.

## ఆ—౪.

ఆ——౫.

శ్రీ ర స్తు.

# ద్వి ప ధ భా ర త ము.

## విరాటపర్వము—ఆ - ౧.

శ్రీరమ్యగుణవార, శ్రితజనాధార,
కారుణ్యపూర, జంగలముమ్మ్ఛధీర.
చండ తేజుఁడు మున్ను జనమేజయుండు
పాండవకథ లెల్లఁ బరిపాటి వినుచుఁ
జనవున ననియె వైశంపాయనునకుఁ
"జనుదెంచి పంద్రెండుసంవత్సరములు
వనితతో నుత్తలపాటులం బడలి
వనవాసమున నుండి వరుసఁ బాండవులు
ప్రజ లెఱుంగక యుండఁ బయివత్సరమున
విజయు లై యెచ్చోట విహరించి రొక్కొ ?
పరఁగంగ నాలవపర్వంబుకథయు
నిర వొప్ప నాకు నీ వెఱిఁగింపు" మనిన
జనమేజయునకు వైశంపాయనుండు
వినిపింపఁ దొడఁగెఁ దద్వృత్తాంత మెల్ల:

ఆరీతిఁ బాండవు లతివతోఁ గూడి
ఘోరాటవులలోనఁ గుశలులై తిరిగి,
బహుమునీంద్రులచేత బహుపురాణములు
బహుతీర్థములఁ గ్రుంకి పరిపాటి వినుచు,
నెలమిఁ బండ్రెండవయేఁడు నిండుటయు
వల నొప్ప యమునిచే వాంఛితంబుగను
వరముఁ గైకొని, వేడ్క వసుధపైఁ దమ్ము
నొరు లెఱుంగక యుండ నొకయేఁడు గడప
నారాధనము చేసి యముని వీడ్కొల్పి,
తా రొక్కచోఁ డాఁగఁ దలపోసి యపుడు
విమలమనస్కు లౌవిప్రపుంగవులు
తమవెంట నగ్నిహోత్రములతోఁ రాఁగ
నామహాపుణ్యుల కపు డిట్టు లనిరి:
"ఓమహాత్మకులార, యోపుణ్యులార,
ఓమహీసురులార, యుగ్రాటవులకు
మామీఁదఁ గృప గల్గి మముఁ గూడి వచ్చి
యలవి సేయఁగ రానియలజళ్ల కోర్చి
కలసి యుండితి రింత కాలంబుదనుక;
నింక గోప్యము గాఁగ నేఁడాది మాకు
శంకింప కొకచోట జరపంగ వలయు.

రాయిడి పుట్టించి రారాజు మరల
కీయవస్థలు దెచ్చె నెఱుఁగరే మీరు?
వాఁ డింక నజ్ఞాతవాసంబువలనఁ
బోఁడిగా మము రోయఁ బుత్తెంచు జనుల;
మీరు మే మొకచోట మెలఁగంగ రాదు
మీ రింక మముఁ బాసి మీత్రోవఁ జనుఁడు.
ఏకాలమును మిమ్ము నెడసి పోనీక
చేకూరఁ బరిచర్య సేయ లే దయ్యె.
ఎడపక ధాత్రిలో నెట్టివారలును
బడనియాపద మాకుఁ బ్రాప్త మై వచ్చె
నెన్నఁడొకో మాకు నింక మీలోనఁ
బన్నుగా విహరించు భాగ్యంబు గలుగు!
నని దైన్యపాటుతో నందఱుఁ బల్క
జననాయకునిఁ జూచి సకలబ్రాహ్మణులు
"మీ కేల శోకింప? మీరు సాహసులు;
చేకొని రాజ్యంబు సేయ నున్నారు.
ఆపద పడువార, లకట మీ రేల,
ఏపార వేల్పులు నెందఱేఁ గలరు.
పాయక నిషధాద్రిఁ బ్రచ్ఛన్నవృత్తి
వేయికన్నులవేల్పు విహరించె మున్ను.

పురుషులలోపలఁ బాడ వైనహారియు
మరువున నొకచోట మరుగుజ్జు గాఁడె?
దుర్వ్యాహుం డై తల్లితొడఁ జొచ్చి మున్ను
నౌర్వునంతటివాని కలయంగ వలసె.
అదియు నేటికి? సూర్యుఁ డాదికాలమున
మొదవుగర్భముఁ జొచ్చి ముమ్మాఱు డాఁగె.
వీ రెల్ల నటమీఁద వెలయు శాత్రవుల
శూరు లై మర్దించి సుఖ మున్నవారు..
ఆరీతి మీర లాయాసంబు లోర్చి
వైరులఁ బరిమార్చి వసుధ నేలెదరు.”
అని మహీదేవత లాపాండవులకు
మనసులో నున్నయుమ్మలికంబుఁ బాపి
“క్రమ్మఱ సంపద ల్గలుగు మీ” కనుచు
నెమ్మితో నేగిరి నిజపురంబులకు.
అప్పు డన్నరనాథు లఖిలసేవకులఁ
దప్పక పిలిపించి తగఁ గుస్తరించి
దొరల సామంతుల దుర్గాధపతుల
వెర వొప్ప నందఱ వేర్వేఱ ననిచి
హరిణాక్షియును దాము నరదంబు లెక్కి
ధరణి నుత్తముఁ డైన ధౌమ్యుఁ దోడ్కొనుచుఁ

గొంతదూరం బేగి కువలయాధిపులు
వింతగా నొకచోట విడిసి నాఁ డుండి
మఱునాఁడు రేపాడి మజ్జనం బాడి
మఱవక సాంధ్యసమాధులు దీర్చి
సుఖ మున్నచోట నర్జునుఁ జూచి విభుఁడు
నిఖిలంబుఁ దలపోసి నెమ్మి ని ట్లనియె:
"ఈయిందువదనతో నెలమి నార్వురము
నీయందమున నున్న నెఱుఁగ రే మనల?
పొడచూపఁగా రాదు భువిలోన మనకు.
బడలక యియ్యేడు వర్తించు టరుదు;
ఎఱిఁగింపు దీనికి నేది కార్యంబు?
ఎఱుఁగఁ దీఱదు నాకు హృదయంబులోన"
అనవుడు విభుఁ జూచి యాసవ్యసాచి
ఘనభక్తి దీపింపఁగా విన్నవించె:
"రాజేంద్ర, యమధర్మరాజు నీ కిపుడు
తేజంబుతో నిచ్చె ధృతి నొక్కవరము;
ఆవరంబునఁ జేసి యనఘాత్మ మనము
ఏవిధంబున నున్న నిఁక నేల వెఱవ?
మనమునఁ బ్రీతియా మగధపాంచాల
ఘనమత్స్యకాంభోజకటకంబులందు

# ద్విపదభారతము.

ఏయొచ్చెమును లేకయే పట్టణములఁ
బాయక ధర్మంబు ప్రబల మై యుండు.
పౌరులును బసులు ధా న్యము నేయి నీరు
కరులును దోఁటలుఁ గలుగు నెప్పుడును.
కౌరవాధిపుఁ డేలుగజపురంబునకుఁ
జేరువ యని మీరు చింతింప నేల?
ఈపట్టణములలో నెం దైన మనము
భూపాల యుండుట బుద్ధికార్యంబు.”
అనవుడు మనుజేంద్రుఁ డమరేంద్రసుతునిఁ
గనుఁగొని తనకోర్కి కానరాఁ బలికె:
“ నాకుఁ జూడఁగ మత్స్య నగరంబు మేలు;
ప్రాకటబహుభోగభాగ్యసంపదల
వినయభూషణుఁ డైనవిరటుఁ డున్నాఁడు;
మనుజుల తారతమ్యము లాతఁ డెఱుఁగు;
ప్రణుతి కెక్కినభూమిపతులలోఁ గొంత
గుణవంతుఁ డగువానిఁ గొల్చి యుండుదము.
ఉండుచో నేరూప ముచితంబో మనకు
నొం డొండ వివరింపుఁ డొనఁగూడి మీరు.
వెలయ నా కిప్పుడు వివరించి చూడఁ
బలుమాఱు మన కైన భ్రమ పుట్ట వలయు”

అనవుడు విభుఁ జూచి యమకేంద్రసుతుఁడు
మనసులోపల శోకమగ్నుఁ డై పలికె:
"అక్కట ధరణి నీయంతరాజునకు
నొక్కభూపతిఁ గొల్చి యుండంగ వలసె!
కపటం బెఱుంగవు కల నైన నెపుడు,
కృపయు నీతియు వేఱె కీర్తింప నేల?
మన్నింప నేర్తువు మంచివారలను;
సన్నుతించుట గాదు సహజంబ నీకు.
ద్రౌపదిఁ బట్టి శాత్రవు లీడ్చునపుడు
కోపింప నేరని గురుశాంతనిధివి;
ఇట్టిపుణ్యుఁడ వింక నేమూపుఁ దాల్చి
నెట్టన రిపులతో నిర్వహించెదవు?"
అనవుడు నామాట లాలించి వినక
మనసున ధీరుఁ డై మనుజేంద్రుఁ డనియె:
"సన్యాసివేషంబు సమకూర్చికొనుచు
మాన్యుఁడ నై యుందు మత్స్యేశుకడను;
పలుకుదు మృదువుగా బహుపురాణములు;
పొలుపుగా నతనికి బుద్ధి చెప్పుదును;
జూదంబు తలపెట్టి చూపి యాతనికి
మోదంబు పుట్టింతు; మున్ను నాచేత

## ద్విపదభారతము.

భాసిల్లి నవరత్నపఙ్క్తిఁ గీలించి
చేసినపసిఁడిపాచికలు చూపుదును;
ఎచ్చోట విహరింతు రేది మీనామ
మచ్చుగా నెఱిఁగింపుఁ డని పల్కె నేని,
కంకుండు నాపేరు కౌంతేయునొద్దఁ
గొంకక వర్తింతుఁ గూర్మితో నందు.
మఱియు భూపాలుని మనసు లెఱింగి
నెఱవాది నై యుందు నేర్పు దీపింప"
అనిచెప్పి నరనాథు డనిలనందనునిఁ
గనుఁగొని ధైర్యంబు కలుఁగ ని ట్లనియె;
"ఓభీమసేన, నీ వుగ్రసాహసుఁడ,
వేభంగి విహరించె దీమత్స్యపురిని?
బకునిఁ గిమ్మీరునిఁ బట్టి సాధించి
ప్రకటకీర్తులఁ గన్న బహుసత్త్వనిధివి!
సౌగంధికములకై శంక లేక కరిగి
బా గొప్ప యక్షులఁ బాఱఁ దోలితివి.
ఆహిడింబునిఁ జంపి తఖిలంబు నెఱుఁగ.
ఊహింప నీపాటి యున్నారె మగలు?
బిరుదుమాటలె కాని ప్రియ మాడ నేర,
వారులచిత్తముఁ బట్ట నోపుదే నీవు?"

అనవుడు విని భీముఁ డాధర్మజునకుఁ
దనవర్తనము లెల్లఁ దగఁ జెప్పఁ దొడఁగె:
“వంటలవాఁడ నై వసుధేశునగర
వంటలు రుచులుగా వండి పెట్టుదును.
ఎట్టివృక్షము నైన నిరుగేల విఱుతు,
కట్టెకై వెదకను గత్తికై వెదక.
వెలయ వండెడువాఁడు వే ఱొక్కఁ డున్నఁ
జెలు వొప్ప వానితోఁ జెలిమి చేసెదను.
మఱియు భూపతివద్దిమల్లవర్గముల
విఱిచి యొడ్డుదు బాహువీర్యంబు మెఱసి.
హరితోడఁ బులితోడ హస్తీంద్రుతోడ
ధరణీశుఁడును దెచ్చి తలపెట్టెనేని
పట్టి చల్లార్పఁగ బలిమి నుక్కణఁగఁ
బట్టుదు వాని నేఁ బ్రాణంబుఁ గాచి.
వలలుండ నని చెప్పి వసుమతీనాథు
తలఁపులోపల వత్తుఁ దమకంబుతోడ.
జనపతి నన్ను నె చ్చటివాఁడ వనిన
వినుతిఁ బాండవులతో విహరింతు నందు.
ఇది వర్తనంబుగా నే నుండుచోటు
వెదకి కానఁగ లేరు విపుల శాత్రవులు”

అనవుడు నది పోలు నని ధర్మరాజు
ఒనర నర్జునుఁ జూచి యుత్తలంబునను
"అర్జున, నీదులా వరిది చెప్పంగ
నిర్జరాధిపుఁ డైన నిను గెల్వలేఁడు.
కాలకేయులఁ జంపి ఖాండవం బేర్చి
శూలి నెక్కటి గెల్వ శూరు లున్నారె?
ఇంతవాఁడవు నీవ దెట్లొకో యింక
వింతలాగునఁ బోయి విరటుఁ గొల్చెదవు?"
అనిన ధర్మజుతోడ నమరేంద్రసుతుఁడు
తనకుఁ బాం దగురీతిఁ దాఁ జెప్పఁదొడఁగె:
"అమరంగ నేను గా ర్యార్థి నై తొల్లి
అమరావతికిఁ బోవ నం దొక్కనాఁడు
నలినాక్షి యుర్వశి నన్నుఁ గామించి
పిలిచినఁ బో నైతిఁ బ్రియముఁ గై కొనక;
అప్పుడు కోపించి హరిమధ్య నన్నుఁ
దప్పక పేఁడి వై తగ నుండు మనుచు
శాపించి పోయిన జననాథ వినుము
నాపాలఁ గృప గల్గి నాకేశుఁ డెఱిఁగి
యేపాట నీకును నీపేఁడితనము
ప్రాపించి యొకయేఁడు పఱచి పోఁ గలదు.

ఆయేఁడు మీ కింక నజ్ఞాతవాస
మై యుండువేళకు నర్థిలో వచ్చుఁ,
బొ మ్మన్న వచ్చితి; భూపాల నాకు
నిమ్మగా ని ట్లుండ నిది వేళ యయ్యె
ధర బృహన్నలపేరు ధరియించి మించి
వెర వొప్పఁ బేఁడి నై విహరించువాఁడ.
ఏయునప్పుడు నారి యిరుగేలఁ దాఁకి
కాయ కాచినపల్లు కానరా కుండ
సంకులు దాల్చి యాజాను బాహువుల
నంకించి అవికచే నందంబు మాన్చి
ధృతి నాటయొజ్జ నై తెల్లంబు గాఁగ
నతనికన్నియలకు నాట నేర్పుదును.
జనపతి నన్ను నెచ్చటివాఁడ వనిన
విను కృష్ణయింటను విహరింతు నందు"
అనవుడు సది యొప్పు నని ధర్మరాజు
ననిచినవగ దోఁప నకులు నీక్షించి
"వీనిసౌందర్యంబు విశ్వమోహనము,
వీనిచారిత్రంబు విశ్వసంస్తుతము,
వినుతింపఁగా రాదు వినయసంపదలు.
వినుతింపఁగా రాదు వీర్యాతిశయము.

# ద్విపదభారతము.

రసికుండు నయశాలి రాజపూజితుఁడు
వసుధలో భారతవంశవర్ధనుఁడు ;
సకలవిద్యలయందు సార్వభౌముండు ;
ప్రకటింప వీఁ డెట్లు పరుల సేవించు?"
నన విని నకులుండు నవనీశుతోడఁ
దనకుఁ దోఁచినరీతిఁ దగ నిట్టు లనియె:
"ధరణీశ, నాకు నై తలఁకఁగ నేల
వెర వొప్ప నొకయేఁడు విహరించు టెంత
సాహిణి నై మత్స్య జనపాలునొద్ద
నూహించి దిద్దుదు నుత్తమాశ్వముల.
కుఱుచకళ్లెంబులఁ గొదమగుఱ్ఱముల
నొఱపుగా మరిగించి, యొఱ్పు వాటెల్ల
బిరుదువారువముల బీరువోఁ దఱిమి
వరుస నోజకుఁ దెచ్చి పఱపింప నేర్తు.
ఒనర గోడిగజాతి నుత్తమం బెఱిఁగి
యను వైనమావుతో హత్తింప నేర్తు.
తేజీలత్రాణాల తెఱఁ గెల్ల నెఱిఁగి
నైజంబు చెడకుండ నడపింప నేర్తు.
మఱియు లాయములోని మానటీలకును
మఱివక మేటి నై మనుజేంద్రుఁ గొలుతు.

అపుడు దామగ్రంధి యనుపేరు చెప్పి
రిపుల కగ్గల మైనరీతి నుండెదను.
అరసి నా చోటు రా జడిగె నేనియును
వరుసఁ బాండవులతో వర్తింతు నందు"
అనవుడుఁ గౌంతేయుఁ డటు సమ్మతించి
వెనుకొని సహదేవు వీక్షించి పలికె:
"మనసు కుందెడి వీనిమార్గంబుఁ జూడఁ;
బెనఁగొన్న వగల కోర్వెడువాఁడు గాఁడు.
తద్దయు మన్నించి తగఁ గుంతిదేవి
ముద్దు సేయఁగ నుండు ముద మార నెపుడు.
కుటిలంబు లెఱుఁగడు, గుణగణాధికుఁడు,
పటుబాహుబలమునఁ బ్రౌఢుఁ డెంతయును.
తను వెంతయును లేఁత; దైవంబుకతనఁ
జెనసి రాజుల నెట్లు సేవింప నేర్చు?"
అనవుడు సహదేవుఁ డన్న నీక్షించి
తనకుఁ దోఁచినరీతిఁ దాఁ జెప్పఁ దొడఁగె:
"కీలారితనము నేఁ గ్రీడతోఁ దాల్చి
యాలకుఁ గర్త నై యవనీశునొద్ద
నందంబుగా నుందు; నందు నొక్కింతఁ
బొందుగా నెఱుఁగుదు, భూనాథ, వినుము:

ఎచ్చోటనుండి నీ వేతెంచి తనినఁ
గ్రచ్చరఁ బాంచాలి కడనుండి యుందు."
అనవుడు శంకించి యమతనూభవుఁడు
వనితఁ దప్పక చూచి వల నొప్పఁ బలికె:
"వనజాక్షి నీ విట్లు వర్తించునపుడు
జననాథునగర దుర్జను లుండిరేని
విపులభారతవంశవిభులకు మాకు
నపకీర్తి రాకుండ నడఁకువ నుండు.
నీకంటె నెఱిఁగెడి నెలఁత లున్నారె?
చేకొని యొకమాటఁ జెప్పి చూపితిని."
అనుటయు నమ్మాట లాలించి యతివ
వినుతహాసము దోఁప విభున కిట్లనియె:
వర్తింతు నెట్లైన వసుధేశ యేను
"వర్తించుపనికి నై వగవంగ నేల?"
అనిన సంతోషించి యాధర్మరాజు
మునుకొన్న వేడ్కఁ దమ్ముల నెల్లఁ జూచి,
"ఇట్లున్న మనలను నింక శాత్రవులు
ఎట్లు కాంచెదరు తా రియ్యేటిలోన?
వేయుమాటలు నేల, వేడ్క నిందఱముఁ
బోయి కొల్తము మత్స్య భూమిపాలకుని.

అమరంగ మన వైనయగ్నిహోత్రములు
రమణమై ధౌమ్యులు రక్షింపఁ గలరు.
ఈరథంబులు గొంచు నెలమి సారథులు
ద్వారకానగరి కిం దఱుఁ బోవువారు.
పరఁగ ద్రౌపదియొద్దిపరిచారికలును
దొరసి వండెడువారు ద్రుపదుఁ జేరుదురు.''
అని బుద్ధిగాఁ జెప్పి యఖిలసేవకుల
ననిచి భూతలనాథుఁ డనుజులుఁ దాను
నొప్పుగా నరుగుచో నొనర ధౌమ్యుండు
చెప్పె ని ట్లని రాజు సేవించు తెఱఁగు :

ధౌమ్యుఁడు పాండవులకు సేవాధర్మంబు
తెలియఁగించుట.

'' పాండునందనులార, బలియు రౌ మీరు
ఒండొక్క విభుఁ గొల్చి యుండు టచ్చెరువు!
మద మేఁది మానాపమానంబులకును
మది నోర్చి కాని నెమ్మదిఁ గొల్వ రాదు.
ఓర్వక యొక రొక రుగ్రింతు రేని
గీర్వాణపతి నైన గెల్వఁ జాలుదురు.
కావున మీకు నేఁ గడఁగి భూపతుల
సేవించుగతిఁ గొంత చెప్పెద వినుఁడు.

# ద్విపదభారతము.

ఎఱుఁగువారికి నైన నిటుపెద్దవార
మెఱిఁగించుభంగిపై నిష్టంబు కలదు.
మనుజేంద్రుఁ గొల్చునమ్మనుజుండు దెలిసి
తనకుఁ బోలినచోటఁ దా నుండ వలయు.
విభునిముందరఁ బోక, వెనుకకు రాక,
సభలోన నిల్వఁ బా ర్శ్వంబుల నొప్ప
నిలుచుచు, విభునిపై నిజదృష్టి నిలిపి,
మెలపుమైఁ బనులకు మేకొన వలయు.
నరపతి మన్నించు నా కేమి యనుచు
మరియాద మీఱుట మఱిఁ గార్యహాని.
విభునియేకాంతంబు వెలిఁ బుచ్చరాదు;
విభునితో నొకమాట వివరింపరాదు;
అంతఃపురంబులో నతిమైత్రి తగదు;
కాంతలు సభ నెందుఁ గాన్పింపరాదు.
ఒప్పువాహనములు నుత్తమాశ్వములు
నెప్పుడు విభుఁ డీక యెక్కఁగరాదు.
మన్నించుచో నుబ్బు మనుజేంద్రుకినుక
దన్నుఁ జెందినచోటఁ దగదు దైన్యంబు.
ఎండైన వా నైన నెల్లను నోర్చి
మండలేశ్వరుపంపు మఱిఁ జేయ వలయు.

భూమీశుసొమ్ముఁ జెందున నాసపడక
పాము నెమ్ములు గాఁగ భావింప వలయు.
ఆవలింతయుఁ దుమ్ము హాస్యంబు నుమియు
వేవేగ విభునొద్ద వెలిఁ బుచ్చరాదు
వైరిదూతలతోడ వడి నల్పుతోడఁ
జేరి భాషించినఁ జెడు నెంతవాఁడు.
తొడరి భూపతిసెయొద్దిదోమతో నైన
విడువనిపగ మోఁచి విహరింపరాదు.
కుడిచి కట్టితి నేమి కొఱఁత నాకనుచుఁ
బుడమిలో మెఱయుచుఁ బొంగంగ రాదు.
ఇది యంతఁ దలపోసి యీమత్స్యవిభునిఁ
గదిసి వర్తింపుఁడు కార్యసిద్ధికిని."
అని లోకహితముగా నప్పురోహితుఁడు
వినిపించుటయు నీతి విని పాండుసుతులు,
"అతికృతార్థుల మైతి మయ్య, మీవలనఁ
జతురసేవాధర్మచరితంబు దెలిసె.
తల్లిదండ్రులరీతిఁ దగ బుద్ధి చెప్పి,
ఉల్లంబు చల్లఁగా నుపచరించితిరి.
పోయి వచ్చెద మింకఁ బొలుపైనలగ్న
మాయితంబుగఁ జేసి యనుపుఁ డీ" రనిన

ధౌమ్యుండు నగ్నిహోత్రములు దెప్పించి
కామ్యపూజలు చేసి గమనమంత్రములు
జపము సేయుచు నున్నసమయంబునందు
నృపతు లేవురు లేచి నెలఁతయుఁ దారు
నసలార నతనికి నగ్ని దేవునకు
వెసఁ బ్రదక్షిణముగా వేడ్కతో వచ్చి
సుముహూర్త మనిపించుశుభనిమిత్తములు
క్రమముతోఁ జూచుచుఁ గదలి రందఱును.

### విరాటనగరంబునకుఁ బోవఁ బాండవులు వెడలుట.

అప్పుడు ధౌమ్యుండు నగు దేర నృపులు
తప్పక కాళిందితటమును వెడలి,
మిగులుపాంచాలభూమికి దక్షిణముగ
మొగి శూరసేనభూములలోనఁ జొచ్చి,
పడమటిముఖముగాఁ బ్రతివాసరంబు
నడచి పోవుచు నెట్టి నగరంబుఁ జొరక,
అడవిలోఁ గూరలాహారంబు చేసి,
తడయక బహువినోదములు చూచుచును,
పొలు పారుచల్లనిపొదరిండ్లఁ జూచి,
చెలఁగి యం తంతటఁ జేరి నిల్చుచును,

వెలయుపద్మములచే వినుతింపఁ బడిన
కొలఁకుల జలకేళిఁ గోర్కెఁ జేయుచును,
బహువర్ణమృగముల బహుపక్షితతుల
బహునదీనదములపంక్తిఁ జూచుచును,
జని చని మత్స్యదేశముఁ జేరఁ బోయి
తనరార నంతట ధౌమ్యు వీడ్కొలిపి
రతఁడుఁ బుణ్యాశ్రమోపాంతభూములకుఁ
జతురుఁడై యేతెంచి సద్గోష్ఠి నుండె.
అటు పాండవులు పోవునపుడు పాంచాలి
పటుశోకవివశ యై పతుల కి ట్లనియె:
ఆసన్న మని వచ్చి యతిదూర మేను
గాసిల్లు టెఱుఁగరు కడవ నేగెదరు.
కొలఁకులు నదులును గోర్కెఁ జూపుచును
నిలిచెద మని యెందు నిలువ కేగెదరు.
మిడుకుమధ్యాహ్నము మెఱయఁ గాల్నడను
విడువక చనుదేర వెలఁదు లోపుదురె?
కాళ్లనఖములందుఁ గ్రమ్మె రక్తములు;
వ్రేళ్లపుటంబుల విరిసె బొబ్బలును;
పొందుగాఁ దఱచుటూర్పులు సందడించె;
ఇంకుండి నొచ్చితి నేను రా లేను.”

అనవుడుఁ గరుణించి యాధర్మరాజు
పనివడ నకులుఁ దప్పక చూచి పలికె:
“ఏది ప్రొద్దున నైన నీమత్స్యపురికిఁ
బోదము మన మంచుఁ బొదిగూడి యిట్లు
వడి వచ్చుమనవెంటఁ బాంచాలి యకట
వడ దాఁకి రా లేక బడలుఁ జూచితివె?
ఏచందమున నైన నీచంద్రవదన
మోఁచి తేవలె నీవు మొగిఁ గొంతదవ్వు.”
అనవుడు నకులుఁ డయ్యవనీశుమాట
విననివాఁడును బోలె వెస నూర కున్న,
మనుజేంద్రుఁ డప్పుడు మఱి యేమి యనక
యను వొంద సహదేవు నట్లు పల్కుటయు,
గొనకొని యతఁడుఁ గైకొన లేమి నెఱిఁగి,
తనయానతిని గ్రీడి తలఁ దాల్చు నంచు
మఱి ధనంజయుఁ జూచి మనుజవల్లభుఁడు
తఱి *చైనకన్నీరు దలఁక నిట్లనియె:
“ఎంతెంత నడచిన నీమత్స్యనగర
మంతంత దూర మై యరుగుచున్నదియు.
ఈమధ్యమున నుండ నిమ్ము లే దెందు.
నీముద్ధ రా నోప దిఁక నింద్రతనయ.

ప్రాకటంబుగ నేఁటిపయనంబునందు
నీకు బాంకఁగ నేల నేను నొచ్చితిని.
ఓపి యీతనుమధ్య నొకయింత దవ్వు
ఏవు మీఱంగను నెంతయుఁ బ్రీతి
మూపుపై నిడికొని మోఁచి తెచ్చినను
నీపేరుగా నొక్క నెలవు సేరుదుము.”
అనవుడు నౌఁ గాక యని సవ్యసాచి
తనభుజంబులమీఁదఁ దరళాక్షి నునిచి
తామరఁ గొని తెచ్చు దంతిచందమునఁ
బ్రేమతో నేతేరఁ బృథివీశుఁ డపుడు
పురముఁ జేరితి మంచుఁ బురగోపురములు
సారిదిఁ దమ్ముల కెల్లఁ జూపి యి ట్లనియె:

పాండవులు తమయాయుధముల దాఁప
నిశ్చయించుట.

“ఈ దేహకాంతులు నీయాయుధములు
ఆదట ధరియించి యటఁ బోవ రాదు:
తగినరూపంబులు దాల్చి కైదువుల
నొగి దాఁప వలె నింక నొక్క దాపునను.
ఈగాండీవముఁ గన్న నెఱుఁగరే మనల
బా గైనపెనుపాము భంగి నొప్పెడిని.

మనవిం డ్లెఱుంగరే మహి నెల్లజనులు?
జనులకు నివి యవశ్యముఁ జూప రాదు.
అమరేంద్రతనయుండు ననయంబు వింటి
నిమిషమాత్రముఁ బాసి నిలువంగ లేఁడు.
ఎట్లైన నివి దాఁచు టిదియె కార్యంబు.
చోట్లు గుఱుతు గాఁగఁ జూచి రం" డనిన
నేఁ బోదు నని పూని యెలమి నర్జునుఁడు
పూఁబోణి నొకచోటఁ బాలు పార నునిచి
యలయక వీక్షింప నటు పోయి పోయి
పొలుపు మీఱినప్రేతభూమిచెంగటను
గనియె నానాభూతకలితాట్టహాస
ఘనకాకఘూకభీకర మైనదాని,
మిన్నేఱు శిరమున మేనఁ బాములను
జెన్నారఁ దాల్చుచు శివుఁ బోలుదాని,
గాండీవ మిచ్చినకర్త నాయందు
నుండు నీ విటఁ జాప మునుప రమ్మనుచు
మొగిఁ గ్రీడిఁ బిలుచుచొప్పున గాలిఁ గదలు
చిగురాకుచేతులఁ జెలు వైనదాని,
భావింప నిష్టంబుఁ బాండుపుత్రులకుఁ
గావింప నొకవేళ గలిగె నా కనుచుఁ

బొనర సంతోషించి పులకించె ననఁగ
ఘనకంటకములచేఁ గర మొప్పుదాని,
విస్తార మగుజమ్మి వీక్షించె నపుడు.
ప్రస్తుతు లొనరించి బాగయ్యె ననుచుఁ
జెప్పంగఁ దొడఁగెఁ దోఁచినయుపాయంబుఁ
దప్పక చనుదెంచి ధర్మరాజునకు:
"అల్లదె జమ్మి మీ రవధరించితిరె?
ఎల్లశస్త్రంబుల నిందు దాఁపుదము.
జనులకు రాఁ బ్రయోజనము లే దిందు;
జననాథ వచ్చియు సాధింప లేరు.
శవముకైవడి దోఁపఁ జర్మంబు పొదివి
భువిమీఁద నేరికిఁ బొడసూప కుండ
శరచాపములఁ గట్టి జమ్మిపైఁ బెట్టి
వెర వొప్ప నెం దైన విహరించి మనము
క్రమ్మఱఁ జనుదెంచి కైకొనం దగును.
ఇమ్ముగా నీవేళ కిది నాకుఁ దోఁచె."
అనవుడు నౌఁ గాక యని ధర్మసూనుఁ
డనుజులుఁ దాను నొయ్యన జమ్మిఁ జేరి
"వెలయ మీమీవిండ్లు వెస నెక్కు డించి
యల వొప్ప నాచేతి కంది యుం" డనినఁ

బన్నుగాఁ దనవిల్లు పార్థుండు చూచి
కన్నుల బాష్పంబు గ్రమ్మ ని ట్లనియె:
" ఇది సాధనంబుగా నెల్లరాక్షసులఁ
బ్రిదశేంద్రవైరులఁ దివిరి సాధించి
యనిమొన గర్వాంధు లైనశాత్రువుల
జను లెల్లఁ గొనియాడ సంహరించితిని.
కడపట నొకవ్రూనఁ గట్టి యీవిల్లు
విడువంగ వలసె, దైవిక మేమి చెప్ప!"
అని యెక్కుడించుచు నాధర్మసుతుని
ధనువుఁ దప్పక చూచి తలఁకి వెండియును
" ధర్మజ, యీవిల్లు ధరియించి నీవు
దుర్మార్గులను నెల్లఁ ద్రుంచి వైచితివి.
భారతరాజ్యంబు భయము లేకుండ
నారసి యీవింట నాజ్ఞ పెట్టితివి.
దనుజు లెయ్యది గన్నఁ దల్లడిల్లుదురు,
ధను విట్టిదియు నీకు దాఁచంగ వలసె!"
అనుచోట ధర్మజుం డది యెక్కుడించి
వెనుకొని భీముని వీక్షించి పలికె:
" సైంధవయక్షపాంచాలసైన్యముల
నంధించి బకవైరి చంపి తీవింట.

ప్రకటబాహాశక్తి పరఁగ నీవింట
నకులుండు సౌరాష్ట్రనాథు మర్దించె.
కాళింగపాండ్యమాగధుల నీవింటఁ
జాల భీతిలునట్లు సహదేవుఁ డేసె.
ఇట్టికైదువు లెల్ల నిదె నేఁడు మోఁపు
గట్టి ప్రమోకున నార కట్టంగ వలసె!"

పాండవులాయుధముల శమీవృక్షమున
దాఁచుట.

అని మొక్కుడించుచు నన్నికైదువులు
ఘనగదాఖడ్గచక్రములతోఁ గూడఁ
బెట్టెలోఁ బాములఁ బెట్టుచందమునఁ
బట్టి నెట్టనఁ గట్టి పైఁ దోలు బొదివి
యామీఁద వెంద్రుక లమరంగఁ జుట్టి
భూమీశుఁ డవి గొంచు భూజంబుఁ బ్రాఁకి
యప్పుడు ధీరుఁడై యఖిలదేవతల
నొప్పఁగాఁ బ్రార్థించి యోలి నిట్లనియె:
"నేనును విజయుండు నేతెంచునపుడు
కాని మీరూపులు గాన రా నీక
వర్తింపుఁ డయ్య యెవ్వరు వచ్చిరేని;
కీర్తింపు చున్నాఁడఁ గృతపుణ్యులార,

అరులపై మనభీముఁ డాగ్రహం బెత్తి
యరుదెంచుఁ బలుమాఱు నాయుధములకు.
ఇయ్యేటిలో విూర లితని కేమఱక
చయ్యన నొకమాయ సవరింపుఁ డయ్య."
అనుచు ధర్మజుఁ డంత నాశ్రమాను డిగ్గి
పొనరఁ బ్రదక్షిణం బులు చేసి మ్రొక్కి
భీముఁడీ పనికిఁ గోపించునో యనుచు
భీముని కొక్కింత ప్రియముగాఁ బలికి
యతనిఁ గౌఁగిటఁ జేర్చి యచ్చోటఁ గొంద
ఱితరులు వర్తింప నిచ్చలో బెదరి
తా రొండొరులతోడ దగఁ బల్కురీతి
వారికి మఱుపెట్ట వలసి యిట్లనియె:
"మొదల నూఱేఁడులముసలివై తల్లి
యిది యీడుదీఱిన నిట్లు చేసితిమి.
పూని వీనుఁగుఁ గాల్చి పోదురు కాని
ప్రమానఁ గట్టెడువారు మహిలోనఁ గలరె?
తడయక మనకుఁ బెద్దలు సేయుజాడఁ
గడఁగి చేయక పోదు కానఁ జేసితిమి."
అని యిట్లు పలుమాఱు నచటిగోపాల
జనములు విన నాడ సహదేవుఁ డంత

బలిసి యచ్చట నొక్క పసరంబు చచ్చి
యిలమీఁదఁ బడి యుంట నీక్షించి యీడ్చి
దానితో లోలిపించి తమకైదువులకు
వానకు మాటుగా వమనఁ జుట్టించి
మఱియు నచ్చట నొక్క మనుజునిబొంది
యరసి నిస్సార మై యది యున్నఁ జూచి,
ఇది యుంఛవృత్తిచే ని ట్లయ్యె ననుచుఁ
గదిసి కైదువులతోఁ గట్టించె నదియు.
ఇత్తెఱంగున జమ్మి నెల్లకైదువులు
మొత్తంబుగాఁ బెట్టి మోదించి నృపులు
ఘోర మైపర్వ నీదుర్గంధ మెవరుఁ
జేరరు పొమ్మంచుఁ జిఱునవ్వు నగుచు
నచ్చోటుఁ బాసి తా రామత్స్యపురికి
వచ్చుచో నప్పు డవ్వసుధేశుఁ డనియె:
"ఒరు లెఱుంగక యుండ నొక్కొక్కపేరు
ధరియింతు మది మీరు తగవుగా వినుఁడు.
అరుదార జయుఁడు జయంతుండునువిజయుఁ
డరయ జయత్సేనుఁ డలజయోద్బలుఁడు,
మఱవక మనలోన మనము పిల్చుటకుఁ
దెఱఁ గొప్ప నివి నామధేయంబు లిపుడు"

అని చెప్పికొని పోయి యట వేడ్కతోడఁ
జనరారఁ గాళిందితటిఁ జేరి నృపులు,
అందుఁ దీర్థము లాడి యట సేద దేఱి
యందఱు సుఖ మున్న యవసరంబునను,
పదిలంపునిష్ఠతోఁ బాండవాగ్రజుఁడు
ముద మొప్పఁ దూరుపు మొగముగా నిలిచి
కరములు మొగిచి యాకాశంబుఁ జూచి
పరఁగ నంతకు నిట్లు ప్రార్థించి పలికె:
"ధర్మదేవత, నాకు దయ నొక్కవరము
నిర్మించి తది నేఁడు నెమ్మి నీ వలయు.
అది నమ్మి దుర్యోధనాదివైరులకు
నోడుఁగక వర్తింతు నుర్వి నీయేఁడు.
నాఁడు నాతమ్ములు నడుకానఁ బడినఁ
బోఁడిగా బ్రదికించి పొడచూపి నీవు
మాకు బుద్ధులు చెప్పి మము నూఱడించి
మాకు నిచ్చినయీవి మఱవంగ లేము"
అని తారు విప్రుని యరణిఁ దేఁ బోయి
ఘనత నొందినమేలు గాన రా నాడి,
ఏ పార మోడ్చిన యిరుగేలు నొసల
దాపించునంతలో ధర్మరాజునకుఁ

గాషాయవస్త్రంబు ఘనకమండలువుఁ
బాషండగతి గానిపట్టెవర్ధనము
దండపుఁగోలయుఁ దగినపాదుకలు
మెండైనజపమాల మెఱయ నాత్మీయ
యలవడి యతివేష మాయితంబైన
నెలమి సంతోషించి రెల్లపాండవులు.
అప్పుడు మఱియుఁ బ్రత్యక్షమై నట్లు
తప్పక నృపుల నంతకుఁడు మన్నింప
నేరూప మెవ్వారి కిష్టమై యుండె
నారూపములు చాల నందమై యుండఁ
జీరలుఁ దొడవులు శృంగారములును
వారకంబులు పోలె వరుసగాఁ గలిగె.
పరితోషమున నంతఁ బ్రథమపాండవుఁడు
పరఁగఁ దమ్ములఁ జూచి పాంచాలిఁ జూచి
క్రమ మొప్ప నొక్కొక్కరు వచ్చుపట్ల
రమణఁ గట్టడ చేసి రాజసం బణఁచి
యొగిఁ బెక్కుతెఱఁగులై యున్నపాచికలు
తగ నొప్ప ముడిగొని తాను గ్రహించి
పోవుచో విరటుండు పుణ్యంబు పోలె
నావేళలీల నొప్పారెఁ గొల్వుండి.

### ధర్మజుఁడు యతివేషమున విరాటుసభకు వచ్చుట.

యతివేషధారి యై యరుదెంచుధర్మ
సుతునిఁ దప్పక చూచి చోద్యంబు నొంది
తనప్రధానులకు నాతనివంకఁ జూపి
మనసులో హర్షించి మఱియు ని ట్లనియె :
“ ఉన్నతి యతినాథు నొనరఁ జూచితిరె ?
కన్నులపండు వై కానంగఁ బడియె.
భువనత్రయము నేలుపుణ్యుఁడో యితఁడు ?
అవనిలో భిక్షుకుం డని చెప్ప రాదు.
ఓలి నీతనిఁ గొల్చి యుభయపార్శ్వముల
నేలొకో చనుదేర విభతురంగములు ?
చెలు వైనమూర్ధాభిషిక్తు నీపురుషుఁ
గొలిచి రా రేలొకో కోటిసద్భటులు ?
వెలిగొడుగులనీడ వింజామరలకు
నలవడెఁ దోఁచ నీ యతిభాగ్యరేఖ.
యతిరూపధరుఁ డైన నగుఁ గాక యితని
జతన మై పాయదు సౌభాగ్యలక్ష్మి.
ఈవంకఁ దనకు రా నేమి కారణమొ ?
భావింప మన మేమి భ్రాంతి యీతనికి ?

అమగులసౌభాగ్య ములరుఁగా ఇతని
కడిగిన నీరాజ్య మైన నిచ్చెదను.
ఇచ్చునంతియ కా దిఁ కేను నాప్రజలు
నిచ్చలుఁ బరిచర్య నెమ్మిఁ జేయుదుము"
అని లేచి నృపచంద్రుఁ డాయతీంద్రునకు
నెనసినభక్తితో నెదురుగా వచ్చి
కన్నంతటనె మ్రొక్కి ఘనతఁ దోడ్తెచ్చి
యున్నతాసనమున నొనరంగ నునిచి
పనివడి పన్నీటఁ బాదము ల్గడిగి
తనమేనివలువచేఁ దడి యొత్తి భక్తి
చెలువారఁ దనువున శ్రీగంధ మలఁది
పొలు పొప్పఁ జేతులు మోడ్చి యి ట్లనియె:
"ఎచ్చోట విహరింతు, రేది మీనామ,
మెచ్చోటి కేగెద, రేది కారణము?
చెప్పుఁడు నిజముగాఁ జెలిమి మాతోడ;
ఇప్పుడు భాషింప నిచ్చె నీశ్వరుఁడు."
అనవుడు విని మందహాసంబు చేసి
తనర నయ్యతివేషధారి యి ట్లనియె:
"మన్ను మిన్నును నీరు మారుతం బగ్ని,
ఇన్నియుఁ గూడఁగా నీశరీరంబు

ప్రజల కొఁదవెఁ దొట్రుపాటు గావింప ;
నిజ మాడ నెవ్వఁడు నేర్చు లోకమున ?
అది యట్టు లుండె, మత్స్యాధీశ వినుము.
చదు రొప్పుకురుభూమి జన్మదేశంబు,
చెలువార ధర్మజుచెలికాఁడ నేను.
పలుకు లేటికి ? కంకభట్టు నాపేరు.
నెఱవుగా జూదంబు నృపతిలక్షణము
నెఱుఁగుదు ; కథలలో నేఁ బ్రవీణుఁడను.
నాకును బగవారు నాధనం బెల్లఁ
జేకొని వెడలఁ ద్రోచిన వచ్చి యేను
నీగుణంబులు విని నిన్నొక్కయేఁడు
బాగొప్ప సేవింతుఁ బ్రతినతో ననుచు
రయ మొప్ప వచ్చిన రాక యీరాక.
నియమ మేర్పడ నిట్లు నేర్పుతో నుందు.
ఉపకారమునకుఁ బ్రత్యుపకార మేను
నృప చేయ నోపుదు నెఱి నొక్కయెడను.
ఇది వర్తనము గాఁగ నేఁడు నిండించి
పదిలమై పోవుదుఁ బగవారి గెలువ."
అన విని మనుజేంద్రుఁ డతని కిట్లనియె
వినయహర్షంబులు విజ్జోడుపడఁగ :

"అట్లు చేయుఁడు, పొందుఁ డఖిలభోగముల
నెట్లు కావలసిన, నే నున్నవాఁడ,
ఎవ్వఁడు మీకును నెగ్గు గావించుఁ
ద్రెవ్వి వేయుదు వానిఁ దివిరి నన్బంపు.
ఇది యేల? మీకు మమ్మేలి సామ్రాజ్య
పదవిఁ జేకొన రాదె పరిణమించెదను.
ఏలినఁ ద్రిజగంబు లేల నోపుదురు!
పోలింప మామత్స్య భూమి మీ కెంత?"
అన విని దరహాస మాననాబ్జమునఁ
దనరార నతనితో ధర్మజుం డనియె:
వడి నేలఁ బడి యుండి వట్టిపంటలను
గుడిచి నెమ్మది నుండుకొలఁది మాకొలఁది.
భూము లేలఁగ నేల? భోగంబు లేల?
భూమీశ నీ వింత బోధింప వలదు."
అనవుడు భూపాలుఁ డటు సమ్మతించి
తనకు జూదముమీఁదితమకంబు చెప్పి
మీతోడిసద్గోష్ఠి మే లయ్యె ననుచుఁ
బ్రీతుఁ డై కౌంతేయుఁ బెద్ద మన్నించె.
అతఁ డిట్లు భూనాథు నర్థితోఁ గొలిచి
యతిమాన్యుఁ డై యున్నయవసరంబునను,

## భీముఁడు బావనీఁడై విరటుఁ గొలువ వచ్చుట.

వంటలవానికై వడి దోఁప భీముఁ,
డొంటిమైఁ జట్టువం బొకకేలఁ బట్టి
చంక నుగ్రపు పేతి సవరించి దిండు
వంకిణితోఁ గూడ వడిఁ బట్టి బిగిచి
కోలలు డాకేలఁ గొన్ని సంధించి
లీలఁ జిత్రించినలేఁదోలు దాల్చి,
అతిధీరుఁడై తనయన్న చెంగటికి
గతిగూడి మత్తేభగమనంబుతోడ
విరటసభ్యుల కెల్ల వ్రేఁకమై తోఁప
వెరవుతో నాస్థానవీథి డగ్గఱెను.
అల్లంతఁ బొడఁగాంచి యతనియుద్ధృతికిఁ
దల డంబంది యెంతయుఁ జోద్యమంది
జనులు వారికి వారు సంభ్రమింపఁగను
దనలోన ని ట్లని తలపోసె నృపుఁడు:
«భీమబాహాశక్తిపేర్మి వీక్షింప
మే మెన్నఁడును జూడ మిట్టిమానవుని.
మానవమాత్రుఁడే మహిలోన నితఁడు?
భానుఁడో మఱిచిత్రభానుఁడో కాక!

ఇతనివంశముఁ బేరు నెట్టిదో ధాత్రిఁ
గృతమతిఁ దెలియువా రెవ్వ రిచ్చోట?
వచ్చుకార్యము చెప్ప వలెఁ గాక యితని
కిచ్చెద రాజ్యంబు నేను గైకొనక."
అనుచోట విభుఁ జేర నరిగి వాయుజుఁడు
మునుకొని వినయసంపూర్ణుఁ డై మ్రొక్కి
"కులమున శూద్రుండఁ గువలయాధీశ
సోలయక మును ధర్మసుతుబానసీఁడ.
వలలుండు నాపేరు; వసుధ నెవ్వారును
దలఁప నాసరి గారు తగినవంటలకు.
నినుఁ గొల్వ వచ్చితి; నీ వింక నాకు
నొనరఁ గూడును జీరయును బెట్టు చాలు.
పురణించి యుబ్బెసపోక నీయెదుట
బెరసి యేనుఁగుతోడఁ బెనఁగు లాడుదును;
కాఱెనుపో తైన ఘనసింహ మైన
మీఁటి పట్టఁగ నేర్తు మెదలి పోకుండ.
అంచితశక్తి నే నన్న మల్లులును
పంచబంగాళ మై పాఱి పోవుదురు.
ఏలిన నేలు న న్నేలుశూరులకు
మేలుబంతియ పోలె మెలఁగు చుండెదను."

అనవుడు విరటుఁ డయ్యనిలసంభవునిఁ
గనుఁగొని పలికె నుత్కంఠ దీపింప:
"ఎక్కడిమాట నీ వెట్లు శూద్రుఁడవు?
చిక్కనినీమేనిచెలువంబు చూడఁ
బ్రాకటసామ్రాజ్యపద మూను గాదె!
నీకు నేటికి నింత నీచవర్తనము?
వివిధవాహనములు వివిధసంపదలు
సవరించి యిచ్చెదఁ జనవుతో నుండు."
అనుటయు భీముఁ డొయ్యన మోము గలఁగ
మనుజేంద్రుమాట సమ్మతి గాక పలికె:
"అవి యొల్ల, నా కిష్ట మైనమార్గమునఁ
గువలయాధిప నన్నుఁ గొలిపించికొనుము.
ఓపవేనియుఁ దెల్పు ముత్తమోత్తమము,
వే పోయి వే ఱొకవిభునిఁ గొల్చెదను.
ఏమిరో నీచిత్త మెఱిఁగింపు మనిన"
భూమిపాలుఁడు వాయుపుత్త్రుఁ బ్రార్థించి
"నీకాంతి కను వైనరీతిఁ జెప్పితిని;
కా కున్న మానె నాగ్రహ మేల నీకు?
వలల నావద్ద నీ వలసినయట్లు
కలకాలమును నుండు కడువేడ్క తోడ.

వండెదువా రెల్ల వరుస నీయాజ్ఞ
నుండెడివారిఁగా నోరిమగా నుండు.”
మని చెప్ప బకవైరి యత్యాదరమున
మనుజేంద్రుఁ జేరి నెమ్మది నుండె నంత.

అర్జునుఁడు పేడి యై విరటునిసభకు
వచ్చుట.

ధీరతఁ బేడి యై దేవేంద్రుపట్టి
వారక పురుషభావము లేక యణఁచి,
సంకుల ఘనబాహుసౌందర్య మెడల
నంకించి, అవిక దేహముకాంతి మాన్ప,
చెలు వైనపవడంబు చెవులసొం పణఁప,
అలకలు నుదుటిసొ రణఁగించి యలమ,
మంచు పైఁ గవిసినమార్తాండుపగిది,
నించునిప్పులు గప్పని ప్పున్నయట్లు,
వేషంబు ధరియించువిష్ణుచందమున,
రోషంబు మానినరుద్రుకైవడిని
వాఁడుదేరినమోము ప్రాభవం బణఁప
వేడుకతో వచ్చె విభుఁ డున్న యెడకు.
వచ్చి యచ్చట నున్నవారిచూడ్కులకు
మెచ్చుగాఁ దనరూపుమేల్మిఁ గాన్పించి,

ఓయారమున జంగ లొఱపుగా నిడుచుఁ
బాయక కరిరాజబాగుఁ గైకొనిన,
కొలువువారల కెల్లఁ గువలయాధిపుఁడు
సొలయక నరువంకఁ జూపి యి ట్లనియె."
"పొలఁతిసింగారంబుఁ బురుషభావంబుఁ
గలిగి యున్నది దీనిఁ గంటిరే మీరు?
తేజంబుపొడవును దృష్టింప నరుఁడు,
రాజసంబును జూడ రమణి కా నోపు.
ఈడు జోడును లేక యెవ్వఁ డే నొకఁడు
వేడుకఁ గైకొన్న వేషంబు గాక,
ఇంతవానికి నేల యీవికారంబు
పంత మాడినయట్లు ప్రాపించె నకట!
చెప్పుఁడు మీకుఁ దోఁ చినజాడ" యనినఁ
జెప్ప నేరక వారు చింతించునెడను,
భూపాలు దగ్గఱఁ బోయి జిష్ణుండు
తీ పారుమాటలఁ దెలియ ని ట్లనియె:
"నిన్ను వేడుకఁ గొల్చి నృపచంద్ర యేను
గన్నియలకు నాటఁ గఱప వచ్చితిని.
ఇల బృహన్నలనామ మింపారు నాకు;
కొలచె దైవాధీనమునఁ బేడితనము.

దండలాసకమును దగు పెక్కణంబుఁ
గుండలియును నేఱుంగుదుఁ బేరణంబు.
నటన నాయిరువదినాల్గుహస్తముల
బటువు చూపఁగ నేర్తుఁ బ్రతితాళమునకు.
కేలఁ దాళంబులఁ గీలింప కొడల
నాలోలగతి గీత మభినయింపుదును.
తనరఁ బాదంబులఁ దాళనిర్ణయము
గనుపట్ట భావంబుఁ గాన్పింప నేర్తు.
భావాశ్రయంబులు పరికింప నేర్తు.
భావించి న న్నేలు భరతవిద్యలకు.»
అనవుడు నృపచంద్రుఁ డమ రేంద్రసుతునిఁ
గనుఁగొని తనకోర్కి కాన రాఁ బలికె:
«ని న్నిట్లు పేడిగా నిర్మించె బ్రహ్మ!
సన్నుతింపఁగ నీవు సౌభాగ్యనిధివి;
ఘనము లౌభుజములుఁ గఠినకాయంబు
దిననాథు తేజంబు దీర్ఘనేత్రములు
నీకు నొప్పినయవి; నీవు నాయొద్దఁ
జేకొని వర్తింపఁ జింతించె దేని,
ఒనర నావిండ్లలో నొకమంచివిల్లు
ఘనవజ్రకవచంబు ఖడ్గాయుధములు

వలయుభూషణములు వారువంబులును
వెలయు నిచ్చెద నుండు విభవంబు మెఱసి.
నిన్ను మాభూమికి నృపునిఁగాఁ జేయు
నున్నచో ని ట్లాడ నుచితమే నీకు ?''
అనవుడు విభున కి ట్లనియె నర్జునుఁడు
తనరూపరేఖకుఁ దగుసిగ్గు దోఁప:
" ఆఁడుచందము తిర మై యుండు నాకు,
పోఁడిమిగా లేదు పురుషభావంబు ;
ఈనపుంసకవృత్తి యేమిశాపమునఁ
బూని యేతెంచెనో ! పొందుగా మిగుల
నడఁకువతో నుండు టది యొప్పుఁ గాని
తొడుగుచు మెఱవడి తో నుండ రాదు.
పాంచాలియింట నే వసియించినపుడు
మించినయారూపు మెఱసినఁ జాలు.
అచ్చోటఁ బాత్రల ననువుగా దిద్ది
మెచ్చులు పడయుదు మెఱవడితోను.
విను మాటయొజ్జ నై విహరింతు నిచట,
ఘనముగాఁ బిలిపింపు కన్యకాజనము.''
అనవుడు మనుజేంద్రుఁ డాదరం బొప్పఁ
దనపుత్రి యైనయుత్తరఁ బిల్వఁ బనిచె.

అదియును గైసేసి యరుదెంచె నపుడు
పదనుపెట్టినపువ్వుబాణంబుఁ బోలి,
ఘనలోకలోచనకైరవావళికి
నినిచిననిండువెన్నెలసోగఁ బోలి,
కెరలినమత్తకోకిలచంచుధారఁ
జిరుగక యున్నకెంజిగురాకుఁ బోలి.
కన్నులుఁ గురులుఁ జొక్కట మైనపిఱుఁదుఁ
జెన్నార సరి లేనిచెలువంబు నొంది,
ప్రన్ననివయసుచే బటువొప్పి చూడఁ
గన్నులపండు వై కల్యాణి యపుడు
తనవెంట నేతెంచు ధవళలోచనల
ననయంబుఁ బ్రీతిమై నందంద పిలిచి
వచ్చి మ్రొక్కిన ముద్దు వచ్చి భూవిభుఁడు
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి కూర్మి దైవార
మునిప్రేళ్లఁ జెక్కులు ముదముతోఁ బుణికి
తనమోముఁ గదియించి తనయమోమునను
నలినాక్షిమోముపై నలి రేఖ వ్రాసి
పలుమాఱుఁ గ్రొత్తగా భావించి చూచి
కువలయాధిపు డంతఁ గూతుఁ జూపించి
దివిజేంద్రసుతుతోడఁ దేటగా ననును:

“ఇచ్చెడియకు నాట నెలమిమైఁ గఱప
వచ్చునే?” యనుటయు వాసవాత్మజుఁడు
“పరిమళంబునఁ బొల్చు పసిఁడిచందమున,
కర మొప్పురుచి నొప్పు కస్తూరిపగిది,
అనఘ యీముగ్ధ నాట్యము నేర్చెనేని
చెనసి పండినయట్టిచెఱకు గా కున్నె?”
అని వేడ్క పుట్టించి యాకార్యమునకు
వినతి సేకొనుటయు విభుఁడు మోదించి
యసమున మన్నించి యాబృహన్నలకు
వెసఁ గప్పురముతోడి వీడె మిప్పించి
చెలు వైనతొడవులుఁ జీనాంబరములుఁ
గొలఁది కగ్గల యిచ్చి కొమ రొప్పఁ బలికె:
“ఇచ్చెద నీచేతి కీపువ్వుఁబోఁడిఁ
జెచ్చెర మృదువుగాఁ జెప్పుమీ విద్య.
చెలులతో నాటలఁ జిక్కి యీబోటి
తలఁపక యొకవేళఁ దప్పు చేసినను
గన్నుల బెదరింతు గాని నీ వలిగి
చిన్నారి నెన్నఁడు శిక్షింప వలదు.
నీకుఁ జెప్పఁగ నేల? నీవెఱుంగుదువు;
నాకు. నీచెలువ ప్రాణము గాన నంటి.

కోమ రొండ గురుఁడ వౌశోలఁదియే నీవు
కమలనేత్రకు నేఁడుగడయు నిక్కువము."
అని యొప్పగించుచు నబ్బోటి కేలు
చెనసి వాసవపుత్రుచేతిలోఁ బెట్టి
"మరగ నీకన్నియ మాన్య నీ" కనుచు
విరటుఁ డుత్తరతోడ వేడ్క ని ట్లనియె:
"గురుఁ డేమి చెప్పిన గుణముగా నెఱుఁగు.
గురుఁడు దైవము నీకు గురుఁడు చుట్టంబు.
చందనపుష్పభోజనభూషణములు
విందుగా నితనికిఁ బెట్టింప వమ్మ.
చనవుతో నన్యావాసము రాణివాస
మును లేక మనయింట మొగి నుండు నితఁడు."

నకులుఁ డశ్వశిక్షకుం డై విరటుపాలికి
వచ్చుట.

అని చెప్పి యిద్దఱ నవుడు వీడ్కొల్పి
జననాథుఁ డుత్తమాశ్వములు వీక్షించు
నాలోన నకులుండు నట సంభవించి
"కాలోచితం బీడఁ గల్గె నా కనుచు"
నొనరంగఁ జనుదెంచె నుదయార్కుపగిది.
జనులనేత్రములకు సంతసం బొదవ

నలజడిఁ జనుదెంచునతనిరూపంబు
వెలయంగ దవ్వున విభుఁడు వీక్షించి
ప్రజలకు నతనిసౌభాగ్యంబుఁ జూపి
నిజ మైనప్రేమంబు నెఱయ ని ట్లనియె:
"ఈవచ్చు చున్నవాఁ డెవ్వఁడో? వీని
భావంబు నిపు డేను భావించినాఁడ,
అరుదార నశ్వవిద్యాభిజ్ఞుఁ డౌట
సొరిది గుఱ్ఱముఁ జూచుచూడ్కి చెప్పెడిని.
అతి ఘోరసమరసాహసుఁడు గా నోపు,
ఇతనిచందము నాయితముఁ దెల్పెడిని.
ఎఱుఁగుదు రేని నా కెఱిఁగింపుఁ డితని;
ఎఱుఁగ కుండిన మీర లెఱిఁగి రా వలయు."
అను చుండ నృపుఁ జేర నరిగి పాండవుఁడు
మునుకొని కే లెత్తి మ్రొక్కి యి ట్లనియె:
"దేవ న న్నిపు డేలు, తెఱఁ గొప్ప నిన్ను
సేవింతు హయముల శిక్షించుపనికి.
అనఘ దామగ్రంథి యనుపేరు గలిగి
విను ధర్మజునియింట విహరింతు నేను.
బలయుతమ్ములలోనివానిఁగా నన్ను
నిల వేఱు సేయక యేలె నావిభుఁడు.

ధర్మజుమాఱుగాఁ దలఁచి నీవద్ద
నిర్మలమతి నుండ నియతి వచ్చితిని.
వేయు నేటికి, నశ్వవిద్యయం దేను
పోయినదే వీధి పొలుపార వినుము.
అవయవలక్షణం, బాయుగప్రమాణ,
మవిరళగర్భంబు, లాయింగితములు,
వయసుకట్టడలును, వడి దేశకాల
నియతి నాహారంబు, నిద్ర వచ్చుటలు,
జాతికిఁ దగినశిక్షలు చెప్పి యణఁచు
రీతులు, భయమదోద్రేకచిహ్నములు,
మాత్రాంతరంబులు మఱియుఁ బైకైన
చిత్రంబులను నేర్తు; సేవింతు నిన్ను.
అంచితంబుగ నీకు నవసరం బైనఁ
జించి చెండాడుదుఁ జెలఁగి శాత్రవుల.''
అనవుడు భూపాలుఁ "డది యేల? నీకు
నను వైనకొలు విచ్చి యాదరించెదను.—
కడువేడ్కఁ జావిడిఁ గర్త వై యుండు
మెడపక'' యన్న మహీపతి కనియె:
"నీవు మన్నించుట, నీవు రమ్మనుట,
నీ వాదరించుట, నే నెఱుంగుదును.

నెఱి పైనవిద్యను నేర్తు నే ననియుఁ
దెలుఁగు చెప్పితిఁ దేట తెల్లంబు గాఁగ.
నేరనిపనులకు నే నెంతవాఁడ?
ఊరక మేకొన్న నొచ్చెంబు గాదె?
అశ్వవిద్యలు గాని యామీఁద నెవియు
శాశ్వతంబులు గావు జగదీశ మాకు.
కొలుతు, వేడుక నైనఁ గొలిపించుకొనుము;
వలవ కుండినఁ జెప్పి వరుస న న్నంపు."
అనవుడు నరనాథుఁ "డ క్లైల? నీకు
నను వైనగతి నుండు మయ్యా నావద్ద.
మున్ను లాయములోన ముఖ్యు లై మెలఁగు
చున్న వారల నెల్ల నొప్ప మన్నించి
నామాటుగా నీవు నయమున నుండు.
నీమాటలను మీఱ నిక్కంబు నేను."
అని చెప్పి మాద్రేయు నర్థితో నిలిపె
జననాథుఁ డానంద సహితుఁ డై యపుడు.

సహదేవుఁడు గోపాలకుం డై విరటుచెంతకు
వచ్చుట.

అ త్తఱి సహదేవుఁ డాస్థానిఁ జేర
సొత్తెంచె నెంతయు సుభగవేషమున,

తగ నొప్ప నురిత్రాళ్లఁ దగినదామెనలు
మొగిఁ గట్టి యొకత్రాట మోపుగాఁ జుట్టి,
కురువిందపూసలు గ్రుచ్చి హారములు
ధరియించి, తిరుమణిఁ దఱచుగాఁ బెట్టి,
నున్న నిసెలగోల నును పైనజడయుఁ
జెన్నారఁ, జెవిఁ గొన్ని చిగురుటాకులును
వెలయ, గోవులఁ గాచువెన్నుండుఁ బోలె;
కొలువువారలచూడ్కిఁ గొల్ల వెట్టుచును
వెడవెడ వెఱపుతో విరటుసన్నిధికి
నడతెంచి విభునికి నలు వొప్పఁ బలికె:
"వసుధేశ విను గొల్లవాఁడ నీనగరఁ
బసులఁ గాచుటకు నై పని వింటి నేను.
అరయఁ దంత్రీపాలుఁ డను పేరు నాకు.
ధరణీశ మొదవులతర మెఱుంగుదును.
తొఱఁగి పోవక యుండ, దుష్టజంతువులు
తఱుమక యుండ, నిత్యముఁ బాడి గొనఁగ,
క్రేపులు వెలయ నంకిలి లేక యుండ,
నాపాటిగొల్లలు నను మెచ్చి పొగడ
నుండెద నన్నేల నోపుదే" యన్నఁ
బాండవానుజుఁ జూచి పలికె నవ్విభుఁడు:

"ఎక్కడిమాట, నీ వెట్లు గొల్లఁడవు?
మిక్కిలి చెలువ మై మెఱసె నీమూర్తి;
నునిశితంబుగ సూర్యసోమవంశముల
జనియించినాఁడవు; సహజ మై యొకటఁ
గులము సత్కీర్తియు గుణముఁ దేజంబు
వల వొప్ప దాఁచిన నణఁగ దెవ్వరికి.
తగినసంపద లిత్తుఁ దగురీతి నుండు
జగతి నారాజ్యంబుఁ జక్కఁబెట్టుమను.
వచ్చిననీయంతవాని గోవులకుఁ
బుచ్చిన నపకీర్తి పుట్టదే నాకు?"
అనవుడు సహదేవుఁ డామత్స్యపతికి
వినతుఁ డై మఱియును వేడ్క ని ట్లనియె:
"అరయుట పని నాకు నధిప గోవులను;
పరఁగఁ బాండుసుతులఁ బటుభక్తిఁ గొలుతు;
ధరణి నిప్పుడు వారు దలఁ జూప కున్న
గురుతరస్థితి నిన్నుఁ గొలువ వచ్చితిని.
ప్రకటించి యేఁ జొచ్చి పాలించుదొట్టి
నొకట నతిశయముగా నొనగూడుఁ బసులు.
చెలు వొప్పఁ బోతు పంచితము మూర్కొన్న
కొలఁదిని చూలౌను గొడ్డుటావులును.

పదరుచు నేఁ జన్నఁ బాటు నుంగిడియు
నదురుఁద్రిక్కయు మొద లైనరోగములు.
పసు లిన్ని తెఱఁగులఁ బరికింతుఁ గాని
విసువక నే నోప వే ఱొక్కపనికి.
ఇన్నియు నేల? న న్నేల నోపినను
గ్రన్ననఁ బశుకోటిఁ గావఁ బో ననుపు.''
అనుటయుఁ దనచిత్త మానందోళపడఁగ
జననాథుఁ డర్థితో సహదేవుఁ జూచి
''నీచిత్త మటమీఁద; నీవు నాపసులఁ
గాచుచు గోపవర్గము నెల్ల నేలి
యన్నికార్యంబుల నరసి మాచేత
మన్నన పడసి నె మ్మది నుండు'' మనియె.

ద్రౌపది సైరంధ్రి యై సుదేష్ణఁ గొలువ వచ్చుట.

ఏవురు నీరీతి నిలమత్స్యవిభుని
సేవించి యున్నచోఁ జెలువ పాంచాలి
సైరంధ్రివేషంబు సమకూర నపుడు
తోరంపుజడ నూడ్చి తుఱుముగాఁ బెట్టి,
వలపలికై కొంత వ్రాలి యాతుఱుము
పలుమాఱు చెవిమీఁదఁ బరిఢవిల్లంగ,

నరుదారఁ గడుమైల యగుచీరఁ గట్టి,
పరుషవల్కలములు పైఁటగాఁ దాల్చి,
కప్పారి పల్చన గాఁ జిన్నిమొయిలు
గప్పినశీతాంశుకళయును బోలెఁ,
బూని పారావార మున మించునీట
నాని సొం పఱి యున్ననలినియుఁ బోలెఁ,
వింతలాగున ధూమవితతి గ్రిక్కిఱియఁ
గాంతి మాసినదీపకళికయుఁ బోలె,
ధూళిపెల్లునఁ జిక్కి తొంగలింపకయ
లీల నొ ప్పఱి యున్న లేఁదీగెఁ బోలె,
పరిచారికావృత్తిఁ బాంచాలి యొసఁగి
పురవీధి నే తేరఁ, బురకాంత లపుడు,
"ఇది రోహిణియొ, కాక యిది యరుంధతియొ?
వెదకిన మహి నిట్టి వెలఁదు లున్నారె?
కనుదోయి కేల్గవ కమనీయముఖము
తనువల్లి కురులు పాదంబు లొప్పారె.
హరుమేను నజుమోము హరియురస్థలము
ఇర వైనఁ దగుఁ గాక యీతలోదరికి!"
అనుచు గుంపులు గట్టి యం దందఁ జూడ
వనజాక్షి తూలుచు వడి నేగు దేరె.

అప్పుడు నృపకాంత యాసుదేష్ణయును
వి ప్పైనమేడలో వేడ్కతో నుండి
సరసరీతులఁ జూచి సఖులకి ట్లనియె:
“వరరూపయౌవనసౌభాగ్యంబు దనర
నిదె యొకతరలాక్షి యీసమీపమున
మదనుపట్టపురాణిమాడ్కిఁ బోయెడిని.
పౌరులు తను వేడ్క పడి చూచు చుండ
ధీరత్వ మెడలదు; తెలివ యొంటిఁ జను;
తనుఁ జూచి యెక్కడిదాన వీ వనిన
మనుజలఁ దల వంచి మాట లాడెడిని.
నీచత్వమున నేల నెగడునో కాని
రాచదేవేరి యా రమణి నియ్యింతి.
చూతము తోడ్తెండు సుదతి నిచ్చటికి,
ప్రీతి పుట్టెడి దీనిఁ బ్రేమ మన్నింప”
అనవుడుఁ జెలు లేగి యర్థిఁ దోడ్తేర
వనజాక్షి సౌధంబుపై నెక్కునపుడు
పటికంపునేలకట్ల పైఁ బాదరుచులు
చటులకుంకుమ మొలిఁ జల్లిన ట్లుండె.
మేడపై కీభంగి మెలఁత యేతేర
వేడుకతో నంత విరటుభామినియు

నా ముగ్ధ «నిందు ర» మ్మని చేరఁ బిలిచి
«ప్రేమ నెంతయుఁ జూచి ప్రియమునఁ బలికె:
నీవంశ మెట్టిది, నీకుఁ బే రేమి?
నీ వీపురంబులోనికి వచ్చు టేల?
గరుడకిన్నరయక్షగంధర్వసతులు
నిరుపమస్థితిఁ బోల్ప నినుఁ బోల లేరు.
దీనవృత్తికి నోర్చు తెఱఁగు నీయందుఁ
గానము, నీ కేల కాంత యి ట్లుండ?
చెప్పుము నీ» వన్నఁ జిగురాకుఁబోఁణి
యొ ప్పైనమృదుభాష నువిద కి ట్లనియె:
«జలజాక్షి సైరంధ్రిజాతిఁ బుట్టితిని;
వెలయ మాలిని యండ్రు వేడ్కతో నన్ను.
మగలు నా కేగురు; మఱి వారియెదుటఁ
బగవారు ముండలఁ బట్టి యీడ్చినను,
ఎగ్గుగా నెంచక యేను నామగలు
నెగ్గించి వ్రతముల పై మెల్లను విడిచి
యడవిలో నుండితి; మావ్రతంబునకుఁ
గడమగా నొక యేఁడు గలదు మా కింక.
నీయింట నీయేఁడు నెమ్మితో నుండి
పోయెద నమబుద్ధి పుట్టి వచ్చితిని.

కలపంబు గలఁప, సింగారంబు చేయ,
తల దువ్వ, పువ్వులు తగఁ గట్ట నేర్తు.
నిత్యము న్మను వెన్నునికి దేవి యైన
సత్యభామకుఁ బరిచర్య చేయుదును.
తరువాతఁ బాంచాలి తన్నుగా నన్ను
నరసి పిల్చిన నుంటి నయ్యింతిఁ గొలిచి.
ఇప్పుడు నీవద్ద నిట్టు లుండెదను
దప్పక, నీచవర్తనలకుఁ జాల.”
అనిన భూవిభుదేవి యద్దేవితోడఁ
దనరీతి వివరింపఁ దలఁచి యి ట్లనియె:
“అతివ నీ వేతెంచునపుడు మారాజు
చతురుఁ డై చూచె, భూజనులుఁ గన్నార
ఆతఁడు నీమీఁద నభిలాష నిలుప
నేతెఱంగున నిన్ను నేను నిల్పుదును?
కర్కటి యొకవేళ గర్భ మైనట్లు
తర్కింప నాకు మీఁదట నేమి యగునో?
అనిన ద్రౌపది మందహాసంబు చేసి
తనరఁ గేకయరాజతనయ కి ట్లనియె:
“చింతించి నీవు త ల్చినయట్లు కాదు.
కాంతు లేవురు నాకు గంధర్వు లతివ,

నతశాత్రవులు వారు నన్ను నేమఱరు.
జతన మై కెలఁకులఁ జరియింతు రెపుడు.
అతివ యెవ్వఁడు నన్ను నభిలాషఁ జూచు
నతని రూపఱఁ జూతు రారాత్రిలోన.
కావున నావంకఁ గడగంట నైన
భావించి చూడరు బ్రహ్మాదు లైన.
కాదు పో నాయిచ్చఁ గన నెంతవాఁడు
నీదువల్లభుఁ డంత నీచవర్తనుఁడె?
సైరంధ్రి యగుకాంత జగతిలో ధర్మ
చారిణి యై కాదె చరియింప వలయు?
అనుమతించిన నేలు, మతివ నీ కెపుడు
మనసు రా మెలఁగెద, మన్నింపు మమ్మ.
పనుపకు నన్ను నల్పము లైనపనుల;
వనజాక్షి యిది నాకు వరముగా నిమ్ము.”
అనిన సంతోషించి యవనీశు దేవి
తనయొద్దఁ బాంచాలిఁ దగ నొప్పనునిచె.
అనఘాత్మ యటమీఁద నైనవృత్తాంత
మొనసినవేడ్కతో నెఱిఁగింతు వినుము.
అర్థిమందార సాహసవిక్రమార్క
పార్థివనుతశౌర్య పంటవంశేంద్ర

పరమేశ్వరాఖ్యాన పరవర్ణ్యమాన
పురవరాధీశ్వర భూరిప్రతాప,
ఇది సదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్ర
మతిమద్విధేయ తిమ్మననామధేయ
రచితవిరాటపర్వమున నాశ్వాస
ముచితార్థయుతముగా నొక్కటి యయ్యె.

శ్రీరాజితాకార, శివభక్తిపూర,
గౌరవాకార, జంగలముమ్మధీర.
వినుము వెండియు నిట్లు వివరింపఁ దొడఁగె
జనమేజయునకు వైశంపాయనుండు:
ఆరీతిఁ బాండవు లబలతోఁ గూడి
వారక విరటభూవరుని సేవించి
తమతమనడచువర్తనము లేమఱక
సముచితులై దుష్టజనులసోఁకోర్చి
యడఁకువ ప్రియము నెయ్యమును మోమోట
మెడపక పనులందు నే వగ్గలించి
తమరాక జనులకుఁ దలపోఁత లైన
భ్రమయించి చొప్పు మార్పడ మాట లాడి
తగుకార్యములు గాఁగఁ దమలోనఁ దాము
తగిలి భాషించుట తఱచుగా మాని
యుండుచో ధర్మజుం డొక్కొక్కమాటు
నిండారువేడుక నృపునిగొల్వునను

నవరసంబులతోడ నలు వొప్పఁ గథలు
వివిధశాస్త్రంబులు వేడ్కఁ జెప్పుచును,
పరితోష మగువేళఁ బసఁడిపాచికల
దొరకొని భూపాలుతో జూద మాడి
తనరారువేడుక ధనము లార్జించి
మునుకొన్న వేడ్కఁ దమ్ముల కెల్ల నిచ్చు.
వలలుండు తఱచుగా వసుధేశునకును
వలయుమాంసంబులు వండి యిచ్చుచును
మిగిలెడుమాంస మమ్మెడివానిఁ బోలె
మొగి నిచ్చు నన్నదమ్ములకు నిత్యంబు.
నరుఁడు నాట్యముఁ జూపి నరనాథుచేత
వరరత్నభూషణావళి మెచ్చు వడసి
మహితుఁడై చేర్చి ధర్మజభీమనకుల
సహదేవులకు నిచ్చు సారెసారెకును.
నకులుండు నరనాథునకు నొక్కవేళఁ
బ్రకటించి ఘోటకప్రకరంబుఁ జూపి
వెలలేనితొడవులు విభుచేతఁ బడసి
నలు వొప్ప నిచ్చు నన్నలకుఁ దమ్మునికి.
ఆసహదేవుండు నవనీశునెదుట
గోసహస్రంబులు కోమ రొప్పఁ జూపి

కూడఁ బెట్టినవస్త్ర కుండలాదికముఁ
దోడఁబుట్టువులకుఁ దోడ్తోడ నిచ్చు.
పన్నుగాఁ బాంచాలి ప్రాణవల్లభులఁ
గన్నారఁ జూచి శోకము పుట్ట మరలి
మాట పుట్టక యుండ మనుజేంద్రునగర
మాటిమాటికి వారిమనసు రా మెలఁగు.
ఈచందమునఁ బ్రేమ లిచ్చఁ బాటించి
రాచకర్జంబులరచన లేమఱక
పనులవెంబడి డాసి పరు లెఱుంగనటు
పౌనరఁ గైకొన్నరూపుల నటింపుదురు.
చెలఁగి తేజంబు దాఁచినవారు గాని
సులభు లై జనులకుఁ జూడంగ వచ్చి
మొదలఁ జిచ్చఱఁగన్ను మోడ్చినయట్టి
మదనారిముఖములమాడ్కి భాసిలిరి.

విరటుసభకు నొకొనొకమల్లుఁడు
వచ్చుట.

అత్తఱి నొకజెట్టి యసమానబలుఁడు
మత్తేభగమనంబు, మా నైనయురము,
జేవురించినమేను, చిఱుతకూఁకటియు,
కావిదిండును, పెద్దకటములమోము,

ఉరుభుజంబులు, రాయి చున్న పెందొడలు,
పోరిఁ బోరిఁ జెవి నొక్కపుష్పమాలికయు
ధరియించి యొకమహాదైత్యుఁడో యనఁగ
నరిది చెక్కలు లేనియచలంబుఁ బోలి
చనుదెంచి నృపునియాస్థానమధ్యమున
జను లెల్ల విన మల్లచఱచి యి ట్లనియె:
"పరిపాటి నెన్నఁ జప్పన్న దేశములఁ
గర మర్థి నే నెఱుంగనిరాజు లేఁడు.
ఏరూపమున నైన నెదు రైనజెట్టి
నేరీతిఁ గాన భూమీశ నీయాన.
చిరకాలమున నుండి జెట్టిమల్లులకు
బిరుదు గట్టినవాఁడఁ బేర్చి డాకాల.
చెనసి యేనుఁగుచేతిచెఱకుకోలలకు
నెన గారె నాతోడ నెదిరి మల్లరులు?"
అన విని వానిబాహాటోపవిధముఁ
గనుఁగవ నెలకొన్న గర్వంబుఁ జూచి
ప్రీతితో సభ నున్న బిరుదుమల్లరులు
భీతు లై యెంతయుఁ బెం పేది యపుడు
ఉత్తర మీ లేక యొదిఁగిరి చూడఁ
జిత్తరువందు వ్రాసినబొమ్మలట్లు.

నరపతివేడ్కఁ మన్నక పోవు టెఱిఁగి
దరహాసవదనుఁ డై ధర్మరా జనియె:
"మనుజేశ పిలిపింపు మనబానసీని
వినుతి మార్కొని వీని విఱుగఁ దోలెడిని.
వలలున కిది యెంత? వసుధేశ వాఁడు
తలఁచిన గెల్చు గంధర్వరాక్షసుల.
పోలు పార ధర్మజుపురములో నెపుడు
బలుమల్లురుల దారఁ బట్టుచు నుండు
వరుస; నే నెఱుఁగుదు వానిసత్త్వంబు;
ధరణీశ వీనితోఁ దలపెట్టి చూడు."
అనిన భూపతి భీము నటకు రప్పించి
యనయంబు గర్వాంధుఁ డగుజెట్టిఁ జూపి
యనియె "సన్నద్ధుఁడ వై వీనితోడఁ
జెనసి మార్కొను" మన్నఁ జెలఁగి వాయుజుఁడు
కర మర్థిఁ దనయన్నకనుసన్న నెఱిఁగి
పరితోషమున మత్స్యపతిఁ జూచి పలికె:
"పురణించి ధర్మజుపురములోపలను
సలుపుదుఁ దొల్లి నిచ్చలుఁ జెట్టిపోరు.
నేఁడు నీయెదుట నానేర్చినయంత
వాఁడిమి పచరింతు వడిఁ జిత్తగింపు.

ఆహిడింబునిఁ బోలునధికుఁ డీజెట్టి;
సాహసంబున వీని సాధింపఁ డోరుఁడు.
అగుఁ గాక నేను నీయాజ్ఞ పాటించి
జగజెట్టి నై పోరి చలము సాధింతు.''

భీమసేనుఁడు మల్లునితోడం
బెనంగుట.

అని యంకణముఁ జొచ్చి యధిపుకట్టెదుట
జనులు భీతిల మల్లచఱచి యి ట్లనియె:
''లావుఁ జేవయు మీఱ లాగింతు నిపుడు
భూవిభుననుమతంబున మున్న కడఁగి,
ఎదుట నిల్వు మ'' టన్న నితఁడు నాతండు
ముదముతో నొండొరుమోము వీక్షించి
నేల నించుకమన్ను నెఱిఁ బుచ్చుకొనుచు
ఫాలసీమలఁ దాల్చి పైఁ జల్లుకొనుచు
మొగి రెండుచేతుల మునివ్రేళ్లఁ గొంతఁ
దిగిచి యొండొరు లున్న దెసలకై చల్లి
పద నేది బ్రహ్మాండభాండముల్ పగులఁ
దుదముట్ట నార్చుచుఁ దొడరి యంతటను
నలి రేఁగి వింతతానకముల నిలిచి
పొలు పొందఁ గవియునప్పుడు చూడ నొప్పెఁ

క్రీడ నొండొంటితోఁ గినిసి పోరాడఁ
గూడినసింగంపుఁగోదములో యనఁగ,
అలమును జలమును నందంద మెఱసి
తలపడుమేరువింధ్యంబులో యనఁగ,
ఎదు రైన సమదృష్టి నిల నోర్వ లేక
కదిసి డీకొన్నదిగ్గజములో యనఁగ.
గాలికి కొండ గ్రక్కదలనియట్లు
గాలిపుట్టువు నిల్వఁగా జెట్టి భీము
ఘోరరూపముఁ గాంచి కొండగాఁ దలఁచి
చేరి కూల్పంగ వచ్చినయింద్రుఁ బోలె.
తలఁప నారీతి నిద్దఱు మేటిమగలుఁ
దలపడి మల్లయుద్ధము సేయునపుడు
పరువడిఁ గూడుదంపతులచందమునఁ
గర మర్థి బిగియారఁ గౌఁగిలింపుదురు,
చెలికాఁడుఁ జెలికాఁడుఁ జేరినయట్లు
పెలుచఁ గేలును గేలుఁ బెనచి యాడుదురు,
మెండుగా నించుఁ గ్రమ్మినసిద్ధు లనఁగ
నొండొరుఁ బడ వైవ నుత్సహింపుదురు,
వెలఁదికై జగడించువిటులచందమునఁ
గలయిక వ్రేయ నంగముఁ జూతు రెలమి.

అప్పుడు భీముఁ డయ్యవనిపాలునకుఁ
దప్పక మఱి వినోదము చూపఁ దలఁచి
యుపతాయిలోఁ బెట్టి యుఱక జక్కించి
నిపుణుఁ డై వ్రేయక నెఱిఁ గాచి విడుచు.
అరుదెంచి వాఁడు పై నవఘళించుటయు
గురుతరస్థితిఁ దప్పికొని వేగ నిలుచు.
కుప్పించి వాఁడు కాల్గొని రాకమున్నె
తప్పినయట్లుగా ధరఁ ద్రుంగు, మఱియు
వెలయంగ సన్నంపువిన్నాణములకుఁ
దలపడుఁ గానిఁ యంతయు ముట్టఁ గొనఁడు.
కాలినేర్పున వానికాలాన నీక
బాళిచేఁ జే సోఁకఁ బట్టి పో విడుచు.
ఇత్తెఱంగున భీముఁ డెలమితో నృపుని
చిత్తంబునకు వేడ్క చేసి చాలించి
తూకొని కాళ్లు చేతులు వ్రేలునట్లు
భీకరాకృతి వానిపెడకచ్చఁ బట్టి
ముక్కున వాతఁ గ్రమ్ముచు నెత్తు రొలుకఁ
గ్రక్కున వాని నుగ్రత నెత్తి వైచి
పరఁగ నంతటఁ బోక ప్రజ లెల్ల నార్వఁ
బౌరిఁ బౌరి వానివీపున మండిపెట్టి

తాళంగ నోపక ధరణిపై వాఁడు
కేలుఁ జాఁపినఁ జూచి కినుకఁ బో విడిచి
తనకు భూపతి మెచ్చి తగ నిచ్చినట్టి
కనకాంబరాదు లక్కడివారి కిచ్చి
కొండ నోరాజినకుంజరం బనఁగ
దండిమై నే తెంచి తనచోట నుండె.
మఱియు లావున మాఱుమలయుమల్లురుల
విఱిచి నొప్పించె భూవిభుసమ్ముఖమున.
తనఘాత కోర్చి భూతలనాథునొద్దఁ
జెనసి పోరాడఁగ జెట్టి లే కున్న
నరపతి డెప్పింప నగరిలో నెపుడుఁ
గరిహరిశార్దూలగణముతోఁ బెనఁగు.

కీచకుఁడు ద్రౌపదిం గాంచి
వలచుట.

వెలయుపాండవు లిట్లు విరటురాజ్యమున
సొలవక వైరిరాజులకన్ను మొఱఁగి
కొండొకకాలంబు కొఱఁతగా కుండ
నిండించునంతకు నెఱి నొక్కనాఁడు
ధరణీశుమఱఁదియు దండనాయకుఁడు
నరయ గర్వాంధుండు నగుసింహబలుఁడు

తనయక్క డైనభూతలనాథుసతికి
వినతి సేయఁగ వచ్చి వెస నిల్లు సొచ్చి
యద్దేవిగద్దియ కనతిదూరమునఁ
దద్దయు ద్రుపదనందన యున్నఁ జూచి
కలలోనఁ బెన్నిధిఁ గని పేదవాఁడు
పలుమాఱు నూహించుపగిది నాసించి
మనసిజువలఁ జిక్కి మానంబు దక్కి
తనలోన ని ట్లని తలపోయఁ దొడఁగె:
"అచ్చెరు వీపంకజాక్షిరూపంబు
మె చ్చొందెఁ దొలుకారుమెఱుఁగును బోలి!
అడుగులకెంజాయ యాననద్యుతులుఁ
దొడలక్రొమ్మెఱుఁగులుఁ దోరంపుఁబిఱుఁదు
సన్నంపునడుమును సౌ రొందువళులుఁ
జెన్నారులతలు నాఁ జెలఁగుబాహువులు
మెఱుఁ గారుమోమును మీననేత్రములు
నెఱి వెంద్రుకలకప్పు నెగడె నింతికిని.
కరుగునఁ బోసెనో కంజజుం డతను
శరము లైదును గూడ జలజాక్షి గాఁగ!
హరుఁ డేమి సేయు నియ్యబల నీక్షించి?
విరహాగ్నిఁ గాముఁడే విరిసెఁ గా నోపు!

ముదిత నెమ్మోము సోముని గెల్వ నేర్చి
నది గాన నలరారు నధరామృతంబు.
జగతి నింద్రుని కిట్టిసతి లేదు గాక
తగ వేద మునికాంతఁ దగులునే యతఁడు?
తొమ్మండ్రు బ్రహ్మలు తొడరిరో కాక
యిమ్ముగ్ధ నొకబ్రహ్మ యెట్లు సృజించు!
ఈయింతిఁ జూచిన నీశానుతపము
పాయదే మరుఁడు తప్పఁగఁ జేసెఁ గాక!
హనుమంతుఁ డీయింతి నలవోకఁ గన్నఁ
దనబ్రహ్మచర్యంబు తడపెట్టుకున్నె?
కమ్మపువ్వును బ్రింగుగండుతుమ్మెదలు
కొమ్మకొప్పును బోలి కొమ రొప్పుకున్నె?
భామినినడు మురోభారంబు దాల్ప
ధీమంతుఁ డజుఁడు మంత్రించెఁ గాఁ బోలు!
మొదలఁ బద్మిని గాన ముదిత కింపారెఁ
బదపద్మముఖపద్మపాణిపద్మములు.
సీమంతరేఖయుఁ జెక్కుటద్దములు
రోమరాజియు దంతరుచులు నెన్నడుము
బోటికి నొప్పు; చూపులు విలాసములు
మాటలనేర్పులు మందహాసములు——

ఎల్లమాటలు నేల? ఈకాంతఁ గన్న
తల్లిదండ్రులు సేయుతప మొప్పెఁ గాక.
ఓయారమునఁ జేరి యుగ్మలి మారు
సాయకంబులఁ జిక్కుసరణి గీల్కొలిపి
యాలోలసౌఖ్యాబ్ధి నల్లాడఁ దలఁతు.
ఏలాగు చేయునో యించువిల్తుండు!
జలజలోచనఁ దెచ్చి సంధించుపనికిఁ
గలఁడొకో నాకు నిక్కడ నొక్కతోడు?"
అని పెక్కుభంగుల నాసింహబలుఁడు
మనసిజునకు లోఁగి మదిరాక్షిఁ బొగడు.
మగువఁ బైకొనఁ జూచు మానంబుఁ దలఁచు.
తగిలి వెంటను జూచు, ధైర్యంబు విడుచు,
కనుఁబ్రాల్చు, తల యూఁచు, గలఁగు, నచ్చోట
జనులచప్పుడు చూచి చాల శంకించు.
అలవి మాలినకోర్కు లతిశయిల్లఁగను
గలయఁ గోరుచు నుండుఁ గామాతురుండు
తలయుఁ జీరయు మాసి తనుఁ దానె రోసి
మెలఁగుపాంచాలిఁ గామించి కీచకుఁడు.
ఆకాంతభీతియు నాకాంతవణఁకుఁ
జేకొని మదిఁ గామచేష్టగాఁ దలఁచి

తనచేష్ట లన్నియు ధైర్యంబుతోన
మనసులో మఱచి తామరసాక్షిఁ జూచు.
అప్పు డప్పయుఁ గొంద అబ్జలోచనలుఁ
దప్పక తనుఁ జూడఁ దగ వేది వాఁడు
మెఱుఁగుఁదీవెను బోలు మేలఁత మైఁదీఁగ
తెఱ చైనరుచుల కెంతయు సంతసిల్లు.
పవడంపులతఁ బోనిభామ కెంగేలు
తివుటమై నున్న కాంతికి మెచ్చి పొగడు.
గండుమీలను బోలు కాంత నేత్రముల
మెం డైనమించు గ్రమ్మిన మిన్నుఁ బ్రాఁకు.
పున్నమచంద్రుఁ డై పూరించు చున్న
యన్నాతిమోముచాయకు మోము వ్రేల్చు.
ఈచందమునఁ జూచి యింతిపైఁ జూపుఁ
గీచకాగ్రణి యెట్ట కేలకుఁ దిగిచి
నలినాక్షియన్వయనామధేయములు
వెలయ సుదేష్ణచే విందుఁ గా కనుచు
నే తెంచి మ్రొక్కిన నిభరాజగమన
ప్రీతితో బంగారుపీటఁ బెట్టించి
ఘనరత్న ఖచితకంకణపాళి మొరయ
నొనర సంభావించు చున్నచో వాఁడు

తమకంబు రెట్టింపఁ దనసహోదరికి
సుముఖుఁ డై పాంచాలిఁ జూపి యి ట్లనియెః

కీచకుఁడు సుదేష్ణను ద్రౌపదితెఱంగడుగుట.

"ఈకాంతకుల మేమి, యెట్టినామంబు
చేకొని యిట కేమి సేయ నేతెంచె?
ఏవెంట విహరించు, నెవ్వాఁడు మగఁడు?
నీ వెంత మన్నింతు నెమ్మితో దీని?"
అనవుడు నతఁడు కామాసక్తుఁ డగుట
మనసులోఁ దెలిసి యమ్మదిరాక్షి యపుడు
"పరకాంతపై వీనిభావంబు తగిలె.
వరుసతోఁ దప్పింప వలయు నా" కనుచు
మాటల మఱుపెట్ట, మత్తుఁ డై యతఁడు
గాటంపుమరుసాయకంబుల కులికి
సంపంగికై పోవుచంచరీకంబు
సొంపునఁ బాంచాలసుతఁ జేరఁ బోయి
విటలక్షణము లెల్ల వేడ్కతోఁ జూపి
కుటిలకుంతలతోడఁ గొమ రొప్పఁ బలికెః
"తరలాక్షి, నినుఁ బోలుతరుణి నేఁ గాన
నరలోకసురలోకనాగలోకముల.

బంగారుప్రతిమతోఁ బ్రతి యైననీకు,
అంగన, పే రేమి? యధిపు పే రేమి?
నీతండ్రి యెవ్వఁడు? నీకులం బెద్ది?
ఏతఱి వచ్చి తీవెఱిఁగింపు'' మనిన,
ఆసరోరుహగంధి యతనిమాటలకు
రోసి నెమ్మదిఁ బాసి రుష నూర కున్నఁ
గినిసి యంతటఁ బోక కీచకాగ్రజుఁడు
వనితఁ దప్పక చూచి వల నొప్పఁ బలికె:
''కను విచ్చి నావంకఁ గడగంట నైనఁ
గనుఁగొన్నఁ దప్పౌనె కస్తూరగంధి?
మెఱుఁగారుమోమున మేలు రెట్టింపఁ
జిఱునవ్వు నగ రాదె చిగురాకుబోణి?
అలరార వీనుల కమృతంబు లొలుకఁ
బలుకంగ రాదొకో పంకేరుహాక్షి?
నీలీల లిట్లు వర్ణించునామాట
లాలింపఁ దగదొకో యలినీలవేణి?''
అనుచుఁ జేరఁగఁ బోవు, నమ్ముగ్ధమాట
వినఁ గోరు, మఱియును వినఁ గోరు; నచటఁ
దనరార నెన్నిచందములఁ బాంచాలి
మనసు గానక వాఁడు మఱియు ని ట్లనియె:

"పడఁతి నీయొడలు దప్పక చూడ వెఱతుఁ
దొడిబడిఁ గనుఁబాటు దొరయునో యనుచు.
కలకంఠి నీయున్న గరువంబుఁ జూచి
పలుకఁ జూచిన నోరు పలుక నోడెడిని.
నలినాక్షి యిటువిూఁద నన్నుపేక్షింపఁ
దలఁచితివేనియు దర్పకుం డేచి
మోహనాస్త్రము వేసి మోహరించుటయు
దేహంబు నాకు సందేహంబు గాదె?
అప్పుడు బ్రతికింప నలవియే నన్ను?
ఇప్పుడే కరుణింపు మిభరాజగమన."
అనవుడుఁ గలుషించి హరిణాయతాక్షి
తనికినకోప మంతయు డిందుపఱిచి
"వేగంబు గొనఁ గాదు, వీనిఁ బొం దైన
లాగున విఱుతు నేలా మాట" లనుచు
నొప్పార సి ట్లనె "నో యన్న నీకు
నిప్పుడు నాయూప మెట్లు తీ పయ్యె?
ఈచీర లీయొడ లీయున్న యునికి
కీచకాగ్రజ నీకుఁ గింకిరి గాదె?
ఇర వొప్పఁ గన్నుల కింపు గాదేని
పురుషుని కాకాంతఁ బొంద నేమిటికి?

ఆఁడుబిడ్డలతోడ నర్థితోఁ బుట్టి
నేఁడు న న్నిట్లాడ నీకు న్యాయంబె?
హీనవంశముదాన నేఁ బతివ్రతను;
కానక నీ విట్లు కాఱు లాఁడుదువె?"
అని వీడఁ బలికిన నాసింహబలుఁడు
మనసిజుఁ దలయింప మఱియు ని ట్లనియె:
"హీనవంశమునందు నీచక్కఁదనము
లే నెఱుంగక యుండ నెచ్చోటఁ గలదు?
కలువఱేకులయందుఁ గలమెత్తఁదనము
చెలియ నీకరములఁ జేరి యున్నదియ.
చెలువారునంబకశ్రీలు చెల్వొందు
చెలి మూరునంబకశ్రీలు నాఁ దనరి.
తొలకరిమెఱుపులఁ దొలఁకాడురుచుల
నెలఁత యొక్కట నేలె నీదేహకాంతి.
గండుతుమ్మెదచాయఁ గనుగంద కుండ
నిండారి యున్నవి నీదుపెన్నెఱులు.
పదియాఱుకళలఁ దప్పనిచందమామ
సుదతి నీవదనంబుఁ జూచి లజ్జించు.
ఇట్టిశృంగారంబు లెల్లభాగ్యములు
పుట్టింప కుండునే, బాంకంగ నేల?"

### ద్రౌపది కోపించి కీచకునితో బదులాడుట.

అన విని కోపించి యంభోజనేత్ర
కనుఁగవఁ గెంజాయ కలయంగఁ బర్వ
భయముఁ జూపక మెత్తఁబడఁడు వీఁ డనుచుఁ
బ్రియ మేది నీచుతో బింబోష్ఠి పలికె:
"వలదురా కీచక వలరాజుబారిఁ
గలఁగి యీతీరునఁ గాఱు లాడఁగను.
గంధర్వు లేవురు గలరు నామగలు
సంధులు విదళించి చంపి వైచెదరు.
భీమబాహాటోపభిదురప్రతాప
ధాములు నిరుపమోద్దండసాహసులు.
వదలనిభుజశక్తి వారికి నీకు
మదిఁ దలంపఁగ హస్తిమశకాంతరంబు."
అన వాఁడు కోపించి హరిణాక్షి కనియె:
"వనిత ముగ్ధవు గాన వర్ణించె దిట్లు,
ఈలోకమున నాకు నెదురు దెచ్చెదవు.
చాలు నీమాటలు సంతసించితిని.
బలుఁడు భీముఁడు, భూరిబలుఁడు శల్యుండు,
బలు లయ్యు నన్నుఁ బోల వలఁతులే వారు?

కుటిలకుంతల యేను గోపింపఁ గాని
బొటవ్రేలఁ జిమ్ముదు భూరిశైలముల.''
అనవుడు వానిగర్వాలాపములకు
మనసులోఁ గోపించి మదిరాక్షి యనియె:
''మది మది నుండి దుర్మదము వాటించి
కదియఁ జూచెద వేల కాలమృత్యువును?
రావణాదులు మున్ను రమణికై పోరి
వేవేగఁ దీఱుట విన రాదె చెవుల.
కోర్కి కందనిపండ్లు గోయనె ట్లగును?
తర్కింపు మిది నీకు ధర్మంబు గాదు.''
అని యిట్లు పాంచాలి యన మాఱు పలుక
విని కీచకుఁడు శోకవివశాత్ముఁ డగుచుఁ
గ్రమ్మఱఁ దనయప్పకడకు నేతెంచి,
ఇమ్మడి నిట్టూర్పు లినుమడింపంగ
నెంతయుఁ జిన్నవోయినమోముతోడఁ
గాంత యూరక యుండ, కలఁగి యి ట్లనియె:
''ఏయింతు లైన నీయింతిఁ బోలుదురె?
కాయజుదంతి యై కలకంఠి పొలుచు.
ఆయబ్జముఖిరూప మాత్మలో నిలిపి
పాయక మదనుఁ డేఁపఁగఁ జొచ్చినాఁడు.

అతివ నీవే కందు వటువిూఁదిపనులు.
హితము చేసితివేని యే నిన్ను మఱవ."
అనిన భూవరుదేవి యతని వేగిరముఁ
గనుఁగొని తలయూఁచి కంపించి పలికె:
"ఈచంద్రముఖియందు నే చక్కఁదనముఁ
జూచి మోహించితి చోద్యంబు గాఁగ?
ఏచూపు లేతీపు లే విలాసంబు
లేచంద మేయంద మే మందు నిన్ను!
వాలారుఁజూపుల వాలుఁగన్నులను
మే లైననడకల మెలపుమాటలను
సంగీతసాహిత్యసరసభావముల
శృంగారచేష్టలఁ జెలు వైనగతుల
నగవులఁ దగవుల నాగరీకముల
సొగయించి వలపులు సోనగాఁ గురిసి
సురకన్యకల నైన స్రుక్కించునట్టి
తరుణు లున్నారు నీధామంబునందు
చేత వెన్నను బట్టి చిత్తంబు చెదర
నేతికి నై యేడ్చు నీవంటి వాఁడు."
అనవుడుఁ గీచకుం డతివ మాటలను
విన కిట్లు పలికె "నీవెడమాట లేల?

నానగ రన నేల నాకలోకమునఁ
బూని యిమ్మదిరాక్షిఁ బోల రెవ్వరును.
గండుమీలకుఁ బుట్టి కాముబాణముల
దండ నాడుచు నుండుఁ దరుణినేత్రములు.
ఏలతీఁగలఁ బోలు నీయింతికరము
లలవోక నగు చుండు నబ్జనాళముల.
చెందొవలను బోలి చిగురాకుచాయ
లంది యీకోమలియంఘ్రు లొప్పారె.
ఈరామ పలికిన నింపు సొంపగుచుఁ
గీర కోకిలవల్ల కీనాద మెసఁగు.
అట్టి యీ సైరంధ్రిఁ గన్యకామణులు
నెట్టన సరిపోల నేర రెవ్వరును.
ఒగి సామభేదదండోపాయములను
మగువఁ బుత్తెమ్ము; ధర్మము పల్క నేల?''
అనినతమ్మునితోడ నబల యిట్లనియె:
''విను మింక నీజాలి విడిచి నామాట.
పరధన పరదార పరనింద లెపుడు
నరసి చూచిన దోష మాయుష్యహాని.
అందులోఁ బరకాంత యధికపాపంబు
పొందించు మదిఁ గోరి పొందువారలకు.

పతి గన్నఁ దెగఁ జూచుఁ బ్రజ గన్న దూఱు
సతి గన్నఁ గోపించు సభ్యు లాడుదురు.
అవి యెన్న నేల? నే నబలచే వింటి
నువిదకు గంధర్వు లున్నారు మగలు.
పులి యున్నపొదరిల్లు పూఁబోణి యనఁగ.
వలదు నీకాత్రోవ వలదు నాయన్న"
అనినఁ గీచకముఖ్యుఁ డలుక దీపించి
తను దైవ మూఁడింపఁ దరుణి కి ట్లనియె:
"వెలఁది వెఱ్ఱివిగాక వెలఁదిమాటలకుఁ
దలఁకెడి వాఁడనే? తప్పనాడితివి.
ఈ చరాచరమున నెట్టి సాహసులుఁ
గీచకుఁ డనిన శంకించి పాఱుదురు.
కదన మబ్బదుగాక గంధర్వు లేల
త్రిదశవీరుల నైనఁ దివిరి సాధింతు.
ఇటు బుద్ధులను జెప్ప నెల్లఁ బో విడిచి
కుటిలకుంతల నన్నుఁ గూర్చుమా కరుణ
నదిచేయఁ దగుకార్య మబల యియ్యెడను;
వదరకు నామేలు వలసి తేనియును."
అనిలేచి రమణిపా దాబ్జపీఠమున
వినతుఁ డై కీచకవిభుఁ డొప్పఁ బడెను

పరసతిఁ గామించు పాపాత్ముఁ డిట్లు
ధరఁ గూలు ననిచెప్పి తగఁ జూపి నట్లు.
అనుజన్ముఁ డిట్లు పాదాక్రాంతుఁ డైనఁ
గనికరం బెంతయుఁ గల్గి యద్దేవి
కనుదమ్ములను నీరు గ్రమ్మంగఁ గాంచి
తనలోనఁ దలపోసెఁ దత్తఱిల్లుచును
"ఇపు డేమి సేయుదు, నితఁ డిట్లు మరుని
విపులమాయకు లోఁగి వికలాత్ముఁ డయ్యె?
పరకాంత వలచునప్పాపాత్ముఁ డెపుడు
నరధర్మపథ మేల భావించు నెదను?
పరమసాధ్వియుఁ బతివ్రతయు నౌదీని
నరుదారఁ గామించె; అజ్జసంభవుని
శాసనం బెటు దాఁటఁ జాలు నెవ్వరికి?
ఈసతి వలచి తా నెం తెంత యిడుమ
లందంగ వలయునో యకట యీతనికి!
అం దందఁ బ్రకటశౌర్యాటోపమునను
అరివారమును బట్టి యలవోక విఱిచి
వరకీర్తిఁ గాంచినబలసమన్వితుఁడు
సుమబాణనికరంబు సోఁకఁ దూలెడిని!
తముఁ దా రెఱుంగరు తమిఁగొన్న వారు.

ఏమి చేయుదు, వీఁ డెన్ను దండమునఁ
గామినిఁ బంపినఁ గాని యూఱడఁడు!
ఒప్పు నే సైరంధ్రి యురుపుణ్యసాధ్వి?
ము ప్పొంద నొడికట్టె మూర్ఖుం డితండు.
గంధర్వు లేగురు గరితకుం బతులు;
గంధద్విపోపమఘనపరాక్రములు;
విడుతు రే యూరక వీనిఁ జంపకయ?
కడుదాఁపుగా వచ్చెఁ గాలంబు వీని,
కెక్కడికీచకుఁ డింక నా" కనుచు
మ్రొక్కి నముద్ధుతమ్ముని లేవ నెత్తి
కాటుకకన్నీరు గండరేఖలకు
మాటుగా నేప్పుచు మగువ యి ట్లనియె:

ద్రౌపదిం దనయింటికిఁ బంపునట్లు కీచకుఁడు
సుదేష్ణ నొడంబఱచుట.

"వెఱవకు, మింక నవ్వోలఁది యెవ్వారు
నెఱుఁగ కుండఁగ వచ్చు నేను పొమ్మనిన;
పొమ్ము, నీయింటికిఁ బోలఁతి మద్యంబుఁ
దె మ్మని పుత్తు నీదినములో" ననినఁ
దెలిసినమొగముతోఁ దివిరి కీచకుఁడు
వెలయంగ నింటికి వేవేగఁ బోయి

యిందుకాంతపువేది నేకాంతసీమ
ముందట మధుమాంసములు పెట్టఁ బనిచి
పలుతెఱంగుల మంచి భక్ష్యభోజ్యములు
తలకొని తెప్పించి తలఁపులో నపుడు
ఆకాంతనయనంబు లసమసాయకుఁడు
కైకొన్నతూపులుగా నెన్ని యెన్ని,
ఆమంజుభాషిణి యాస్యబింబంబు
తామరపూవుగాఁ దలపోసి పోసి,
ఆరాజముఖికి నొప్పారుపాదములు
కోరికఁ జిగురుటాకులఁ బోల్చి పోల్చి,
ఆసరోజాక్షికి నలరారుజంఘ
లాసాసఁ గాహళు లని యెంచి యెంచి,
పలుపోకలను బోయి పలుమాఱు వగచి
వలపుచేఁ గోల్పోయె వరబుద్ధిబలము.
చెలిపాదములఁ జేరి చెరలాడి దుమికి
నిలువంగ నెడ మీానినెన్నడు మొదలి
ఘనజఘనంబుపైఁ గడువేడ్క నాడి
యనువుమైఁ గరముల నలవోకఁ బ్రాఁకి
చెక్కులనునుపుచేఁ జేరంగ నోడి
చిక్కనితనువల్లిఁ జేరి ప్రాఁకుచును

మోమునందము( జూచి మోదించి తిరిగి
యామీ(ద నెఱికప్పునందు( జిక్కి-కొని
క్రమ్మిన మోహాంధకారంబు( దొల(గి
క్రమ్మఱు తె న్నెఱుంగక వానిమనము
అలరు(దో(టు( జెలంగునగచరం బన(గ(
బలుపోకలను బోయి బాధింప నంత(
గినిసి మారునిసే(త( గీచకాగ్రజు(డు
తనలోన ని ట్లని తలపోయ( దొడ(గె:
" నాయంతరూపరి నాయంతభోగి
నాయంతరసికుని నాతి ర మ్మనదు.
పడ(తుక నను( జూచి పలుక కుండుటకు
నుడుగనిసిగ్గు కా నోపు( గారణము.
నిడువాలు(గన్నుల నెమ్మితో నన్ను(
బడ(తి చూచిన జన్మఫలము గా కున్నె?
పిచ్చుకకుంటుపై( బెదగంగ గదలి
వచ్చినట్టుల కాదె వనిత వచ్చినను."
అని పెక్కు-భంగుల నాసింహబలు(డు
తనలోన నతిరాక( దగ( గోరు చుండె.
అంత నక్కడ భూతలాధీశు దేవి
సంతతపుణ్యా( బాంచాలి రప్పించి

పెదవులు తడుపుచుఁ బేర్చుదాహమునఁ
గదల లేనిది పోలెఁ గాంత కిట్లనియె:

సురకై సుదేష్ణ కీచకునింటికి ద్రౌపదిం
బంచుట.

"వనిత నావదనంబు వఱువట్లు గొనియె;
మన సయ్యె నిపు డాన మదిరారసంబు.
వాచవి యగుకల్లు వాసించి యుండుఁ
గీచకునింట; తక్కినచోట లేదు.
కడువేగమునఁ బోయి కనకపాత్రమున
నిడికొని యది తెచ్చి యిమ్ము నా" కనిన
నదరి యానుడి చెవి కమ్ముగా సోఁక
హృదయంబు గలఁగఁ బెంపేది బెట్టడలి
"ఏమి చేయుదు నెట్టు లిది తప్పుకొందు?
కాముబారికి లోఁగెఁ గంటకుం డతఁడు;
తనయింట ననుఁ జూడఁ దా నేల విడుచు?
కనికరం బతఁ డేల కాంచు నామెడను?
కుపితహార్యక్షుంబుగుహఁ జొచ్చుమృగము
నిపుణత నుసుఱుతో నేర్చునే మరల?
అందుఁ బో నొల్ల నం చాడంగ రాదు;
మందతఁ బోరాదు; మఱి యేమి చేయ?"

అని యాత్మఁ జింతించి యంగనారత్న
మొనరినచెమటచే నొడ లెల్లఁ దడియ
నింతితో నిట్లను: “నే మందు నిన్ను?
ఇంతకు వచ్చెనా యెన్నంగ నేఁడు?
ఏ మని పిలిచితి, వేమిగాఁ జూచి,
తే ముచ్చు నీతోడ నేమి చెప్పితిని?
నీచపుఁజనులకు నే నొల్ల నంటిఁ,
గీచకునింటి కేక్రియఁ బుత్తురమ్మ?
కల్లు తెచ్చుట కేను గా కున్న నేమి
తల్లి నీయొద్ద నెంచఁబఱు లేరు సతులు.
మగవారిసన్నిధి మఱఁగి నీయింటఁ
దగ వొప్ప మెలఁగితిఁ దాల్మి వాటించి.
నిరుపమశీల వౌసీయిల్లు దలఁప
వరధర్మచరితసంభరితం బ టంచుఁ
బతులయసన్నిధిఁ బరిపాటి నుందు.
అతిన దుష్టులచేత నాపద లైనఁ
బాపి రక్షింపఁగా భావింపఁ బోలు;
ఓపి యుపాయంబు నొనరింపఁ జన్నె?
ఏరియింటికినేని నేపని కైన
నేరీతిఁ బంపుదు వీటు నన్ను? నాఁడు

నేను పల్కినమాట నీవు నీకొనిన
వైనంబు మఱవంగఁ బాడియే యిపుడు?"
అనవుడుఁ దనచేయుననుచితంబునకు
వనిత శంకించియు వలవంతఁ దమ్ముఁ
డడలుటం దలపోసి యాసాధ్వితోడఁ
గడువేడ్క మంజులగతిఁ బల్కె నిట్లు:
"అక్కట! యే వేడ్క నానుమద్యమున
కొక్కనీచను బంప నోపమిచేసి
నీతోడఁ జెప్పిన నీ వింత నన్ను
నీతిఘాతినిఁ జేసి నేర్చి యాడితివి.
వనిత నాయి ల్లేమి? వానియి ల్లేమి?
నిను లాఁతియింటికి నేఁ బుత్తునమ్మ?
నీసాధుగుణములు నీచరిత్రములు
నీసమీపమువార లెఱుఁగ కున్నారె?"
అనిన ద్రౌపది యంత "నబలతో నింత
పెనఁగుట కొఱగాదు ప్రియ మేదు" ననుచు
నుల్లంబు వగపున నుబ్బూఁత లూఁగ
మెల్లన సతిమాట మేకొనఁ జూచి
"సురభిగంధముచేత సురుచిరం బైన
సురఁ దెత్తు నీకుభాసురలీల" ననుచుఁ

"గనకపాత్రికఁ దెమ్ము కర్మబంధముల
ననుభవింపక పోదు హరి కైన" ననుచుఁ
గీచకమన్మథాగ్ని యుఁ బోనిపాత్ర
మాచంద్రముఖి యీయ నంది యెంతయును
ఇచ్చఁ గుందుచు వానియింటికై యింతి
వచ్చుచుఁ దనపాటు భావించి పొగిలి,
"హా మాయవిధి యెట్టియాపదఁ దెచ్చె!
నామీఁదిదయఁ బాసె నారాయణుండు.
ఇఁక నాకు ది క్కెవ్వ రీవేళయందు?
ఇఁక నెట్లు వీనిపో రేఁ బాయు" నంచుఁ
దలఁచి మోమున వెల్లఁదన మిమ్మడింప,
నులుకుచేఁ దనువల్లి యురుకంప మొందఁ, .
దొడరుభీతిని నడఁ దొట్రుపా టొదవ,
నెడరుచే నిట్టూర్పు లెసఁగంగఁ, జెమట
నొడ లెల్లఁ దడియంగ నుప్పరంబునను
గడువేడ్కఁ గ్రాలునక్కంజాప్తుఁ జూచి
"కర్మసాక్షివి నీవు కమలబాంధవుఁడ,
ధర్మంబు గెలిపించి దయసేయు మన్న.
కీచకుఁ డొనరించుకీడు దప్పించు,
నీచేయుపురుషారనిచయంబు చాలు."

అని ప్రార్థనము చేయ నాసూర్యుఁ డొక్క
దనుజునిఁ బుత్తెంచెఁ దరుణి రక్షింప.

ద్రౌపది కల్లు దేఁగం గీచకునింటికిఁ
బోవుట.

వాఁడు నదృశ్యుఁ డై వనితవె న్నంటి
పోఁడిగా వినువీథిఁ బొంచి యుండఁగను
దూలుచు సోలుచు దుఃఖభారమున
వ్రాలుచుఁ దాను వారణయాన గాన
భయముతో నంసింహబలునిల్లు దఱిసి
నియతి దప్పనిచేసి నెగు లొంది కుంది
ముద మేది రాహుప్రముఖగహ్వారంబుఁ
గదిసినశీతాంశుకళఁ బోలెఁ జూడఁ
గుటిలకుంతల వానికొలువుకూటంబుఁ
దటుకునఁ జొచ్చియూతలికక్ష్యఁ గడచి
ఓలి బండరువులు నుగ్రాయుధముల
శాలలు గజవాజిశాలలు గడచి
మెఱసి మేఘముఁ జొచ్చు మెఱుఁగుచందమునఁ
బఱచి కీచకుఁ డున్నభవనంబుఁ జొచ్చె.
అప్పుడు సంతోష మాననాబ్జమున
ముప్పిరి గొను చుండ మోహించి వాఁడు

వేఁడినిట్టూర్పులు విరహతాపంబు
పోఁడిగా బాధింపఁ బూఁబోణిఁ జూచి
యిందు ర మ్మనఁ జూచు నెదు రేగఁ జూచు
నం దంద మచ్చిచ్చు లడఁగింప లేక.
సతి యంత నిల్చి కాంచనపాత్రఁ జూపి
యతనికి మొగ మీక యప్పు డిట్టు లనియె:
“ఘన మైనదప్పిఁ గేకయరాజపుత్రి
యనిచె న న్నిచటిమద్యంబుఁ దెమ్మనుచు.
పోయింపు మిదె వేగఁ బోవంగ వలయు;
ఆయింతి కోపించు నాలస్య మైన.”
అనవుడుఁ గీచకుం డాముగ్ధఁ జూచి
“వనిత నీ వేటికి వచ్చి తీపనికి?
మెచ్చులమద్యంబు మెలఁత కీక్షణమె
పుచ్చెద నీ వందుఁ బోవంగ వలదు.
మన సార మాన్చెద మాయంపుదప్పి;
వనిత నాదప్పియు వల దె మాన్పంగ?”
అని యంత నిలువక యతినీచుఁ డగుచు
ననయభాషల నాడ నరవిందనేత్ర
తనికినచింతచేఁ దల్లడిల్లుచును
విననట్లు చూపట్టి వెస నిట్టు లనియె:

" ఏల మద్యము పోయ వెంతసేపున్న?
ఆలస్యమున కింతి కాగ్రహం బడరు.
కలదు లే దని చెప్పి కడువేగఁ బనుపు;
పలుకు లేటికి నాకుఁ బని చాలఁ గలదు."
అనవుడు నాతి కి ట్లనియెఁ గీచకుఁడు :
" పను లెల్ల నను నేలుపనిఁ బోల దబల.
నారాజ్యలక్ష్మికి, నాధనంబునకు,
నారత్నరాశికి, నాసర్వమునకు
నలినాక్షి రాణి వై నాకుల స్త్రీలఁ
బలుమాఱు నేలుచుఁ బనిగొందు కాక.
మగలు హీనులు గాన మగువ నీ కిట్లు
మొగి నితరులకార్యములు సేయ వలసె.
తరుణి నాయెడ నీవు దయ సూపుదేని
నిరతంబు నినుఁ గొల్చి నే నుండువాఁడ.
విసివెదు నామాట విన నేగ" వనుచు
ననమసాయకుఁగాసి నలసి కీచకుఁడు
నయము చాలక మున్ను నవసుధాధాము
రయమునఁ బట్టినరాహువుచందమున
నింతిఁ బట్టినఁ గావ నే తెంచుదైత్యుఁ
డెంతయుఁ దనసత్వ మెల్ల నిచ్చుటయుఁ

బడఁతుక పెనఁగి యప్పాపాత్ముచేయి
విడిపించికొని పాఱి వెడలె నాయిల్లు.
అట్టిద కాదె, యన్యాయవర్తులకుఁ
బట్టినపని కాము బల మెంత యున్న.

తనపట్టు వదలించుకొని పాఱుద్రౌపదిం
గీచకుఁడు వెన్నాడుట.

కోమలి తప్పించికొని పోవఁ బోవఁ
దామసుఁడై వెంటఁ దగిలి కీచకుఁడు
నమిలిఁ దఱుముబాలనాగంబులీల
విమతుఁడై యేతేర వెలఁది వీక్షించి
"ఎక్కడఁ జొత్తు నా కెటు పోవ" ననుచు
దిక్కులు చూచుచుఁ దెగి పాఱుచుండఁ
దనభాగ్యమునఁ జేసి ధరణీశుఁ డపుడు
ఘనలీలఁ గొలువున్నఁ గదిసె నచ్చటికి.
ఖలుఁడు కీచకుఁ డంతఁ గామాతురుండు
నలఘుసత్వుండు గర్వాంధుండు గానఁ
బ్రజ చూడఁ బరకాంతఁ బట్టఁ బోరామి
నిజముగా నెఱిఁగియు నీతిఁ బో విడిచి
జలజాక్షిఁ గదిసి యచ్చటివారు చూడ
తలఁ బట్టి తిగిచి యుద్ధతి నేలఁ ద్రోచె.

అంత సూర్యునియాజ్ఞ నరుదెంచుదూత
వింతయగా బలిమిని ద్రేసెఁ గీచకుని.
ద్రేసినఁ బులి కోల ద్రేసిన ట్లులికి
యాసరోజాక్షిని నటు దోరగించి
యొదుపు దప్పినయట్టియురగంబు పోలె
నుడుకుచు నుండె నిట్టూర్పులు నిగుడ.

ద్రౌపదిపాటుఁ గని భీముఁడు
రేఁగుట.

అప్పు డగ్రజునితో నాస్థానసీమ
నొప్పువాయుజుఁ డట్టు లున్నదలీల
ద్రౌపది సభలోనఁ దలఁ బట్టి యీడ్చు
పాపాత్ముఁ జూచి కోపము సైఁప లేక
"దుశ్శాసనుఁడు సేయుదుండగం బిపుడు
నిశ్శంకఁ జేసె నిన్నియు నేల" యనుచు
నెర పైనకనుదోయి నిప్పులు రాల
గరుపాఱి చెమట నంగము దొప్పదోఁగ
సమదకీలాభీలచటులోగ్రదృష్టి
రమణతోఁ గాలభైరవమూర్తిఁ దెగడి
తలఁచె నప్పుడు భూమితలము నాకసము
నెలయుతాళములుగా ద్రేసి యాడంగ

నుఱక చింతించెఁ బయోరాశిఁ గలఁచి
మెఱసి చిక్కనిసొంపి మెయిఁ బూసికొనఁగ.
ఉంకించెఁ గులగిరు లొండొంటిఁ దన్ని
కొంకక తాడించి గుదిఁ గ్రుచ్చి యాడ.
మిక్కిలి తమకించె మెలపునై దిక్కు
లొక్కదిక్కునఁ దెచ్చి యురుశక్తిఁ గొదువ.
ఊహించెఁ గీచకు నొగిఁ బుత్రమిత్ర
సాహాయ్యసహితంబు చంపి చెండాడ.
తగ నిట్లు కోపించి తనభుజంబులకుఁ
దగినకైదువు లేమిఁ దల యూఁచి వగచి
ఘన మైనయొకద్రుమాను గని యంతలోనఁ
దనర నించుక ధర్మతనయుఁ జూచుటయు
నతఁడును గనుసన్న ననుజు వారించి
చతురుఁడై వలను విచారించి పలికె:
"వలల, వే ఱొకచోట వంటకట్టియలు
కలుగవే, యాద్రుమాను ఖండింప నేల?
ఇందఱుఁ జూడఁగ నిది గూల్ప నేల?
ఇందఱు నీలావు నెఱుఁగరే మున్న?
విఱువకు, మిప్పుడు వృక్షంబు మనకుఁ
దఱ చైనతలప్రాపు దాపునై యుండు"

అనిన మిన్నక యుండె ననిలనందనుఁడు.
వనిత మెల్లన లేచి వారి నీక్షించి
వనజంబులను మంచు వ్రాలుచందమునఁ
గనుఁగవ బాష్పంబు గడలుకొనంగఁ,
జంపకంబునఁ బేర్చు సౌరభం బనఁగ
నింపుగా ముక్కున నిట్టూర్పు నిగుడ
విరిసినకురులతో వెఱఫుతో ధూళి
పొరసిన మేనితోఁ బొక్కుచు వచ్చి
జగతీశు డగ్గరి సభవారిఁ జూచు
పగిది నెట్టనిచూడ్కిఁ బతులఁ జూచుచును
గ్రూరకాకముచేతికోయిలఁ బోలి
యారెలుంగునఁ గాంత యేడ్చుచుఁ బలికె:

ద్రౌపది విరటునిసభలోఁ దనభంగపాటుం
దెలుపుట.

"అకట నామగలు ధర్మాధర్మవిదులు
సకలశాత్రవలోకసంహారపరులు
పరులకు నైన నాపద లైన నణఁచి
వరుసఁ గీర్తులు గన్నవంశరత్నములు
ఏవురు మగలు నా కెలమి గంధర్వు
లీవేళ నన్ను నుపేక్షింప నగునె?

రమణిని నొకఁ డైన రక్షింపలేని
తమపౌరుష మ దేల తమలా వ దేల?
బల మెంత గలిగినఁ బ్రాప్తంబు దప్ప
దిల నెట్టివారికి నేని; నే నెంత?
ఈవేళ నెవ్వారి నే మనం గలను?
భూవిభుండును శాడిఁ బొరయఁ డెంతయును.
తనభూమి నొకనీచు తప్పు చేసినను
జను నె వారింపక సైరించి యుండ?"
అనవుడు విరటుఁ డయ్యతివమాటలకుఁ
దనయానఁ బచరింపఁ దలఁపు పుట్టియును
హీనసత్త్వుఁడు గాన నెలమిఁ గీచకుని
నోనాడ నోడి సన్నుతు లొప్పఁ జేసె.
వాఁడును నకోర్కప వైభవం బణఁచి
పోఁడిగా నింటికిఁ బోయెఁ బోవుటయు
సైరంధ్రి సభఁ జూచి సభలోనిజనులు
వారికి వారు దైవము దూఱువారు,
భూరాజ్యలక్ష్మి కాఁబోలు సీయింతి
సైరంధ్రి గా దని శంకించువారు,
ఈసతి నిటు సేయ నెంతవాఁ డనుచు
నాసింహబలుమీఁద నలిగెడువారు,

ఈనాఁటఁ దా నుండి యింత సేయింపఁ
గానోపు నని దేవిఁ గనలెడివారు.
ప్రజ లిట్లు పలువురు పలుమాట లాడ
నిజసతిపై నల్క నెరపి ధర్మజుఁడు,
తోడరి మోమునఁ గిన్క దోడరంగనీక
మడవి యి ట్లని పల్కె మధ్యస్థుపగిది:
«వినిరి నీమాటలు వెఱ నెల్లవారు;
చన రాదె యిఁక నైన సభలోనఁ దొలఁగి.
గంధర్వులకు వేళ గా కుండెఁ గాక
సంధింప కున్నా రె సాధ్వి నీపనికి.
నెలకొన్న సమయంబు నీకు వారలకుఁ
గలుగ కుండిన వచ్చి కావరే నిన్ను?
వారి నాడుట గాదు వడి నేగు» మనిన
సైరంధ్రి మఱియు నచ్చట నిల్చి పలుకఁ
బూఁచినఁ గని ధర్మపుత్రుఁ డాసతికిఁ
దోఁచినకోపంబు దొడర ని ట్లనియె:
«నాన యించుక లేక నర్తించుపగిదిఁ
బూని యీపోకలఁ బోవ నేమిటికి?
కులకాంత లీరీతిఁ గొలువులో నిలిచి
పలుకరు నీ వేల పలికెదో కాని.

జలజలోచన చాలుఁ జాలుఁ బొ'' మ్మనినఁ
దొలఁగక సతి నేర్పుతోడ నిట్లని యెః
''నావల్లభుఁడు మున్ను నటవేషధారి
కావున నా కట్లు కాక పో రాదు.
నటమాత్రుఁడే కాఁడు నాప్రాణనాథుఁ
డటనుటంబున జూద మాండంగ నేర్చు.
జూదరియాలి కెచ్చోట నైన నాన
లే దనంగను బని లేదు నీ కింక''
అని చాయగా నాడి యచ్చోటు తొలఁగి
చనుచుఁ బాంచాలి విచారింపఁ దొడఁగెః

సుదేష్ణకు ద్రౌపది తనపడినపాటుఁ
దెలుపుట.

''ఇచ్చ నాపాపాత్మునింటికి నిట్లు
పుచ్చినసతి నింకఁ బోయి కోపింతు.
ఎఱిఁగియు నెఱిఁగియు నింత చేసినది
వెఱచునే నాకోపవిధముఁ జూచినను?
వెఱవద కా కేమి వెస నింక నన్నుఁ
దఱిమను కీచకాధమునింటి'' కనుచు
నాదైన్యమున వచ్చి యువనీశుసతికి
నాదటఁ బొడసూప నది సంభ్రమించి

యెఱుఁగనియదిపోలె నెఱుఁగు కంపింప
వెఱఁగుపాటును బొంది వెలఁది కిట్లనియె:
"కలయ నెన్నొసటిపైఁ గంధరఁ గలసి
చెలియ నీకురు లేల చెమటలో నుండె?
వెలఁది నీకన్నీరు వెసఁ జూడ్కి నిలుప
నొలికెడు నేమమ్మ యోసరోజాక్షి?
మనసులోపల నెంతమాత్రమో వగవు?
వనిత నీవదనంబు వాఁడఁ బాఱినది.
ఎలమి నీతను వెల్ల నెలతిఁగఁ బోలి
పొలఁతియెంతయుఁదూలఁబోయియున్నదియ
ఎవ్వఁడు నీదెస నెగ్గు గావించె?
చివ్వన వానినే శిక్షింతు" ననిన
"మఱియెవ్వ రున్నారు మమ్ము మన్నింప
నెఱిఁగింతు వినుము నీ వెఱుఁగుకార్యంబు.
పరికింప నీవు నొప్పరికించి నన్ను
సురకుఁ బుచ్చితి కాదె సూతునింటికిని.
పుచ్చినఁ జని కల్లు పోయింపు మనిన
నచ్చలంబున వాఁడు నవినీతిఁ దలఁచి
పట్ట వచ్చిన నేను బట్టునఁ బాఱి
నెట్టనఁ గొలువులోనికిఁ జేరుటయును

వెనుకొని పఱతెంచి వెఱ వేఁది వాఁడు
ననుఁ గూలఁ ద్రోచె మానవనాథు నెదుట.
తరుణి యేఁ బుట్టి యింతటిదాన నైతి,
ఇర వొప్ప నెన్నఁడు నిట్టిది యెఱుఁగ."
అనవుడు వెఱపుతో నబల నూరార్చి
తనరఁ గేకయరాజతనయ యిటనియె:
"వగవకు వానిగర్వము నెల్ల మాన్చి
తగ దని శిక్షింతుఁ దమ్ముఁ డంచనక.
భూమీశుమాట వమ్ముగఁ బుచ్చుఁ గాని
నామాట నాతఁ డెన్నఁడు దాఁట వెఱచు."
అను కేకయాత్మజ కనియె ద్రౌపదియు
"అనుజుపై నీ వింత యలుగంగ నేల?
ఉఱుమనిపిడుగులై యువిద నామగలు
చెఱప నున్నారు కీచకుపీఁచ మణఁచి.
అప్పు డీపనికి లో నైనవా రెల్లఁ
దప్పఁ జేసితి మని తారె పొక్కెదరు"
అనిన న ర్థము నాటి యబ్బోటి తలఁకి
తనర ద్రౌపదిఁ బెద్దతడువు ప్రార్థింప
నాదటఁ దనఖేద మప్పటి కణఁచి
పో దయ్యె మజ్జనభోజనాదులకు.

ఆవేళ సఖు లెల్ల నాసింహాబలుని
చావు నిక్కముచేసి చాలఁ జింతింప
లీలతోఁ దనపవ్వళించు తావునకుఁ
దూలుచుఁ జనుదెంచె ద్రుపదనందనయు.
చనుదెంచి మైదీఁగ సజ్జపైఁ జేర్చి
కనుఁగవఁ గన్నీటికణములు దొరఁగఁ
బగతురచేతఁ దాఁ బడినపా టెల్ల
నొగిఁ దలపోయుచు నుగ్మలి వగచి
"బలవంతుఁ డగుసింహాబలుని మర్దింపఁ
గలఁడు భీముఁడు, నాకుఁ గలఁక యేల?" లనుచు
నినుఁ డస్తమించి పోయిన నడురేయి
మనుజు లందఱు మాఱు మఱఁగి యుండఁగను
మగువ దిగ్గన లేచి మజ్జనం బాడి
పొగడ నొప్పగుపట్టుపుట్టంబు గట్టి
చెక్కుల మెఱుపులఁ జెలఁగి చీకట్లు
ప్రక్కలై పాఱ నా వాసంబు వెడలి
నడు మసియాడంగ నడతెంచె నపుడు
వడముడి నిద్రించు వంట యింటికిని.

### ద్రౌపది భీమునిచెంతకుఁ బోయి తనభంగపాటు చెప్పికొనుట

అప్పుడు సుఖనిద్ర ననిలనందనుఁడు
ఱెప్పలు వెస మోడ్చి ఱిచ్చపడ్డట్లు
తొలుకారుమెఱుఁగులతునకలో యనఁగఁ
గలికి యూర్పుల దీపకళిక లల్లాడఁ
గలకౌరవుల నెల్లఁ గడపాలుసేయఁ
గలఁ గని చిఱునవ్వు గలమోము వెలయ
నఱిమురిఁ దాఁ గొన్నయన్నంపురాసు
లఱుగఁ బ్రేవులు కుక్షి నధిక మై మ్రోయఁ
గుడిప్రక్క మీఁదుగాఁ గొమరారియున్నఁ
బడఁతి యొయ్యనఁ బోయి పతిఁ జూచి వగచి
"అక్కట యిసుముమీఁ దై కీచకుండు
తక్కక నాకు నంతటితప్పు చేసి
మిసిమింతుఁడును గాక మేటి మై పోయె
నిసుమంతయును గిన్క నెదఁ గాంచ వీవు!
కంటికి నిదుర యెక్కడఁ గల్గె నీకు?
వంటల డస్సితో? వానిఁ గాచితివో
మీయన్న వల దన్న మిగులంగ లేక?
వాయుజ నే నొల్ల వట్టిప్రాణములు."

అని పాణితలమున నతని పెన్నొడలు
వనజాక్షి చఱచిన వైళంబ లేచి
"నీ వెవ్వ" రనుటయు నేలంత "నే" ననిన
భావంబులోన ద్రౌపది యౌట యెఱింగి
"కీచకుఁ జంపింపఁ గినిసి యే తెంచె
నీచంద్రముఖి తా నె యెఱింగించుఁ గాక"
యని తా నెఱుంగనియట్లు వాయుజుఁడు
వనితఁ దప్పక చూచి వల నొప్పఁ బలికె:
"నడురేయి నీరీతి నడయాడఁ దగు నె?
పడఁతి యెవ్వారికంటఁ బడక వచ్చితివె?
ఏటికి చనుదెంచి తెఱింగింపు" మనిన
బోటి యొయ్యనఁ బల్కెఁ బురుషు నీక్షించి
"ముంజేతికంకణంబున కద్ద మేల?
కంజాక్షు నే నున్నగతిఁ గాన రాదె?
ఎఱిఁగియు నెఱుఁగవె యెఱింగింప నేల?
మఱచిన విను నీకు మఱియుఁ జెప్పెదను.
జననాథుమఱఁది కీచకుఁ డప్పకడకు
వినతుఁ డై పో వచ్చి వెస నన్నుఁ జూచి
వలరాజువలఁ జిక్కి వగున నామొదుటఁ
బెలుచ దుర్నీతిమైఁ బ్రేలఁగా నేను

తగ దని యెన్నిచందములఁ జెప్పినను
మగుడ నేరక యున్న మగుడ నిట్లంటి
'గంధర్వు లేవురు గలరు నామగలు
సంధించి నినుఁ బట్టి చంప నోపుదురు.
వైరంబు కొఱగాదు వలదు పొ' మ్మనిన
నీరతారలు గొన్ని యెన్ని వాఁ డపుడు
పోయెఁ బోయిన నంత భూనాథుదేవి
దాయంగ నన్నుఁ బిల్చి తప్ప భావించి
తమ్మునియింటిమద్యంబుఁ దె మ్మనుచుఁ
బొ మ్మని నన్నుఁ బెద్దప్రొద్దు ప్రార్థింప
నేమియు నన నేర కేనును బోయి
భామకు మద్య మప్పాత్ర్ను నడుగ
వినక వాఁడును గొన్ని వెడమాట లాడి
నన్నుఁ బట్ట వచ్చె నన్యాయంబుఁ దలఁచి.
చే యీక యేనును శీఘ్రంబ పాఱి
మీాయున్నసభఁ జేర మెఱసి కీచకుఁడు
కామాంధుఁ డై తీవ్రగతిఁ జేర వచ్చి
యే మేమి చేసెనో యెఱుఁగవా నీవు?
నీ వేమి చేయుదు నీకోపవహ్ని
కా వేళ యమసూతి యడ్డంబు వచ్చె.

సభలోన మున్ను దుశ్శాసనుఁ డర్థి
నభయుఁడై కావించె నంతటిపనులు!
మును జయద్రథుఁ డట్లు మొగి నరణ్యమున
ననుచితం బొనరించె నది చెల్లి పోయె!
నేఁడు కీచకుఁ డింత నికృతి గావించె.
నాఁడును నేఁడు నున్నారు మీ రెల్ల.
ఎన్నఁడు మీలావు నెఱిఁగింప నగునో?
ఎన్నఁడు రిపుకోటి నేపణంచుటలో?
వెలఁదులు మొఱవెట్టఁ బెఱవార లేనిఁ
దలపోయరే ప్రోవ ధర్మంబు దలఁచి?
పగతుండు కొలువులోపల నన్నుఁ దన్నఁ
దగునె మిన్నక యుండ ధర్మసూనునకు?"

ధర్మజుం మాఱఁ దగ దని భీముఁడు

ద్రౌపదికిం జెప్పుట.

అనినఁ బాంచాలి కిట్లనియె వాయుజుఁడు
"వనిత ధర్మజు దూఱ వల దింక నీకు
నావేళ ననుఁ జూడ కతఁ డూర కున్న
భూవల్లభుని వానిఁ బొరిగొందు నేను
పొరిగొన్న లోకు లప్పుడు నన్ను నెఱిఁగి
వరుస వాయుజుఁ డని వార్తకుత్తు రేని

నలినాక్షి మనకుఁ గాననభూములందు
వెలయఁ దొల్లిటియట్ల విహరింప వలయు.
కావునఁ గోపింపఁ గాదు ధర్మజుని;
భావింప నాసింహబలుఁడు నా కెంత?
వల నొప్ప నజ్ఞాతవాసవత్సరము
తలపోయఁ దగుఁ గాక తమకింప రాదు."
అనిన నట్టిద కాదె యని భీమసేనుఁ
గనుఁగొని మఱియు నాకాంత యి ట్లనియె:
"ఏమి చెప్పుదు భీమ యీ దేవియింట
నేమంబుతో నేను నెరవేర్చుపనులు:
నలుఁగు నూఱియుఁ జందనంబు దాఁచియును
గలయఁ జేతుల నెల్లఁ గాయలు కాచె.
కుంతిదేవికి మీకుఁ గొంతేసి కాని
యెంతయు వెఱతు నే నీసుదేష్ణకును.
వెఱచిన వెఱ పెల్ల వీటిపోవంగ
నుఱక తమ్మునిఘాత కొప్పించె నన్ను.
అంతయు నతివపై నలిగి ధర్మజుని
భ్రాంతిమై దూఱుచుఁ బలికితిఁ గాని
పరహితదయాపరుఁడు ధర్మజుఁడు
పరిచితనీతితత్పరుఁడు ధర్మజుఁడు

శరణాగతాభిరక్షకుఁడు ధర్మజుఁడు.
చిరయశశ్చంద్రికాంచితుఁడు ధర్మజుఁడు.
ఇట్టిధర్మజు దూఱ నెవ్వరివశము.
పుట్టనిశత్రువు ల్భువిఁ గల్గునతఁడు

తననాథులు విరటునిం గొలిచి గాసిల్లుటకు
ద్రౌపది పరితపించుట.

విరటునిఁ దాఁ గొల్చి విహరించునపుడు
పురపురఁ బొక్కి యప్పుడె శాంతిఁ బొందు.
మఱియును నీచేయుమహితసత్వములు
మెఱసి యెన్నఁదమన్న మితి మేర లేదు.
అట్టినీవును గట్టియలు పట్టి విఱువ
నెట్టన మనసులో నెగు లొందు నాకు.
మదగజశార్దూలమహితసింహములఁ
బడిల మైఁ గరిడిలోపల నీవు పెనఁగ
నన్నును బిలిపించి నరనాథుదేవి
నిన్నుఁ జూపిన నాకు నిగ్రహం బెసఁగు.
నలినాక్షు లప్పుడు నావికారంబు
తెలియంగఁ జూచి సందియముఁ బొందుదురు.

కావున మనల నక్కడకు నక్కడకు
భావించి చూతురు ప్రజలు దప్పకయ.
మనయర్జునునిఁ జూడు మహి నింతవానిఁ
గనిపెట్టి దైవంబు గాసిపెట్టెడిని.
సృష్టిలోపల నుర్వశీమోహనకును
దృష్టి తాఁకినయట్లు తేజంబు మాసె.
తనుఁ జూచి లజ్జింతుఁ దగ వొప్ప మున్న
ననుఁ జూడ నిప్పుడు నరుఁడు లజ్జించు!
ప్రతివీరులకు బాహుబల మొప్పఁ జూపు
నతఁడు నాట్యముఁ జూపు నతివల కిపుడు.
అదియును గాక పాయక నాకు నకులు
మదిలోనఁ దలఁప నుమ్మలికంబు పుట్టు.
అశ్వినీదేవతలందు జన్మించి
అశ్వశిక్షకుఁ డమ్యె నన్యులం గొలిచి.
ఘనుఁడు మాద్రీదేవిగారాబుకొడుకు
తనకు నొండొకరాజుఁ దగఁ గొల్వ వలసె.
ఈచోట నీరీతి నింత వాఁడున్నఁ
జూచిన వారెల్లఁ జోద్య మందెదరు.
సహదేవుఁడును ధర్మసహకారి సువ్వొ
సహజతేజోరాశిసహితుఁ డీమహిని.

గొంతి యీతనిఁ గూడికొని వచ్చుపనికి
నెంతయుఁ జెప్పి నా కిట వచ్చునపుడు.
నానేర్చునంతఁ గాననభూములందుఁ
బూని తోడ్కొని వత్తు భోజనాదులకు;
పనుల వెంబడిఁ జొచ్చి పరులకై నేఁడు
కనుగంది యున్నాఁడు గథ లేల యింక"
అని తనవగ లెల్ల ననిలసూనునకు
వినిపించి మెలుఁ గత్తి వెస నేడ్చుటయును
దనకును వగ పుట్టి ధైర్యంబుఁ బట్టి
ఘనుఁడు భీముఁడు కాంతకన్నీరు దుడిచి
"శోకింప నేటికి? సుఖము దుఃఖంబు
లోకులఁ బ్రాపించు లోలాక్షి వినుము.
అర్కున కుదయంబు నస్తమయంబుఁ
దర్కింపఁ గలిగె నందఱిఁ జెప్ప నేల?
రమణి హరిశ్చంద్రరామచంద్రులకుఁ
గ్రమ మొప్ప నలునకుఁ గలుగదే పాటు?
ఘనకీర్తి లక్షులు గన్నారు వారు;
మనము నట్టుల కామె మదిరాయతాక్షి?
బగిఁ గర్ణశకునిసుయోధనాధులకుఁ
దగినమృత్యువు వచ్చుదాఁక సైరింపు

ముడుగక వారి కాయువు నిండినట్లు
వడి నిండ నజ్ఞాతవాసవత్సరము
కడమగా నొకకొంతకాలంబు గలదు.
తడయక కీచకాధముఁ జంప వలయు.
పడఁతి నిన్నిటు చేసి పసిముట్ట కెగఁ
గడఁగి యెల్లియును రాఁ గలవాఁడు వాఁడు.
వచ్చిన నొడఁబడ్డ వైఖరి నీవు
నచ్చుగా నొంటిమై నర్థరాత్రమున
నాటకశాల కున్నతి వచ్చితేని
వాట మై యేనును వచ్చెద నటకు'
అని పల్కి నాతోడ నన్నియుఁ దెల్పి
వినిపింపు నే వాని వెస మడియింతు;
పొమ్ము నీ'' వని వాయుపుత్రుండు లేచి
యమ్ముగ్ధఁ గొంతద వ్వనిచి వచ్చుటయు
శయ్యకుఁ జనుదెంచి జలజాయతాక్షి
యొయ్యనఁ గనుమోడ్చి యుండె నంతటను
చీఁకటిముసుఁగు విచ్చినభూతలంబు
వీఁకమై నలరారె వెలుఁగొందె దిక్కు
లందుఁ గుంకుమగంధ మలఁదిన ట్లగుచు
నందముఁ జూడంగ నరుణుండు పొడిచెఁ

దామరమొగడలు తల లెత్తి నవ్వ,
మోములు విన్ననై మొగిఁ గల్వ లొఱఁగ.
అంత సూర్యోదయం బయ్యెఁ దూర్పునను
సంతసంబున సర్వజనములు మ్రొక్క
హరిహరచతురాస్యు లైక్య మైనట్లు
పరమ తేజము గానఁబడె సృష్టి కెసఁగ
బడబాగ్నిముఖముసఁ బడుటకై వెఱచి
జడధి వెల్వడురత్నసంఘమో యనఁగ
నసమున వేదత్రయం బనుశాఖఁ
బస నారఁ బండినపండొకో యనఁగ.
ఇనుఁ డిట్లు పొడిచిన నెలమిఁ గీచకుఁడు
తనయనుష్ఠాన మెంతయు వేగఁ దీర్చి
తలఁపులోఁ బాంచాలతనయరూపంబు
నెలకొని కోర్కెలు నించి దైవారఁ
దెఱఁ గొప్పఁ గస్తూరితిలకంబు దీర్చి
మెఱసినజవ్వాది మెయి నిండ నలఁది
చిగురువన్నియ నొప్పుచీనాంబరంబు
తగురీతిఁ గప్పి రత్నపుసొమ్ము దొడిగి
కొలఁదిచెంగలువలుఁ గురువిందవిరులు
మలచినవక్రాళిపై మకుటంబు పెట్టి

దివ్య మైనొప్పుము త్తియపుహారములు
సవ్యాపసవ్యపార్శ్వములపై వైచి
పడఁతుకల్ ధవళాతపత్రము ల్పట్టఁ
గడుమంచిరథ మెక్కి కలిమి దీపింప

కీచకుఁడు ద్రౌపదితోడ భాషింప
సుదేష్ణయింటికిం బోవుట.

"సైరంధ్రి నెలయింతుఁ జలము సాధింతు
మరుని మెప్పింతు నిమ్మహి మింతు" ననుచుఁ
దరమిడి తనసహోదరియింటి కరిగి
సారిదిఁ గాల్నడతోడఁ జొచ్చి యచ్చటను
దనతోడిమాటకై ద్రౌపదీదేవి
యొనరంగ నేకాంత మున్న నీక్షించి
నేర్పార నిది మంచినెల వాయె ననుచు
సర్పంబు గఱచినచంద మై వాఁడు
తనకొలందులు గాక ధైర్యంబు వదలి
మునుకొన్నసిగ్గులో మునిఁగి యేలాడి
మెలఁగుదీమముఁ జేరుమృగముచందమున
జలజాక్షి డగ్గఱఁ జని సింహబలుఁడు

తనవచ్చురాకకు ద్రౌపదీదేవి
కనియుఁ గానని రీతిఁ గైకొన్న నెఱిఁగి
పలుక నేరక యున్నఁ బని లేనిమాటఁ
దలకొని ధరణిపైఁ దాటించుఁ గాలు,
వడిఁ బేర్చి కంబంబు వాయించుఁ గేల,
వెడపాటఁ బాడు, నవ్వేలఁదికట్టెదురఁ
బొడసూపు, సతిచూపుఁ బొడకాన కులుకు.
కడ లేనిమోహవికారంబు గ్రమ్మ
దొరకొని వాఁ డిట్లు దుర్వ్యాలాపములు
నెరయంగఁ జేసి యానెలఁత కిట్లనియె:
“నెలఁత భాగ్యము గాదె నీపాదయుగముఁ
గొలిచి యుండుట నాకుఁ గోమరు దీపింప!
ఇది యేమి సైరంధ్రి యే నెంతవైనఁ
గదిసి ప్రార్థించినఁ గైకొన విపుడు;
వనజాక్షి నన్ను నెవ్వరిఁగాఁ దలంతు
వినుఁడును బోనోడు నే నిల్వు మనిన.
విరటుని నేఁ దెచ్చి విభునిఁగాఁ జేసి
చిరకాలమును గూడుఁ జీరఁ బెట్టుదును.
ధనముఁ బ్రాణమ్మును దరుణి నీసొమ్ము;
నను వెట్టిగొన రాదె నావేడ్కఁ జేసి!

పనిగొని నిన్నేను బలిమిఁ బట్టినను
వనజాక్షి నాప్రేలు వంప రెవ్వారును.
అంత చేసితి నిన్ను నాస్థానభూమి
నింత నెవ్వారికైన నే మన వచ్చె?
ఎక్కడిగంధర్వు లెక్కడిమగలు
నిక్కమై కలిగిన నిన్న రా వలదె?
చపలాక్షి యిటమీఁద సైరింప" ననిన
ద్రుపదనందన యోర్పు తోడవుగా నిల్చి
"పన్నుగా నే మాయఁ బన్నక యున్న
మున్నాఁడునే కార్యముఖము గా" దనుచు
నెయ్యంబు దోఁప నన్నీచుమాటలకు
నియ్యకొన్నది పోలె నించుక నవ్వి
వానితో నిట్లను "వల నైనబుద్ధు
లే నెన్ని చెప్పిన హితవుగా వినవు
రీ తెఱుంగవు వేగిరించెదు కాని;
నీతలంచినయట్లు నేఁ జేయఁ గలను.
తగ వేది మగవాఁడు తమకించునప్పుడు
మగువకు దనపంపు మానంగ రాదు.
కావునఁ బ్రకటంబు గానిమార్గమున
భావింప వలయు నేర్పడ నిట్టిపనులు"

అనవుడు మదిలోన నాతిఁ డుప్పొంగి
"వనిత నీవే ప్రోవఁ బరికింపు మేను
నీమాట జవదాఁట నెఱి నమ్ము మీవు.
నేమంబుమై నిన్ను నేఁ గొల్తు నెపుడు?
మానిని విను నన్ను మఱవ లే వనుచు
నాన యీ వలె" నన్న నల్లన నగుచు
నానీచుపైఁ గోప మాత్మలో నణఁచి
వానితో మఱియు నవ్వామాక్షి పలికెః

కీచకుని నాట్యశాలకు ర మ్మని
ద్రౌపది చెప్పుట.

"ఆన యేటికి నిప్పు డయ్యెడుపనికి?
నే నేల మఱచెద? నీ వింకఁ బొమ్ము"
అనవుడుఁ" గీచకుం డాత్మఁ దా నలరి
"వనజాక్షి ననుఁ బ్రోవ వలయు నీ" వనియె.
అనిన నామోదంబు నందిన ట్లతివ
"చనదు నీకును నాకు సల్లాప మిచట.
నడు రేయిఁ జేరుము నాట్యాలయంబుఁ
గడు వేడ్కఁ నే నందుఁ గాచి యుండెదను.
అది చూడ నాకు రహస్యస్థలంబు,
కదియ రెవ్వరు దానిఁ గటికిచీఁకటిని.

అనుమాన మేటికి కేనందు వచ్చెదను.
చనుము నీయింటికి జవ మొప్ప" ననిన
నానాతిమాటల కాత్మలో నలరి
"యే నొక్కఁడన వత్తు నీరాత్రి నటకు,"
అని యాతఁ డనఁ గాంత "యది నీవు మఱవఁ
జనదు, నీ వొంటిమైఁ జనుదేర వలయు;
అటు గానియెడ నమ్ము మట నిల్వ లేను
తటుకున నేఁ బోవుదాన నాత్రోవ"
అన నెంతయును బొంగి యానీచుఁ డొప్పి
చనియె నింటికి నాత్మ సంచలింపఁగను.
చతురతఁ గార్యంబు సవరించి యిట్లు
సతి తనపను లెల్ల జరుపంగ నరిగె.
అట్టిద కాదె కామాంధుఁ డేపనుల
ముట్టినచో నెల్ల మోసపో కున్నె?
వాఁ డట్లు పోయిన వడి నెల్లపనులు
పోఁడిగాఁ దీర్చి యప్పువ్వారుఁబోఁడి
వండెడుగృహములో వాయుసంభూతుఁ
డుండఁగా నచ్చోటి కొప్పారఁ బోయి
తెలిసిననెమ్మోము దీప్తిఁ జెన్నొందఁ
బలికె నల్లన నవ్వి బకవైరితోడ

"వాయుజ నేఁ జేయ నలనైనకార్య
మాయె నీ వెఱుఁగుదు వటమీఁదిపనులు.
ఘన మైనచీఁకటి గలరాత్రి నేఁడు
జనుల వంచించి కీచకుఁ జంప వచ్చు"
అనిన నించుక నవ్వి యతఁ డిట్టు లనియె
"వనిత నీ వేమంటి? వాఁ డేమి పలికె?
చెప్పు మంతయు; వాని శిక్షించుపనులు
చెప్ప నేటికి? వాఁడు చిక్కినఁ జాలు."
అనవుడుఁ బాంచాలి యాసింహబలుఁడు
జననాథునగరికిఁ జనుదెంచు తెఱఁగుఁ
జనుదెంచి తనుఁ జూచి చపలుఁడై యంత
చనవు బీరముఁ జూపి సంభ్రమించుటయు
వాని నుత్కటకీర్తి వరుస గాదనుచు
నానీచువచనంబు లంగీకరించి
నెలకొన్నరాత్రి వానికి నాట్యశాల
యలరినసంకేత మని చెప్పుటయును
వాఁ డంత నొంటిమై నత్తుఁ గా కనుచుఁ
బోఁడిగాఁ జనుటయుఁ బొసఁగ నేర్పఱిచె.
అప్పుడు బకవైరి యంతరంగమున
నుప్పొంగువేడ్కతో నువిద వీక్షించి

"కలకంఠి వానినిఁ గడతేర్చుపనికిఁ
దలకూర్చి తెంతయుఁ దనరంగ నేనుఁ
బరికించి వంచన బయలు గాకుండ
నరిజయం బొనరించి యన్న మెప్పింతు.
కలఁగక యొంటి రాఁ గలఁడో కో వాఁడు?
పలుకుఁదోడుగఁ గొంతప్రజఁ దేక రాఁడో.
అంత చేయఁగ నోడు, నబల నీమాటఁ
జింతించు, వాఁడు నిశ్చింతసాహసుఁడు
వచ్చును నిక్కంబు, వచ్చి నాచేతఁ
జచ్చును నిక్కంబు సాధ్వి కీచకుఁడు.
ఏవగ నైన వాఁ డిటు వచ్చి తనదు
భావంబునను గొంత పరికించి తొలఁగ
నప్పు డున్నది వాని కంత్యకాలంబు.
చప్పుడు గాకుండఁ జంపి వైచెదను.
అటుగాక వాఁడు మహాశక్తి మెఱసి
పటుగతి నడచిన బ్రహ్మాండ మద్రువ
జలధులు గలఁగ భూచక్రంబు వణఁకఁ
గులగిరు లగల దిక్కులు బ్రయ్యఁ గినిసి
యొగి సాళువము కాకి నొడియుచందమునఁ
దెగి పోరి యేను వధింతుఁ గీచకుని"

అనుటయుఁ బాంచాలి యాత్మలో వెఱచి
యనిలసంభవుతోడ నల వొప్పఁ బలికె:
"ఇంత కోపించిన నెల్లమానవులు
వింతగాఁ జూతురు; విభుఁడ, కోపించి
చేసినకార్యంబు చెనఁటి యై పోవుఁ
జేసేత నపకీర్తి సిద్ధించు మనకు.
ఇరుచెవియును జెక్కు లెఱుఁగ రాకుండ
వరబలుఁ గీచకుఁ బరిమార్పు మనఘ"
అనిన ద్రౌపది కిట్టు లనియె వాయుఁజుఁడు
"తనలావు నాకు నుద్ధతిఁ జూపునపుడు
పరఁగఁ గీచకుని మార్పఁగ నేర్తు ననిన
హరిణాక్షి చూచెద నావేళకొలఁది".
అనిన సంతోషించి యతని దీవించి
పౌనరఁ బాండవపత్ని పోయె నింటికిని.

కీచకుఁ డుద్యానవనంబున
విహరించుట.

అటఁ గీచకుఁడు మన్మథాగ్నిచేఁ దూలి
ఘటికార్థమును బ్రొద్దు గడపంగ లేక
యెలమావితోఁటలో నేకాంతసీమఁ
బాలు పెనకురువింజపొదరిల్లు చేరి

పన్నీరు చిలికించి పచ్చకప్పురము
లెన్నికఁ జల్లించి యెలమిఁ బుట్టంగఁ
కలికిరాచిలుకలు గండుకోయిలలు
వెలయించుపలుకులు వినుచుఁ గూర్చుండి
ద్రౌపదిరూపంబు ద్రౌపదినేర్పు
ద్రౌపదిగరువంబుఁ దలపోసికొనుచుఁ
గలఁగుఁ దత్తఱపడుఁ గంపించు వగచు
విలపించుఁ దలయూఁచు వెఱచి మై మఱచు.
విరహాగ్నిచే నిట్లు వెఱ్ఱియై వాఁడు
తరమిడి తనలోనఁ దలపోయుఁ డొడఁగె:
"పడఁతుక నామాటఁ బాటించు నొక్కొ
కడకు నీడకు వచ్చి కామించు నొక్కొ
రాకకు విఘ్నంబు రాకుండు నొక్కొ
భూకాంతుదేవి తాఁ బొమ్మను నొక్కొ
ఏకాంతమున నుండి యెలనాగ వేడ్క
నాకుఁ బ్రీతి యెలర్ప నాతోడ నపుడు
పంత మాడినమాట పరమార్థ మొకొ
సంతసంబున రాక సాధించు నొక్కొ
తియ్యవిల్లును దానుఁ దెరువుతో డగుచుఁ
దొయ్యలి వలరాజుఁ దోడ్తెచ్చు నొక్కొ!

అప్పటి కెదు రాడ నలికి యారీతిఁ
దప్పించుకొని పోయి తరళాక్షి యిటకు
నొంటిమై రా కున్న నొగి లేవ నడచి
కుంటు చూపినయట్లు ఘోరంబుగాదె.
అది యెట్లు రా కుండు నాసఁ బుట్టించి?
ఎదిరిఁ దన్నును దాను నెఱుఁగ దే మొదల?
అరిమురి సంకేత మ ట్లేల చెప్పు?
వెరవున సతిఁ గూడి విహరింతుఁ గాక''
అని తనకోర్కెలుయ్యాల లూఁగఁగను
మనసిజునకు లొంగి మఱియుఁ గీచకుఁడు
మృగనేత్ర తనయొద్ద మెలఁగిన ట్లయిన
నగపడి సరసంబు లాడిన ట్లయిన
బయలుఁ గౌఁగిటఁ జేర్చి భావించి వగచు
జయశాలి మారుండు చాల నాడింప.
ఇన్నిలాగుల భ్రమ నెఱుక లేకున్న
యన్నఁ గీచకుతమ్ముఁ డప్పు డిట్లనియె:
''ఇది యేమి దస్సితి విది యేమి భ్రమసి
తిది యేమి యోయన్న యిచ్చోట నుంట?
పగతుఁ డే తెంచిన వగవ వెన్నఁడును,
తగులుమృత్యువుఁ గన్నఁ దలఁక వెన్నఁడును,

పిడుఁగు నైనను జెండ బెళుక వెన్నఁడును,
తడవక తగునయ్య ధైర్యంబు విడువ?
పొదపొద ప్రొద్దయ్యె భోజనంబునకుఁ
బదివేవు రున్నారు పంక్తిఁ గూర్చుండ’’
ననినఁ గీచకుఁడును నమ్మాట లెల్ల
వినక చేష్టలు దక్కి వెఱ్ఱి యై యున్న
నాసేవకులు వాని నచట భోజనము
చేసినవానిఁ గాఁ జేసి పోవుటయు
వెలుపలి కేతెంచి వెసఁ గీచకుండు
తలకొన్న చలిగాలిఁ దల కంటగింప
లేఁదీఁగజొంపంబు లీలతోఁ జేరి
పూఁదేనెజడికిఁ బుప్పొడికి భీతిల్లి
‘‘గ్రహదోష మనుమాట గలిగెనో కాక
కుహూకి సూర్యుఁడు గ్రుంక కున్నాఁడు వేగ.
పరశురాముఁడు వేఁడఁ బశ్చిమాంభోధి
పొరిఁ బొరి దూర మై పోయెనో కాక!
మెఱవడిఁ జనుదెంచి మేరుపర్వతము
చఱిఁ బడి రవి తేరు సాగ కున్నదియొ!
బిల్లఁ జిమ్మినమాడ్కిఁ బెకలించి సూర్యుఁ
బల్లంబుచోటికిఁ బాఱఁ జిమ్ముదును.’’

అని యిట్లు తమకించి యాసింహబలుఁడు
వనజలోచనరాక వడిఁ గోరు చున్న
"నీనీచుఁ జంపింతు నే నింకఁ గ్రుంకి
పీనిఁ జూచుట కాదు వెస" నన్నయట్లు
విపుల తేజం బెల్ల వేగంబ విడిచి
యపరాబ్ధిలోఁ గ్రుంకె నర్కబింబంబు.
పడమటిదిక్కనఁ బరఁగుభామినికి
నడరి కుంకుమగంధ మలఁదినమాడ్కి
ననురాగ మొనఁగ సంధ్యాకాల మయ్యె.
ఘన మైననక్షత్రగణ మంతఁ దోఁచె;
కలువలు వికసించె; కలఁగె జక్కవలు;
వలరాజు విల్లెత్తె; వసుధ నెల్లెడల
ననయంబు సోంపెక్కె; నాడె భూతములు.
మొనసి పయ్యెర వెట్టె; మోడ్చెఁ బద్మములు,
అంత బాలేందుఁడు నస్తమించుటయు
వింతగాఁ జీకట్లు విరిసె నెల్లెడల;
కన్నువిచ్చిన మాయఁ గలయఁ జూడ్కులకు
నున్నతి జనులకు నొక్కరూపయ్యె.
అప్పుడు పాంచాలి యనిలసంభవుని
నొప్పుగా డగ్గరి "యొరు లెఱుంగకయ

యిదివేళ కీచకు నే పణంచుటకు,
పదిలమై భుజశక్తి పాటింతు కాక;
వనములోఁ గీచకవ్రజముఁ దక్కించి
ఘనకీచకుల నెల్ల ఖండింతు కాక
నేఁటిరాతిరిలోన నెలమితో" నన్న
దాఁటుచు లేచి సంతస మంది యతఁడు
తలయుఁ జీరయు నాయితము చేసి బిగిచి
యలరఁ బెండ్లికిఁ బోవుసంత వేడుకను
నెలఁతఁ బేర్కొని పిల్చి "నీవు నావెంటఁ
దలకొని వచ్చి యుద్ధముఁ జూడు" మనుచు
వడి మహామత్స్యంబు వనధిలోఁ జొచ్చు
వడువునఁ దమములో వచ్చి యచ్చటను
గొనకొని సింగంబు గుహఁ జొచ్చుమాడ్కి
ననయంబు వేడ్క నాట్యపుశాలఁ జొచ్చి
మ్రుచ్చు చీఁకటియిల్లు మొగిఁ జొచ్చినట్టు
లిచ్చఁ బొంగుచు భీముఁ డింతితో నపుడు
కడపలు నడవలు కంబంబు లరుగు
లెడపక నెత్తంబు లిక్కువ లెఱిఁగి
యుత్తర ప్రియముతో నుండుమంచమున
నుత్తమభుజసారుఁ డొప్పార నుండె.

### కీచకుఁడు ద్రౌపదికై నాటక శాలకుం బోవుట.

అంతఁ గీచకముఖ్యుఁ డర్థిదీపింప
వింతగాఁ గైసేసి వేగిరంబునకు
సైరంధ్రి యింతకు సంకేతమునకుఁ
జేరుఁ బొమ్మనుబుద్ధి చీకాకుపడఁగ
మధుపానమత్తుఁడై మత్తేభలీల
నధిక మోహవిధిబారి కడ్డమైనట్లు
తా నొంటి వెడలె ముందర పట్టి యపుడు
కానంగ రానిచీఁకటికి భీతిలక ;
వెస నిట్లు వెడలి భూపతిమందిరమునఁ
బొసఁగ నాటకశాల బోటునఁ జొచ్చి
యాయున్న యుసకియు నాదైన్యవిధము
నాయంధకారంబు నాత్మఁ గైకొనక
మరలక తనసేయుమగతనంబునకు
దొరసినభుజశక్తి తోడుగా నపుడు
శాలకు నడుమగాఁ జని శయ్యమీఁదఁ
గేలు సాఁచినఁ జూచి కిమ్మీరవైరి
కోపాగ్ని నంగారకుఁడు పోలె మండి
హూపింప లయకాలరుద్రుఁడై కినిసి

"దాయ కిం కెక్కడఁ దప్పి పో వచ్చు?
చేయ నిచ్చెదఁ గొన్ని చేష్ట లిచ్చోట"
నని యూరకున్నచో నాసింహబలుఁడు
తన కేలు వాయునందనుమీఁదఁ జాఁచి
గారవించుచు మేను గరుపాఱు చుండ
భూరివిభ్రమలీల బుద్ధి చలింప
మదనభూతము సోఁకి మర్త్యంబు వదలి
కదియు వచ్చుచు మోహకలితుఁ డై పలికె:
"లీలతో నబల మేలిమివస్తువులను
వాలాయమున నీకు వలచి తెచ్చితిని.
తనరారు వేడ్కను దవిలి యాంగనలు
చనవున నాకు లంచములు పెట్టుదురు.
నీ వాకతెవు నన్ను నిజముగా నేఁడు
ఈవిధంబున మించి యేలఁ జాలితివి!
నన్నుఁ జూచినయట్టినలినాయతాక్షి
యెన్నఁడు నొరుఁ జూడ నెంచదు మదిని.
పురుషులలో నేను పురుషరత్నమను
తరుణులలో నీవు తగినరత్నమవు."
అని యిట్లు పలికెడునసదమాటలకు
ననిలసూనుఁడు వాని నధముగా నెన్ని

తనమాటలుగఁ గొన్ని ద్రౌపదీ దేవి
వినునట్లువానితోఁ వెర వొప్పఁ బలికె:
"అగుదు చక్కనివాఁడ వగునీకు నీవ
పొగడుకొంటివి నీకుఁ బోలుపారఁ దెలియు
నిన్నియు వన నేల యీరాత్రిలోన
నన్నుఁ బోలినయట్టినలినాక్షి గలదె?
అడిగినఁ బ్రాణంబు లైన నీ వలదె
యెడపక నాకు నీ వివి దెచ్చు టెంత?
ధీయుక్తి నన్నుఁ బొందియు నీవు మరలి
పోయి వే ఱొకనాతిఁ బొందఁ గల్గుదువె?
పొందిన నేను నేర్చున మేను గన్న
చంద మేటికి?" నని సన్నద్ధుఁ డగుచు
ఖండితవైరివిక్రముఁ డైనవాని
దండింప నొడిసి ముందలఁ బట్టి యీడ్చె.

కీచకుఁడును భీమసేనుఁడు నొండొరులతోడం
బెనఁగుట.

కడఁకతో వాఁడును గర్వాంధుఁ డగుచు
విడిపించికొని లేచి వేగంబ కదిసి
నవరించి రెండుహస్తములు రాఁ దిగిచి
పవనజు నవనిపైఁ బడ వైచి పట్టి

కడుపును దొడలు మోఁకాళ్లఁ బొడువ
వడి లేచి కోపించి వాయునందనుఁడు
గుదిగొనఁ బట్టి గ్రక్కున వానిఁ దివియ
నదయుఁడై వాఁడు నయ్యనిలజుఁ బట్టె.
ఒండొరు లీరీతి నుగ్రులై కణఁగి
దండిమైఁ దిగిచి యుద్ధంబు సేయుచును
దొండంబు లొండొంటితో రాయు చుండు
శుండాలములరీతి స్రుక్కక కినిసి
యొరులు తమ్మెఱిఁగిన నొచ్చంబు గాన
నిరువురు నేకాంత మిట్లు వాటించి
పదరెడిగుండియల్ పగులఁ బొడుచుచుఁ
జదియ వీపులు ముష్టిఁ జావ వ్రేయుచును
నజ్జపై నోఁదియు సర్వాంగములును
నజ్జగాఁ బొడిచియు నలి రేగి యపుడు
కరములు శిరములు గళము లాయములు
నురము బిరముల నొండొంటి నొప్పింప,
పదఘట్టనలను భూభాగంబు పగుల
నదలుపు పుట్టిన నాకాశ మగల
నున్నచో బకవైరి యుగ్రుఁడై యిట్లు
తిన్నని యెలుఁగుతోఁ దెలఁ గొప్పఁ బలికె:

''ఓరి పాపాత్మ నీయుదుటు గర్వంబుఁ
దీరెను నేటితోఁ దెలిసి పోరాడు.
సైరంధ్రితలఁ బట్టి సభలోన నీడ్చు
క్రూరాత్ముఁడవు నీవు కూలఁ జిక్కితివి.
ఇచ్చట నాచేత నిఱు వంటయిల్లు
చొచ్చినకుం దేటిచో ప్పయ్యె నీకు.''
అనవుడు వాఁడు నుగ్రాటోప మెసఁగ
ననిలజుతోడ ని ట్లనియె గర్వించి
''గంధర్వు లేయూరు, కదన మేయూరు,
సంధించి ననుఁ బట్టి చంపు టేయూరు?
మిమ్ము నేవురఁ జంపి మెలఁత సైరంధ్రి
నెమ్మిమైఁ గైకొందు నేర్పున'' ననుచుఁ
గుదియక వెసఁ గీచకుఁడు చేతికొలఁది
''మది నెఱుంగుదు గాక మాట లేమిటికి?''
ననుచు నిష్ఠురవృత్తి ననిలజుఁ బొడువ
ననిలజుండును వాని నఱచేత వ్రేసి
బెదరక చెదరక ప్రిదులక పట్టు
వదలక వానిసత్త్వము గుందు కెఱఁగి
పిడుఁగుతో సరి యైనపిడికిట వానిఁ
బొడిచె నాక్షణమ యద్భుతశక్తి మెఱసి.

కీచకుం డపుడు మిక్కిలి మూర్ఛపోయి
లేచి వాయుజు నేసె లీల నాక్షణమె.
వ్రేసినఁ దలఁ బట్టి విదలించి వానిఁ
బూసెజ్జఁ ద్రోచియుఁ బోక వాయుజుఁడు
కీచకునురము నుంకించి వ్రేయుటయు
నా చేతివ్రేటున నవశుఁ డై వాఁడు
విలవిలఁ గాళ్లను వెసఁ దన్నుకొనుచు
నలసి నెత్తురు గ్రక్కి యూవులించుచును
దెలు పైనకన్నులు తిరుగవేయుచును
బలిమి దెక్కొలుగాఁ బ్రాణము ల్విడిచె.
అప్పుడు బహుభూషితాంగుఁ గీచకుని
నొప్పుగాఁ బడ వైచి యున్నవాయుజుఁడు
పల్లవనవఫలభరితవృక్షంబుఁ
ద్రెళ్ల వైచినదంతి తెఱఁగయ్యెఁ జూడ.
అంతఁ గీచకుఁ జిత్ర మగుచావు చంప
నెంతయుఁ బ్రియ మైన నేచి వాయుజుఁడు
కరములుఁ బదములు ఘనమస్తకంబుఁ
గర మర్థితో వానికడుపులోఁ దూర్చి
ముష్టిఘట్టన లిచ్చి ముద్దగాఁ జేసె.
తుష్టుఁ డై యపుడు వాతూలనందనుఁడు

తనజయం బాత్మలోఁ దలపోయుచుండి
వనజనేత్రకు వానివధ నేర్పరింప
నచ్చటి కొకరీతి ననలంబుఁ దెచ్చి
యచ్చుగా ముట్టింప నపుడు పాంచాలి
కన్నారఁ గీచకాగ్రణిచావుఁ జూచి
సన్నపునగవుతో సంతసిల్లుచును
వెఱఁగుపాటున వానివికృతంబుఁ జూచి
తఱిమిడి నవ్వుచుఁ దరుణి యిట్లనియె:
"కూడునే కీచక కాఁడిచి కూర్చుండి
వేడుక నీపాటు వెసఁ దెచ్చికొంటి.
నీవృథాగర్వంబు నీపాపమతియు
నీవర్తనముఁ జేసె నేఁ డింతవట్టు?
అనద నైవె కోరితి వతనుసౌఖ్యంబు;
అనుభవించెదు గాక యతనుసౌఖ్యంబు!"
అను చున్నద్రౌపది ననిలసంభవుఁడు
కనుఁగొని తనపెంపు గాన రాఁ బలికె:
"మానినీమణి నీకు మానెనే వగపు
పీనుఁగు నైపీఁడు పృథివిఁ గూలుటయు?
హరిణాక్షి కోపంబు లణఁగెనే నీకు
దొరలి పాపాత్ము నుద్ధురతఁ గూల్చుటయు?

వనిత నీ కింక నెవ్వం డెగ్గు దలఁచు
నని మొనఁ దెగటార్తు నతని నిభ్భంగి.''
అనవుడుఁ బులకించి యతివ లజ్జించి
యనిలసంభవుఁ జూచి యను వొప్పఁ బలికెః
''ఏమానవుఁడు చేసె నిట్టిసాహసము?
ఏ మని వర్ణింతు నేను నీశక్తి?
అల వొప్ప ధర్మజుఁ డడ్డపెట్టుటయుఁ
గొలువులోపల నీవు కోపంబు మాని
యీనాట్యశాలలో నీమధ్యరాత్రి
వీనితో మార్కొని వెఱపింత లేక
తోడఁబుట్టువు లున్నఁ దో డాసపడక
చూడంగ మిక్కిలిశూరత మెఱసి
ప్రజలు గానక యుండఁ బవమానతనయ
నిజముగా భుజశక్తి నెగడంగఁ జేసి
తగు నింక దుర్యోధనాదులఁ జంపి
పగఁ దీర్ప నోపుదు బాహుగర్వమున''
అని యింతి కొనియాడ ననిలసంభవుఁడు
ఘనతరసంతోషకలితుఁ డై పలికె
''వచ్చినపని యయ్యె వనిత నీ వింక
నిచ్చోట వర్తింప నేమి కారణము?

మనమాట లాలించి మనుజు లెవ్వారు
చనుదెంతురో; ప్రొద్దు చాలఁ బోయినది
నిద్రకన్నెఱుఁగక నీవు నిందాఁక
విద్రుమాధరి యుంట వేడ్క నీ వేగు”
మని పల్కి పీడ్కొల్పి యావంటయిల్లు
ననురాగమునఁ జొచ్చి యనిలసంభవుఁడు
ఒడలికి గదురు పోనుజకంబు లాడి
కడుమంచివస్త్రము ల్గట్టి కైసేసి
హంసతూలికపాన్పునందు మోదమునఁ
గంసారి మది నెన్ని కనుదోయి మోడ్చె.
అనుటయు ముద మంది యటుమీఁదికథయు
వినవేడ్క నా కది వినిపింపు మనిన
సత్యహరిశ్చంద్ర సహజదేవేంద్ర
నిత్యనీరజనేత్ర నీతిమాంధాత్ర
అనఘాత్మ పంటవంశాంభోధిచంద్ర
జననుతప్రభురాజ సాహిత్యభోజ
ఆదిగర్భేశ్వరహరినామనిరత
భూదానగోదానభూరిప్రతాప
ఇది సదాశివభక్తహితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప

శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్ర
మతిమద్విధేయ తిమ్మననామధేయ
రచితవిరాటపర్వమున నాశ్వాస
ముచితార్థయుచితముగా నొప్పె రెండవది.

శ్రీభవ్యదోర్దండ చెరమిూరగండ
వైభవోపేంద్ర దేవయమ్ముధీర
వినుము వెండియు నిట్లు వివరింపఁ దొడఁగె
జనమేజయునకు వైశంపాయనుండు:
అంతటఁ బాంచాలి యంతరంగమున
నింతకు బకవైరి ‹‹వేఁగు పో›› మ్మనఁగ
వెలయు నాటకశాల వెడలి యచ్చోట
నిలిచి కావలివారి నిద్ర మేల్కొల్పి
తోడుకొని తెచ్చి సూతునిచావుఁ జూపి
యెడపక వారితో నిట్లని పలికె:
‹‹అన్నన్న! గంధర్వు లయిననామగలు
ఇన్నీచు వధియించి రక్షింపుఁ డిపుడు.
చక్క నుండక పుణ్యసతులఁ గామించు
మొక్కలీండ్రకుఁ జావు మొగి నిట్లె వచ్చు.››

అనవుడు వారు హాహారావ మెసఁగఁ
జని వానిచావుఁ గీచకులకుఁ దెల్ప
దివ్వెకోలలవారు తివిరి కీచకులు
రవ్వతోఁ బాటి నర్తకశాలఁ జొచ్చి
పరువిడి సూతుపైఁ బడి యేడ్చువారు
పరులకు లోఁగనివాని శౌర్యమును
నెలకొన్నచింత వర్ణించి వర్ణించి
పలవించువారు నై వగఁ జెంది తూల
వారిబాంధవు లంత వచ్చి కీచకునిఁ
జేరి వీక్షించి యచ్చెరు వంది యపుడు
"వినుమానములు గాక వినని ట్టిచావు
పొసఁగ ధాత్రి నెవారు పొడగన్నవారు!
ఎయ్యది పాదము లెయ్యది కరము
లెయ్యది మస్తకం బీకీచకునకు!
చెలఁగి గంధర్వులచేఁ జచ్చువారి
కలయంగ నిదియె మర్యాద కాఁబోలు!
తగునయ్య కీచక ధర్మంబు విడిచి
మగువకు నై పోయి మరణంబు నొంద?
అడవికిఁ గాసినయట్టివెన్నెలకు
నడరంగ సరి యయ్యె నయ్య నీలావు?

నినుఁ గూల్చినట్టిఁడు నెఱి నెట్టివాఁడొ!”
అని పెక్కుభంగుల నడలఁగాఁ జూచి
విపులదుఃఖముచేత వెఱఁ గంది యున్న
యుపకీచకుఁడు పల్కె నొకయింత తెలిసి
“మన మెంత యడలిన మనకీచకుండు
విన నేరఁ డిది యేల వెట్టిగొన్నారు!
ఆతని కిర వైనయట్టియీ తెఱఁగుఁ
జూతురు గా కింక శోకింప నేల?”

ఉపకీచకులు ద్రౌపదిం గట్టి దహింపం
గొనిపోవుట.

అనవుడు నందఱు నడలుట లుడిగి
పనిగొని యచ్చోటఁ బాంచాలిఁ జూచి
“ఇది కాదె కీచకు నింత సేయించె!
ఇదియు నీతనితోడ నేగుఁ గా” కనుచుఁ
బెనచి ద్రౌపదిఁ బట్టి పెడగేలు గట్టి
జననాథునకుఁ జెప్పఁ జని రట్టితెఱఁగు.
అటమున్నె విరటుండు నతనిచావునకుఁ
బటుతరశోకాగ్నిభరితుఁ డై యున్నఁ
జల మొప్పఁ జనుదెంచి సకలకీచకులు
అలుకఁ దెల్పిఁ దొలఁగి యాగ్రహం బెత్తి

"జగతీశ వినవయ్య సైరంధ్రి నేఁడు
మగలచేఁ జంపించె మనసింహబలుని.
వడిఁ గీచకునితోడ వామాక్షిఁ గాల్పఁ
గడఁగి నీయనుమతిఁ గాంచ వచ్చితిమి
పనివడి యటు చేయ వగ లాఁకు మాకు"
అనవుడు విరటుండు నపుడు కీచకులు
తనమాట విన రని తాను భావించి
యను వార ని ట్లనె నలవారితోడ
"మీకుఁ దోఁచినయట్లు మీరు వర్తింపుఁ
డాకులపడి నన్ను నడుగ నేమిటికి?
తలకొని మీయన్న తనపీఁఠ బోయె
వల దన మా నెడివారలే మీరు?"
అనుటయు ననుమతం బదియకాఁ దలఁచి
జననాథు వీడ్కొని చని దురాత్మకులు
"ఆలోకమున నైన నతనితోఁ గూడు
నాలోలనేత్రఁ దెం" డని పట్టి తెచ్చి
పనిగొని శవముతోఁ బాంచాలిఁ గట్టి
కొనిపోవుచును బంధుకోట్లును దారుఁ
బెరిఁగెడిశోకాగ్నిఁ బితృవనంబునకుఁ
గరదీపికలు పట్టి కదలి రందఱును.

అప్పుడు పాంచాలి యంతరంగమునఁ
దొప్పదోఁగినమోముతో నెలుఁ గెత్తి
యసురులచేఁ జిక్కి యమరేంద్రలక్ష్మి
మసలక వాపోవుమాడ్కి నిట్లనియె:
"కలితవిక్రములార, గంధర్వులార,
దళితశాత్రవులార, ధైర్యాత్ములార,
నిర్మలమతులార, నియతాత్ములార,
ధర్మసమ్మతులార, దయ సేయరయ్య.
చపలు రైతమయన్నశవముతోఁ గూడ
నుపకీచకులు నన్ను నుఱక బంధించి
కొనిపోవు చున్నారు కుటిలవర్తనులు.
ననుఁ గావరయ్య బన్నము లెల్ల మాన్పి
ఓ జయునిజనామ యోజయంతాఖ్య
ఓ జైత్రవిజయుండ యోజయత్సేన
ఓ జయద్బల నీకు నుచితమే యిట్లు
తేజంబు సూపక తెం పేదినట్లు
కాలయాపన సేయఁగా నౌనె యకట!.
ఏల యూరక యుండ నిట్టికార్యమున ?"
ననుటయు నమ్మాట లాలించి పవన
తనయుండు మేల్కాంచి తలఁపులో నంత

“నరయంగ వెండియుఁ బ్రాణవల్లభకుఁ
బరులచే నీపాటు పాటిల్లె” ననుచు
భయరక్షణంబు గోప్యంబుగాఁ జేయ
రయమున నాప్రకారపుగోడ దాఁటి
పొలుపు మీఱినరుద్రభూమిలో నిలిచె
వెలసిన యొకమహావృక్షంబుఁ బెఱికి
మనుజాశనుల నెల్ల మర్దించునపుడు
ఘనదైత్యహరుఁ డుగ్రగతి నొప్పునట్లు
కుటిలకోపాటోపఘూర్ణితాలోక
చటులపాటవభుజాసంరంభుఁ డగుచు.

భీమసేనుఁ డుపకీచకులం జెండాడి
ద్రౌపదిని విడిపించుట.

అంతఁ గీచకవైరి నల్లంతఁ గాంచి
యెంతయు భయముతో నెల్లకీచకులు
“అక్కటా గంధర్వు లదె వచ్చి రింక
నెక్కడఁ జొత్తు మిఁ కెట్లొకో” యనుచుఁ
గువలయనేత్రతోఁ గూడఁ గీచకుని
శవము ధారుణి వైచి చాల భీతిల్లి
పదపదుం డని పాఱి పాఱ లేక చట
నొదిఁగియు వృక్షంబు లొప్పఁ బ్రాఁకియును

దెరువు గానకయును దిరుగఁ జాఱియును
వెర వొంది పఱచిన భీముండు దఱిమి
కడఁదిబెబ్బులి లేఁడిగమిమీఁదఁ గవియు
వడువున నెంతయు వారిపై నేచి
చల మొప్ప డాసియుఁ జదియ వ్రేసియును
దల లూడఁ దన్నియు ధరణిఁ బ్రామియును
ఒడిచియుఁ బొడిచియు నుక్కణంచియును
బొడిచియు నడిచియుఁ బోనీక పేర్చి
వరబాహుదర్పప్రభావంబు వఱల
వెర వొప్ప నెంతయు వెస నూటయేవు
రుపకీచకులఁ బట్టి యుఱక చెండాడి
విపులాంసముల శౌర్యవిభ్రమం బొప్పఁ
గమలాక్షిఁ గట్టినకట్లెల్ల నూడ్చి
క్రమ మొప్ప నూరార్చి కన్నీరు దుడిచి
"దేవి యింటికిఁ బొమ్ము తెఱఁ గొప్ప" ననుచుఁ
బావని ఖిన్నుఁడై పాంచాలి ననిచి
యుగవున వెడలి వేఱొకమార్గమునను
బరువడిఁ జనుదెంచెఁ బచనశాలకును.
ధరణీశుఁ డంత గంధర్వులచేతఁ
బరు వేది కీచకుల్ పడిరి నా వినియుఁ

గేకయపుత్రి శోకించు తావునకుఁ
బ్రాకటంబుగఁ బోయి భయభక్తిఁ బలికె
"ఏ పార సైరంధ్రి నిట నుండ నీక
పాపుద మీఁకఁ జాలుఁ బదివేలు వచ్చె!
ప్రొద్దున లేచి వే పో మ్మని మిగుల
బుద్ధిగాఁ జెప్పి నేర్పునఁ బుచ్చు మబల.
మగవారు దానితో మాటాడ వెఱతు
రొగిఁ బట్టి చంపించు నొకముహూర్తమున!
ఈయింతికై చావ నెంద ఱున్నారొ
తోయజానన పాముతో డిపొత్తయ్యె!"
అనవుడు విరటుతో నబల యిట్లనియె
"మనుజేంద్ర కలసె నీమనసు నామనసు.
ఏనును సైరంధ్రి నీవేళ ననుపఁ
బూని యుండితి నీవుఁ బొసఁగఁ జెప్పితివి.
వెనుకొని యిఁక నింతి వెడలంగఁ ద్రోచి
జననాథ మఱి నీళ్లు చల్లి మ్రొక్కెదను."
అని చెప్పినంతలో నంధకారంబు
కనుకని విరిసి భాస్కరుఁడు దోఁచుటయుఁ
గట్టినముసుఁగుతోఁ గ్రమ మొప్ప వచ్చి
నెట్టన నొకయేటినీటిలో మునిఁగి

నగవున విలసిల్లునలు వొప్పుమోము
జగతిఁ బున్నమనాఁటిచంద్రునిం జెనక
సైరంధ్రి వీధిలోఁ జనుదెంచునపుడు
పౌరులు తనుఁ జూచి భయము రెట్టింప
“సంగనవలె నుండి యఖిలకీచకుల
మ్రింగినభూతంబు మెఱసి పోయెడిని!
అరుగుఁ డడ్డము రాకుఁ డటు పోకుఁ డేగి
తెరు విండు తొలఁగుఁడు తిరిగి చూడకుఁడు.
చూచినఁ దెగఁ జూచుఁ జూ చంద్రవదన
చూచిన సతిపోలె శోభిల్లుఁ గాని!”
అనుచుఁ జేతులు ఱొమ్ము లప్పళించుచును
జను లొకభ్రమోఁతగా జంకక పలుక
నెంతయు సంతోష మెసఁగఁ బాంచాలి
యంత నొయ్యన వచ్చి యట వంటయింటి
వాకిట నిలుచున్నవాయుసంభవునిఁ
బ్రాకటగతి చాయఁ బాఱఁ జూచుచును
దలకొన్నవేడ్కతోఁ దనలోన తాను
పలుకుచుఁ జనుకీతిఁ బలికె నచ్చోట
“నయ మించుకయు లేక నాకుఁ గీచకులు
భయముఁ బుట్టింపఁ దప్పక ప్రోచినట్టి

ఘనదయాపరునకు గంధర్వునకును
అనయంబుఁ బ్రణమిల్లి యర్థి మోదింతు॥.
అనిన భీముఁడు గూఢ మైనవాక్యముల
వనజలోచనఁ జూచి వల నొప్పఁ బలికె
“చపలనేత్రకు నొక్క సంకటం బైన
నపుడు తాఁ గతి వేచి యచట సంధించి
మగఁటిమిఁ జూపనిమగఁ డేటిమగఁడు?
జగతి వానికి నేల సత్కీర్తి గలుగు?॥
అనుటయు వినుచు నాట్యాలయమునకుఁ
జని యర్జునునిఁ జూచి సతి సంభ్రమించె.
నృత్తంబు సాలించి నెమ్మిఁ గన్నియలు
మొత్తమై చనుదెంచి ముదిత కిట్లనిరి:
“చపలాక్షి కీచకుఁ జంపించితమ్మ!
ఉపకీచకులఁ బట్టి యొప్పించితమ్మ!
వారిచేఁ బడియు నొవ్వక వచ్చితమ్మ!
వైరిదర్పఘ్ను లౌ బలులు నీమగలు!
అమ్మ నీ కెవ్వరు నపకార మింక
నెమ్మిఁ జేయఁగ లేరు నిఖిలలోకముల॥

### అర్జునునితో ద్రౌపది సల్లాపంబు చేయుట.

అని తారు మును విన్నయట్టికార్యములు
ననురూప మగురీతి నడుగుచోఁ గదిసి
పలికె నింద్రునిపట్టి పాంచాలిఁ జూచి
"జలజాక్షి నిన్నుఁ గీచకుఁ డేమి చేసె?
మఱి కీచకుల నెల్ల మర్దించు తెఱఁగు
నెఱయఁగా నెఱిఁగింపు నీమాట గాఁగ"
అనవుడు నామాట కరనవ్వు నవ్వి
వనజాక్షి తననేర్పు వల నొప్పఁ బలికె:
"నీ కేమి నీవు కన్నియల కేప్రొద్దుఁ
జేకొని నాట్యంబుఁ జెప్పు చుండుదువు.
కడుకొని యెవ్వ రెక్కడఁ బోయి రేమి
తడవకు మాపాటు తలఁప నీ కేమి?"
అనిన వాసవపుత్రుఁ డబల కి ట్లనియె
"నినుఁ జూచి శోకింప నేర్తు నెంతయును
జెలియ నీతోఁ బొత్తు చేసితిఁ గాన.
తలఁప నీ కొక కైనఁ దడవ కుండుదు నె?
ఓచంద్రవదన నే నున్న భావంబుఁ
జూచి యిం కెవ్వరు శోకించువారు?"

అని యర్జునుఁడు పేడి యై యున్నతనకు
ఘనవైరిశిక్ష యోగ్యము గామిఁ దెలుప
విని సవ్యసాచికి వెలఁది యి ట్లనియె:
‘‘నిను దూఱ వచ్చునే నీవు మాన్యుఁడవు
పృథివి నీరూపంబు బీభత్స మైనఁ
బృథివీశునకుఁ జాలఁ బ్రియ మయ్యె నేఁడు.
నరుఁడవు కావున నాదుఃఖనమితి
పొరసిన నొకవేళఁ బొరసెఁ గా కేమి!’’
అని చెప్పి వెనువెంట నచటికన్నియలు
చనుదేరఁగా దేవిసదనంబుఁ జొచ్చి
కడఁగినతనయుబ్బు గాన రా నీక
పొడమినచిఱునవ్వు పొడమంగ నీక
వెడలఁ జూచినమాట వెడలంగ నీక
యడరక తొడరక యపుడు పాంచాలి
యులరినసంతోష మనుగుజ్జమునకు
నలధైర్యమే కల్లియంబుగాఁ బట్టి
దేవిముందఱ వచ్చి తెఱఁ గొప్ప నిలువ
దేవియు భయశోకదీనభావమున
మదుఁగులు దెప్పించి మణులు దెప్పించి
తొడవులు దెప్పించి ద్రుపదనందనకుఁ

బచ్చుకప్పురమును బాగాలు మొదల
నిచ్చి యున్నియు నిచ్చి యిట్లని పలికె:

సుదేష్ణ ద్రౌపదిం దనయొద్ద నుండ
వల దని పొమ్మనుట.

“చక్కనిదానవు; సాధ్వి నీమగలు
చక్కి నుండరు; నీకుఁ జాటి చెప్పెదను,
మగవారు నినుఁ జూచి మదనమోహమునఁ
దగులుటయును వారిఁ దారు చంపుదురు!
నీమోముఁ జూచిన నెలఁత మాకైనఁ
గామచేష్టలు దోఁచు; కడసారిమాట
వలవ కుండఁగ రాదు వలచినఁ జేటు!
మెలఁత నీతో నెట్లు మెలఁగువారలము?
కావున మాతోడఁ గాదు నీ వుండ
వేవేగ వెడలుము విభుఁడుఁ బొమ్మనియె”
అనుటయుఁ బాంచాలి యద్దేవిమోముఁ
గనుఁగొని వినయంబు గాన రాఁ బలికె:
“పదఁతుక యిఁక మీఁదఁ బదుమూడుదినము
లెడపక వర్తింప నిమ్ము న న్నిచట.
అంత నామగలు ప్రత్యక్షమై మీకుఁ
జింతించుపను లెల్లఁ జేయ నోపుదురు;

ఉపకారపరులు, మహోగ్రసాహసులు,
నృపునిచిత్తముఁ బట్టి నేర్తు రెంతయును
పౌరపుగాఁ దలపకు గొలఁతి నామాట
పురుషార్థమును వచ్చుఁ బుణ్యంబు వచ్చు"
అనుటయు నమ్మాట నాత్మలో నిలిపి
జననాథు దేవి పాంచాలి కిట్లనియె:
"ఉవిద నీమాటకు నొండాడ వెఱతు
నవుగాము లెఱుఁగ నీయాజ్ఞఁ జేసెదను.
భూవిభుఁ డున్నాఁడు పుత్రుఁ డున్నాఁడు
మావార లున్నారు మన్నింపు మమ్మ.
తివుటమై నీవు చింతించుకార్యంబు
లివి యవి యని నాకు నెఱిగింపు మమ్మ."
అనుచుఁ బ్రార్థించిన నద్దేవియింట
వనిత తొల్లిటియట్ల వర్తించుచుండె.
జను లొండొరులు భూమిచక్రంబునందుఁ
బనిగొని తమలోన భాషించి రిట్లు:
"విరటునిమఱఁది యై వెలయుకీచకునిఁ
బరిమార్చి రఁట యెంత బలియు రున్నారొ!
వానిసాహసమును వానిదోర్బలము
వానిగర్వం బైన వర్ణింప నగుదు.

అట్టివాఁడును ఘోర మగుచావు చచ్చె
నెట్టన గంధర్వకరంబుచేత;
ఉపకీచకులుఁ జచ్చి రొకయింతికొఱకు!
అపజయం బిట వాఁడె నామత్స్యపతికి!
నెఱజోదు లట నేఁడు నిష్కారణంబు
పఱియ లై మడిసిరి పగవారిచేత!''
అని యిట్లు సూతులు హతు లైనవార్త
లనయంబు వర్తిల్లె నవనియంతటను.
అంత నక్కడఁ గౌరవక్షితీశ్వరుండు
కౌంతేయులప్రతిజ్ఞ కలుషంబు సేయ
వారి నయ్యజ్ఞాతవాసకాలమున
ధారుణి వెదకింపఁ దాను పుచ్చుటయుఁ
జతురు లై పోయినచారవర్గంబు
క్షితల మంతయుఁ జూచి గోరాడి వెదకి
రూపింపఁ బాండుపుత్రులు చన్నసన్న
లేపార నెచ్చోట నెఱుఁగంగ లేక
తిరుగుట చాలించి తిరిగి యేతెంచి
పౌరిఁ బౌరి సంకేతభూమిపైఁ గూడి
''ఇత్తెఱం గధిపుతో నెఱిఁగింత'' మనుచు
మొత్తమై గజపురంబున కరుదెంచి

*దుర్యోధనునిచేఁ బంపఁబడిన చారులు పాండవులఁ గానక తిరిగి వచ్చుట.

నుతి కెక్కు దుర్యోధనునికొల్వు కడకు
నతివేగమునఁ బోవ నరిగియు నొప్పార
వినుతసర్వంసహావిభుసీమ వోలె
ననుకూలభీష్మకృపాఢ్య మగుచు,
నిరుపమప్రహ్లాదనిజమూర్తి వోలె
గురుకర్ణవిరసవాగ్భాషణం బగుచు,
దుష్టభూపాలబంధురపంక్తి వోలె
దిష్టదుశ్శాసనధృతరాష్ట్ర మగుచు,
పరిణద్ధసురరాజభవనంబు వోలె
వరసిద్ధగంధర్వవసుముఖ్య మగుచు.
శకసాళ్వకోసలసౌవీరమగధ
కుకురుకుంతలపాండ్యఘూర్జరేశులకు
ఘనత నాతనిసమ్ముఖమునఁ జేరునపుడు
తనరినపసిఁడిబద్దలవారి నలి
నలవు మీఱినయట్టి కొల్వుస్థానసీమఁ
జెలు వైనబహురత్నసింహాసనమునఁ
దిర మైనకొండవ దేవేంద్రుఁ డనఁగఁ
గర మర్థిఁ గూర్చున్న కౌరవేశ్వరుని

దరిసించి సంప్రీతి దండప్రణామ
కరకరచరణు లై కరములు మొగిచి
చారు లెంతయు నిర్విచారు లై పలికి
రాయూథవినయంబు లైనవాక్యముల
"అవధారు దేవ నీ పనిపిన ట్లెము
జవమునఁ దిరిగి భూచక్రంబునందుఁ
బదిల మై డాఁగినపాండునందనుల
వెదకునప్పుడు కొండ వేసట లేక
తొలితొలి వాగుల దుర్గభూములకుఁ
జల మొప్పఁ జని పర్ణశాలల వెదకి
ప్రతిమహీధరమును బ్రతిపాదపంబుఁ
బ్రతిలతాకుంజంబుఁ బ్రతిగృహాంగణము
వెదకి పల్లెంబులు వెదకి దీర్ఘికల
వెదకి నిర్ఝరముల వెదకియుఁ బోక
వరమును లనక యావ్వాల బోయ లనక
తెరువరు లనక శోధించి శోధించి
యొకచోట నరదంబు లొగి నేగుచొప్పు
ప్రకటించుచోఁ గూడఁ బాఱుచో నవియు
రధికశూన్యము లైన రాజేంద్ర మేము
వృధ యైనవేట్క్యాతో వెసఁ గూడఁ బోక

యంత నంతను బోవ నవియు ద్వారకకు
నెంతయు వెస నేగె; నేమును బోయి
వీధుల నుద్యానవీధుల సౌధ
వీధుల వీక్షించి వెసఁ గాన లేక
తడయక మఱి భూమితలముపై వెడలి
యుడుగక కూఱట లేక యొాలి నంతరము
బయలును వనముగా భావించి యరసి
రయముతో గొందియు రచ్చగా వెదకి
చెలమయు గుంటయుఁ జింతించి యరసి
వెలుఁగును దమముగా వివరించి నెమకి
యేయుపేక్షయు లేక యెఱుకపల్లెయును
బాయక పురముగా భావించి తిరిగి
పాండవు లనువార్తఁ బరికింప లేక
యొండొండ యే మంత నొక్కచోటఁ గూడి
దేవ నీ కెఱిఁగింపఁ దివిరి వచ్చితిమి.
భావింప ధర లేరు పాండునందనులు.

కీచకుఁడు గంధర్వులచేఁ జచ్చె నని చారులు
దుర్యోధను కెఱిఁగించుట.

మఱి యొక్క చిత్రంబు మత్స్యభూపాలు
మఱఁది కీచకుఁ డొకమగువకై బట్ట

నడురేయి గంధర్వనాథు లేకతమ
కడఁగి కైదువు లేక ఖండించి వైచి
కరములుఁ బదములు ఘనమస్తకమును
గర మర్థితో వానికడుపులోఁ దూర్చి
విపరీతగతి మత్స్యవిభుఁడు శోకింప
నుపకీచకులఁ జంపి రొకనిఁ బోనీక.
ఆనృపాలుఁడు మీకు సహితుండు గాన
వాని నెఱిఁగి చెప్ప వలసి చెప్పితిమి.
 వెదకెద మింకఁ బాండవులఁ
గౌరవేశ్వర మమ్ముఁ గరుణించి యనుపు''
మనవుడు నౌఁ గాక యని సుయోధనుఁడు
పనిగొన వారి నప్పటికిఁ బోననిపి
తడవుగాఁ జింతించి తనమంత్రివరులఁ
దడయక వీక్షించి తగ వేడి పలికె:
''ఎలమిఁ బాండవులకు నియ్యేటితోడఁ
దలకొన్నసమయంబు తగ నిండఁ గలదు;
నిండకమున్నె మున్నిటియట్ల వారి
నుండఁ జేయుట కార్య ముగ్రాటవులను.
కాకున్న రాజ్యభాగంబుఁ దె మ్మనుచుఁ
జేకొని జగడంబు సేయు చుండుదురు.

ఏగూఢమున వారి నీక్షింప వచ్చు
నారీతి నెమకింపుఁ డా త్మఁ జింతించి"
అనుటయు రాధేయుఁ డవనీశుతోడ
విన నిచ్చ యగుమాట వేడ్క ని ట్లనియె:
"చారులు వివిధసంచారు లై వెదకి
పేరు గల్గినయట్టిపృథివీశులొద్ద
వికృతవేషముఁ దాల్చి విహరింతు రేని
నొకనాఁట నరనాట నుదయించు వా ర్త."
అనినకర్ణునిమాట లా త్మఁ గైకొనక
కనుఁగవ గర్వంబు గాలు ద్రవ్వంగ
దుర్యోధనునిఁ జూచి దుశ్శాసనుండు
కార్యంబు తెలఁ గింత గాన కి ట్లనియె:
"ఆపాండుతనయుల నరయఁ బో నేల?
దూపిలుదుష్టజంతువులచేఁ జిక్కి
వారు చచ్చినయట్టివనభూములందుఁ
బూరియు నీఁకలు పొడము నింతకును.
ఏకశాసనముగా నెల్లరాజ్యంబుఁ
జేకొని పాలింపు చింతింప నేల?"

### పాండవులు బ్రదికియే యుందు రని ద్రోణాదులు సభం బలుకుట.

అనవుడుఁ బలికె ద్రోణాచార్యుఁ డపుడు
"మనుజేంద్ర యువరాజుమాటఁ గైకొనకు.
వా రేల చత్తురు? వా ఘనాచార
దూరులు భయలోభగూరు లెంతయును.
దైవంబుబలము నుత్తమబాహుబలము
నావీరులకుఁ గాని యమర వెవ్వారికి.
ఒప్పఁ జంపునె వారి మృగజంతువులు?
నిప్పున కేఁగలు నేర్చునే ముసర?
ఆమాట లేటికి నాపాండుసుతుల
భూమిపై వెదకింపఁ బుత్తు కా దనక"
అనిన భీష్ముండు ద్రోణాచార్యుమాట
విని సంతసించి యవ్విభుఁ జూచి పలికె:
"కలశసంజాతుఁ డొక్కఁడ నిక్క మాడె;
కలవారిలో నెల్లఁ గార్యజ్ఞుఁ డితఁడు.
దైవబలాఢ్యు లెంతయుఁ బాండుసుతులు
కావున వెదకియుఁ గానంగ లేను.
మీ రని వా రని మేము భేదింప
నేరము విను రెండునేత్రంబు లట్లు.

అవనీశ నీవు మ న్నడిగితి కాన
వివరింతుఁ గార్యంబుఁ వెసఁ దోఁచినంత.
తెలియుము వా రుండు దేశంబునందుఁ
దలపోయఁ దఱుఁగనిధాన్యంబు గలుగు,
కాలవర్షంబులు గలిగి ధారుణిని
జాల సుభిక్ష మై జనము వర్ధిల్లు,
గురుమంత్రపితృదేవగోబ్రాహ్మణులకుఁ
జిరకాలమును భక్తి సేయు చుండుదురు.
అది గాక గోవు లియ్యాకాల మనక
పిదుకు నూరక యైనఁ బెరుగు నర్థములు.
అట్టిదేశంబు లెయ్యవి మీరు వారి
నట్టిచో వెదకింపుఁ డపుడు తోఁచెదరు"
అనినఁ గృపాచార్యుఁ డప్పు డూహ చేసి
"మనుజేంద్ర మీ రేల మసలు చున్నారు?
వనమున: బండ్రెండువత్సరంబులును
జన గోప్యముగ నొక్కసంవత్సరమును
నియతితో నిండించి నేఁ డెల్లి వారు
రయ మొప్పఁ గోపించి రా నున్నవారు.
ఈలోపల నె వారి నీక్షించు తెఱఁగు
వాలాయమునఁ జేయ వలయు నెంతయును.

అది గాక మనబలం బాయత్తపఱిచి
పదిల మై యుండుట భావ్యంబు చూడ.
సైన్యంబు రక్షింపు సఖుల రక్షింపు
మాన్యుల రక్షింపు మనుజేంద్ర నీవు.
వడి వారు సమయంబు బాసమై నెరపి
కడఁగి కయ్యమునకుఁ గాలు ద్రవ్వుచును
రా నేమి చేసెదు రహి యుద్ధమునకుఁ
బూనంగ వలె శాంతి పొసఁగ కుండినను.
పాండవు లన నేల, పగవారు మఱియు
నొం డొక రైన నుద్యోగంబు వలదె?''
అని యిట్లు తమబుద్ధు లర్థి నిద్దఱును
వినిపించుటయును భూవిభుఁడు చింతించి
కార్యంబు తుదఁ గాంచి కర్ణాధిరథిక
వర్యుల వీక్షించి నల నొప్పఁ బలికె:

పాండవులు మత్స్యదేశంబున నున్నా రని
దుర్యోధనుఁడు నిర్ణయించుట.

''బలుఁడు భీముఁడు సింహబలుఁడు శల్యుండు
నిలలోన సమబలు లిట్టిసాహసులు
వీరిలోపల వీరె వీరిచావులకుఁ
గారణంబులు గాని కా రన్యజనులు.

కీచకుచావుఁ దాఁ గిమ్మీరవైరి
మోచినపసిగాని మోసంబు గాదు.
ఆయింతి ద్రౌపది యతఁడు వాయుజుఁడు
వేయు నేటికి మీకు విశదంబు గాదె?
గంధర్వు లనుపేరఁ గనలి కీచకుని
బాంధవసహితంబు పరిమార్చె నతఁడు.
ఈభీష్ముఁ డాడినయిన్నిచిన్నెలును
శోభిల్లు విరటుండు సుఖ ముండుపురిని.
కావునఁ బ్రచ్ఛన్నగతిఁ బాండుపుత్రు
లావిరటుని బ్రోల నర్థి నున్నారు.
విరటుండు మనకును విద్వేషి గానఁ
దరమిడి యతనిపై దాఁడి పో వచ్చుఁ
బోయి గోగణములఁ బొదివి పట్టుటయు
నా యొడ యమసూనుఁ డడ్డమై వచ్చు.
వచ్చిన నజ్ఞాతవాసభంగంబు
చెచ్చెర నెఱిఁగించి శీఘ్రుంబె వారి
నడవికిఁ దోల్లిటియట్లు పోననిపి
పుడమిఁ జేకొంన మప్పుడ; యటు గాక
కౌంతేయు లరయ నక్కడ లేక యున్నఁ
జింతింప విరటునిసిరి యబ్బు మనకు.

ఇది కార్య మని మీర లిచ్చ వాటించి
కదలుఁడు మేలు కాఁ గలదు మీఁదటను.''
అనవుడు విని త్రిగర్తాధీశుఁ డైన
ఘనుఁడు సుశర్మ దిగ్గన లేచి మ్రొక్కి
యువరాజకర్ణులు నొగి సమ్మతింప
నవనీశుతోడ ని ట్లనియెఁ గేల్మోగిచి
''దేవ మున్నొకపరిఁ దివిరి కీచకుఁడు
నానంకఁ బగ మోఁచి నన్ను భర్జించె;
నే శప్పి వాయుజుచేఁ జచ్చె వాఁడు!
అతనితో నాకు నని లేక పోయె!
నాటికోపము మత్స్యనాథుపై నేన
నాటింప నోపుదు ననుఁ బంప వయ్య.
ఒనర నాజీతఘటూాళ్లలో నతఁడు
తనకుఁ గానుక లెత్తుఁ దగ దన్న వినక.
పసువు గోవులఁ బట్టి పాండునందనులఁ
గని వత్తు విరటుభాగ్యము చూఱఁ జెత్తు.''
అనవుడు భూపాలుఁ డనుజు వీక్షించి
ఘను ద్రోణు నీక్షించి కర్ణునిం గాంచి
''సభవారు మీఱు సుశర్మవాక్యముల
రభసంబు వింటి రూరకె యుండ వలదు.

ఇది కార్య మా[illegible] చెప్పుఁ డిది నాకుఁ జూడఁ
గొ౦ద లేదు విర[illegible]న నోపు నితఁడు.
చతురంగసన్నా[illegible]హితుఁ డై యితఁడు
జతన మై ముం[illegible] సాఁగుట యొప్పు''
ననిన భూపతి [illegible]లం దండఁ బొగడి
యనుమతించి[illegible]లా కార్యమునకు.
తమి ధార్తరా[illegible]లు ధర్మజాదులను
నెమక నెన్ని[illegible] నెఱి వార లప్పు
డో రు లెఱుం[illegible] లుండున య్యేడు
నరుడుగా నిం[illegible]రయ లే రైరి!

సుశర్మ [illegible] గ్రహణంబునకు
వెడలుట.

ఆసుశర్మయు [illegible]శర్మాధీశుఁ డనుపఁ
జేసేత యుద్ధంబు సేయు వేడుకను
సుభటులు [illegible] జోడుపక్కెరల
విభవంబుగాఁ [illegible] వెనువెంట రాఁగఁ
బటహకాహళ[illegible] ఘోషమునను
దిట వేది ధా[illegible] కొనగంగ వెడలె.
వెడలినపయనా[illegible] కెచ్చోట
విడిసినఁ గొ౦ద [illegible] వేగంబ కదలి

పయనంబు నిడి వైనఁ బ్రజ నొవ్వ నీక
నయమునఁ జని మత్స్యనగరంబుఁ జేరి
వేగులవారిచే విరటభూపాలు
గోగణంబులు నున్నగుఱుతు మున్నెఱిఁగి
కోలాహలము చేసి కూడంగఁ బాఱి
యాలమూకలమీఁద నాక్రమించుటయు,
గోపాలకులు లేచి కోపంబు లడరఁ
జాపముద్గరకుంతశరపాణు లగుచుఁ
గాచుచు బలపరాక్రమములు సూపఁ
జూచి సుశర్మ నిష్ఠురబాణతతుల
నేసి నొప్పించె; ననేకరాహుతులు
చేసూపుతమనాథుసెలవుఁ గైకొనుచు
నీసుమై వారల నేసి యార్వఁగను
గాసిల్లి గోపవర్గము నిల్వ లేక
నెత్తురు వఱదగా నేల గ్రక్కదలఁ
దుత్తుము రై పాఱి దుఃఖంబుతోడ
విరటభూపతిఁ గాంచి వినతు లై భీతిఁ
గరపద్మములు మోడ్చి కడఁక నిట్లనిరి:
«దేవ త్రిగర్తుఁ డేతెంచి యుద్ధమున
గోవులఁ బట్టి యాక్రోశంబు నెరపి

గజవాజిరథయోధగణములతోడఁ
నజితు లౌనమ్ము నాహవభూమి గెలిచి
పోవు చున్నాఁడు భుజశక్తి మెఱసి.
దేవర యింక నీదివ్యచిత్తంబు"
అనుటయు మీసంబు లదరఁ గోపించి
కను లెఱ్ఱవాఱ మై కంపంబు నొంద
"ఎట్టెట్టురా త్రిగర్తేశుండు పసులఁ
బట్ట నెట్లోపరా భయ మింత లేక!
పట్టిన విధియాజ్ఞ పట్టెఁ గా కేమి
పట్టి చంపఁగ నాకుఁ బట్టయ్యె నిపుడు.
ఓమంత్రులార మీ రుగ్రవేగమున
నేమించి రథయోధనికరంబుఁ గూర్చి
పయనంబు సేయుఁడు భయదాట్టహాస
భయదభేరీభూరిభాంకృతు లెసఁగ;
పోటుమానిసు లెల్లఁ బురి నుండ కుండఁ
జాటించి పిలువుఁడు సంగ్రామమునకు.
భూరిశస్త్రాస్త్రశ్రీఁ బోలు పాయనట్టి
తేరాయితము చేసి తెండు నేర్పునను"
అని చెప్పి విభుఁడు తా నఖిలసత్త్వమునఁ
గనకనిర్మితవజ్రకవచంబుఁ బూని

కాంచనధ్వజములు గలిగి కైదువుల
నంచితశృంగార మగురథం బెక్కి
దారుణబృంహితధ్వానుల నంబుధులు
బోరునఁ గలఁగ నార్పులు మిన్ను ముట్ట
గోవు లేగినచోటు గోపాలసమితి
భావింప సేనతోఁ బదిల మై కదలె.
అంత నాతనితమ్ముఁ డగుశతానీకుఁ
డంతకోపముఁ బూచు నతికోపమునను
బలు ఘోటకవ్రాతభటమహోత్కటము
లటు నిటు గ్రమ్మ బ్రహ్మాండంబు పగుల
సన్నుతరథ మెక్కి శస్త్రాస్త్రనికర
సన్నద్ధుఁ డై యుద్ధజయకాంక్ష వెడలె.
అతిఘోరగజయూథ మర్థితోఁ గొలువ
నతనితమ్ముఁడు మదిరాస్యుండు వెడలె.
ఆతనియనుజన్ముఁ డగుసూర్యదత్తుఁ
డాతతసైన్యదివ్యాస్త్రుఁ డై వెడలె.
వరుసతో నంత భూవరుపెద్దకొడుకు
చరితాత్తతేజుండు శంఖునామకుఁడు
హారిరత్నఘనహీరహారమంజీర
కరకంకణాంగదకరయుక్తుఁ డగుచు

లావణ్య మెసఁగఁ దెల్లనిజోడు దొడిగి
వేవిధంబులమత్స్యవీరులు గొలువఁ
బదిగుఱ్ఱముల నొప్పఁపసిఁడితే రెక్కి
కదలెఁ గోపముతోడఁ గదనంబుఁ గోరి.
ఎలమితో మఱియు ననేకబాంధవులు
గొలువ భూపాలుండు గొంతద వ్వేగి
సెలకొని సేన లన్నియు వచ్చుదనుక
నెలవుగా నొకచోట నిలిచి యుండుటయు

నలలదామగ్రంథితంత్రీపాలురతోడఁ గంకుఁడు
యుద్ధమునకురాఁగోరుట.

భీమమాద్రేయులు పిఱుఁద నేతేరఁ
దా మును చనుదెంచి ధర్మనందనుఁడు
సరభసంబున రణసన్నాహ మొప్ప
విరటుఁ దప్పక చూచి వెర నొప్పఁ బలికె:
"నరనాథ విను మున్ను నా కొక్కమౌని
తిర మైనమంత్రోపదేశంబు చేసె;
ఆమంత్రశక్తిచే నాహవక్రీడ
నే మును పొక్కింత నెఱిఁగి యుండుదును.
గోవుల విడిపింపఁ గోరి యీరీతి
నీవు సేనలఁ బోవ నేను రా వలదె?

వలలునిలావు నెవ్వా రెఱుంగుదురు?
తలకొని యతఁడు యుద్ధము సేయు టొప్పు.
మఱిఁ దలపోయ దామగ్రంధి శూరుఁ
డతఁడు యుద్ధము సేయ నరుదెంచు టొప్పు.
తేజంబు గల్గుతంత్రీపాలశూరుఁ
డాజి దుర్జయుఁ డౌట నతఁడు రా వలయు.
వీరిలావులు మున్ను వివరించినాము.
వీరికి రథములు వేగఁ దెప్పింపు"
మనవుడు నౌఁగాక యనుచు భూపాలుఁ
డనుజన్ముఁ డైనశతానీకుఁ జూచి
రథములు నాలుగు రమణఁ దెప్పించి
ప్రథితశస్త్రాస్త్రవర్మంబు లిమ్మనిన
వాఁడును దెప్పించి వరుసఁ బాండవులఁ
బోఁడిమిగాఁ బురంబునకు రప్పించి
సవరణ లన్నియు సరగ నిప్పించె.
వివిధాంబరంబులు వేడ్కఁ గైకొనుచు
నాగూఢమతితోడ నరదంబు లెక్కి
సారథ్యములు తారె చక్కఁ బెట్టుచును
అనయంబుఁ గురుసేన నాపోశనంబు
గొనునంత వేడ్కఁ గైకొనిరి పాండవులు.

అప్పుడు రథవార మవనిపైఁ బోవ
నుప్పతిల్లినధూళి యుప్పరం బలమ
నుదధులు ఘోషింప నుర్వి గంపింపఁ
గదలె భూపాలుఁడు ఘనసేనతోడ.
వెస నిట్లు వెడలి యవ్విరటుసైన్యంబు
దెసలు చిల్లలు వోవఁ దివిరి యార్పుటయు
నాత్రిగర్తలసేన లటు పోక నిలిచి
చిత్రలాఘవసత్త్వశీఘ్రయానముల
వల నొప్పఁ గోపించి వచ్చి తాఁకుటయు
నెలమితోఁ దలపడి రిరువాఁగు లపుడు.
శింజినీటంకారసింహనాదములఁ
గంజజాండము నల్లకల్లోల మయ్యె.
మెఱుఁగువాలమ్ములు మెఱుఁగుశూలములు
మెఱుఁగునారసములు మెండుగాఁ గప్పఁ
బటుఖడ్గములఁ ద్రుంచి పరిఘము ల్దునిమి
చటులచక్రంబులఁ జక్కుగా నఱకి
వడిఁ బ్రాసములు వైచి వజ్రంబు లాని
అడిదంబులను హతాహతముగా వ్రేసి
చూరకత్తులచేత సురియలఁ గూల్చి
తోరంపుఁగత్తులఁ ద్రుంచి చెండాడి

ఘోటకంబులఁ దోలి గురుశక్తి మెఱసి
వేటారుతునియలై వెస డొల్ల నేసి
హేషారవంబుల నిద్ధకింకిణుల
ఘోషంబు మేఘనిర్ఘోష మై వెలయఁ
గదులఁ గీల్కొల్పి ప్రక్కలు గాఁగ నేసి
కెరలుచుఁ బాఱుచు ఘీంకార మెసఁగ
గదలు ముద్గరములు కడఁకతోఁ ద్రిప్పి
మెదడు వెల్వడ నెత్తిమీఁద వ్రేసియును
రథములు పఱపి సారథుల రథ్యములఁ
బృథివిపైఁ బడ వైచి పేటాడి యంత
నొగ నొగలోఁ దాఁకి నుగ్గుగా విరుగఁ
దెగువతో వేఱొక తేరు సంధించి
పోరాడి రివ్విధంబున రెండు తెగల
వారును జయకాంక్ష వర్ధిల్ల నంత.
అప్పుడు సేనల నన్యోన్యహతుల
ముప్పిరి గొనుమూర్ఛ మునుఁగుసద్భటులు,
ఇరుప్రక్క డస్సి పోయినరాతుతోడ
సరగ గుండెలు తెగి చచ్చునశ్వములు,
పక్కెర ల్వ్రిక్క లై పల్లంబు లూడి
మెక్కినభటు వైచి యేగుగుఱ్ఱములు,

తురగంబు కూలఁ దోడ్తోఁ గాళ్లు విరిగి
యరుగ నోపక దీను లైనరాహుతులు,
ఉదరి డీల్పడి పడి యున్న కాల్బలము,
చిదిసి పో లేక చెచ్చెరఁ గూలుకరులు,
అటిమురి నుండి యాయముచోటు దాఁకి
కొఱప్రాణములతోడఁ గూలుమావటులు,
రయ మేది కీ లూడి ప్రగ్గు తేరులును
భయమున ప్రాన్పడి పడినమావులును
రథములు గూల సారథులఁ బో విడిచి
ప్రథనంబునకు నోడి పాఱుయూథపులుఁ
గలిగియు నిస్సాణకాహళధ్వనులు
కలయఁ బర్వఁటఁ జేసి కదన మొప్పారె.
అంత నింద్రుఁడు విమానారూఢుఁ డగుచు
నంతరిక్షంబున నరుదెంచి నిలిచి
సురసిద్ధసాధ్యులు సొంపుగాఁ గొలువఁ
బరఁగినవేడ్కఁ దప్పక చూచు చుండె.

విరాటసుశర్మలసైన్యంబులు పెనఁగి
సంకులంబుగాఁ బోరుట.

అరులపైఁ గోపించి యాశతానీకుఁ
డరదంబుఁ దోలించి యర్కుఁడో యనఁగ

నంధకారముఁ బోలి యరుదెంచు చున్న
సింధురంబులఁ బట్టి చించి చెండాడి
కాలుబంటుల నెల్ల ఖండించి వైచి
నేలపై వఱదగా నెత్తురు ల్వాఱపి
మఱియు నంతటఁ బోక మహితాస్త్రతతుల
నెఱి నాట నేయుచు నిమిషమాత్రమునఁ
దురగాశ్వకేతుసూతులతోడఁ గూడ
ధరఁ గూల్చె నూఱురథంబులవారి.
మదిరాస్యుఁడును గోపమహితాస్యుఁ డగుచుఁ
గదనంబునకును జక్కఁగఁ దేరుఁ గడపి
బహుగుణధ్వనులతోఁ బరఁగి పాతాళ
కుహరంబు రోదసీకుహరంబు నిండ
జడి గాఁగ రిపు లేయుశరపరంపరలు
నడుమనే తునియఁగా నఱికివేయుచును
దూపించి రథికవీరుల నోలిఁ దాఁకి
చాపకట్టయి పడఁ జంపి నుగ్గాడి
రయ మొప్ప నన్నూఱురథములవారి
దయ లేక వ్రేల్మిడి తఱిమి పోకార్చె.
శౌర్యంబు మెఱయంగ సత్త్వసంపదలు
ధైర్యసంపత్తియుఁ దనరార నతఁడు

భాసురకీర్తిమై బవరంబు సేయు
నాసమయంబున నల్లిబిల్లికొనఁ
బృథివియు మిన్నని భేదింప రాక
పృథురోచు లంతట బెరయ నించుచును
పరశుతోమరశూలపట్టసంబులును.
శరములపఱపున శత్రుసైన్యములు
వెఱచియు మఱచియు వెసఁ గావుఁ డనుచు
నఱచియుఁ బఱచియు నటఁ గూడఁబడక
యెదురైనరథికుల నెదురైనకరుల
నెదురైనయోధుల నిలఁ గూల్చు చుండె.
శంఖుండు నడగి నిశ్శంకమార్గమున
శంఖంబు పూరించి సంకులం బెసఁగ
జడధిలో మందరశైలంబు వోలెఁ
గడిమిమై రిపుసేనఁ గలఁచి యాడుచును
అలుగులు వఱదిగా నాహవక్షోణి
గలయఁ గప్పిన దేవగణ మెల్ల నార్చె,
ఆడె నారదమౌని, యప్సరోంగనలు
నాడిరి పాడిరి యతిమోదమునను.
ఈరీతిఁ దమ్ములు హితులు నందనులుఁ
బోరాడఁ గని మత్స్యభూమీశ్వరుండు

భుజములు మూడుగాఁ బొంగి యుప్పొంగి
నిజసారథినిఁ జూచి నెఱి నిట్లు లనియె:
“సారథి నీనేర్పు సకలంబు నిపుడు
పోరిలో మాకుఁ జూపుదు కాక నీవు.
ముందట నదె కంటె మొన గాన వచ్చె
నందులో నదె త్రిగర్తాధీశుపడగ.
ఆదిక్కునకుఁ బోవ నరదంబుఁ బఱపు
భేదించి చొచ్చి నిర్భేదింతుఁ గాని”
అనుటయు వాఁడును హరులపగ్గములు
గనుకని విడువ నగ్గలికతో రథము
నొప్పారఁ బఱచి యత్యుగ్రవేగమునఁ
నప్పుడె చనఁ ద్రిగర్తాధీశుమీఁద
విరటుండు నిజబాహువీర్యంబు మెఱయ
నరదంబు లేనూఱు హతముగాఁ బొడిచి
తెప్పలై ధరఁ గూలఁ దెగ వ్రేయుటయును
“కుప్పించి యరులపై ఘోరంబుగాను
రాజు దాఁ బోరెడు రండు రం” డనుచు
నాజికి సన్నద్ధమై మత్స్యబలము
క్రోడదిగ్గజనాగకూర్మంబు లదరఁ
గూడి సైన్యంబుల ఘోషంబుతోడ

జేరి పోరఁ దొడంగి శితశస్త్రహతుల
గారింప బల మేది కదనంబునందు
నిలువక విచ్చిన నిజసేనఁ జూచి
పలికెఁ ద్రిగర్తాధిపతితమ్ముఁ డొకఁడు:
"ఎక్కడఁ బోయెద రే నున్నవాఁడ;
ముక్కంటి నైనను మొనఁ గూల్ప నేర్తు.
కాననం బొగి నేర్చుకార్చిచ్చుపగిదిఁ
బూని యీవైరులఁ బోరిలో నణఁతుఁ
గడఁక రం" డని పల్కి ఘనకోపమునను
గడునెట్టె నైనట్టికనుదోయితోడఁ
బటుతరం బగునట్టిపట్టంబు మెఱయఁ
జటులమేఘము పోలెఁ జాల గర్జించి
యరవాయి గొనక బాహాశక్తి మెఱసి
తరవాయిఁ గొని వైరిదర్పంబు మాన్ప
నేలిక పోఁ గని యెల్లసైనికులు
నాలంబు సేయుద మని పోర నిలిచి
జలనిధిలోఁ దాఁకుజలధిచందమున
బలము మీఱఁగ మత్స్యబలముతోఁ దాఁకి
ఘీంకారములను జంకించునార్పులను
బింకంబులను మించి పేర్చి పోరాడఁ

గని మత్స్యరాజు త్రిగర్తేశుమీఁదఁ
దన తేరుఁ బఱపించి ధట్టించి తాఁకి
జడి వట్టిన ట్లర్ధచంద్రబాణములు
తొడిగి యేసిన వాఁడు తోన కోపించి
మింట మంటలు గ్రమ్మ మెఱుఁగునారసము
కంటకంబున వైవఁ గార్ముకం బదర
విలు ద్రుంచి వైచిన విభుఁడు వేఱొక్క-
విలు గొని బహుకోపవివృతాస్యుఁ డగుచు
వడిఁ ద్రిగర్తేశునివక్షంబు గాఁడఁ
దొడిబడి పదునాల్గుతూపులు పఱపి
పదియింట సారథిఁ బదియింట హరులఁ
బదియింటఁ గేతువు భంగించి యార్చె.
వాఁడుఁ గోపించి యవ్వసుధేశుమీఁద
వాఁడితూపులు నాటె వడి నైదుపదులు.
దొర లిట్లు తలపడి దురము సేయంగ
నురుతరాటోపు లై యుభయసైనికులు
లావులు దాఁపక లలితవేగమున
వేవితంబుల బాణవితతి నేయుచును
దమకించి పోరాడ ధరనుండిధూళి
తమము కప్పినయట్లు దట్టమై నిగుడి

పరులను దమవారిఁ బరికింపనట్లు
పర పైన మొనలపైఁ బర్వె నాతుఁణామె.
పోటు గట్టినరక్తపూరంబు వెడలి
పాటవంబున ధూళిపటలంబు నణఁచె.
అంతట నరుణోదయమునఁ జీఁకట్లు
వింతగా విరిసినవిధ మయ్యె నపుడు
దళములు కదియ సందడికయ్య మయ్యె.
తలపడి యిటు పోరఁ దపనుండు గ్రుంకె.
గ్రుంకినఁ బోక యుక్కున సేన రెండు
వంకలు దెగి వకావకలుగాఁ జెదరఁ
దిమిరంబు నెసఁ బర్వె ధృతరాష్ట్రతనయుఁ
డమితంబుగాఁ గొన్నయపకీర్తి యనఁగ.

సుశర్మ విరాటభూపాలుని గట్టి
కొనిపోవుట.

అప్పు డాచీఁకటి పని సేయఁ గాన
కొప్పార నున్నవా రున్నచోటులను
నిలిచినఁ జూచి యానీరజారాతి
ఎలమిఁ బాండవు లని కిచ్చమై నుండఁ
గదనంబు వారికిఁ గడఁగి యేఁ బోక
యొదవ దలంచుఁ దా నుదయించి మించె.

అప్పుడు వెలుఁ గైన నఖిలసైన్యములు
నెప్పటియట్ల పై నెల్లెచి పోరాడ
నా త్రిగర్తేశునియనుఁగుఁదమ్మునిని
విఖ్యాతుఁ డగుమత్స్యవిభుఁ డొప్పఁ దాఁకె.
తాఁకినఁ గని త్రిగర్తులు నొక్క తెగువఁ
దాఁకి యవ్విభునిరథ్యములరూ పణఁచి
సారథిఁ దెగటార్చి చాపంబుఁ దునిమి
తేరును ధరణిపైఁ ద్రెళ్ల నేయుటయు
విరథుఁ డై ధరఁ గూలువిరటుపై కుఱికి
యురవడితో వాని నుక్కణంపకయ
కర మర్థిఁ గాచి త్రిగర్తనాయకుఁడు
అరిమురిఁ దిగిచి బాహాపంజరమునఁ
దన తేరుమీఁద నాతనిఁ బట్టి కట్టి
ఘనయోధయూథంబు కడునార్చి యదర
జయజయధ్వనులతో జయకాహళములు
జయదుందుభులు మ్రోయఁ జదలు గ్రక్కదల
నంతటఁ దిరిగి సైన్యముల రాఁ బనిచి
సంతోషమునఁ గొంత సాగి పోవుటయు
విరటునిదెసఁ జూచి వెస ధర్మరాజు
అరు దైనకడఁక నిట్లనియె భీమునకు:

"అనిలజ మనకు సౌఖ్యంబుగా నితఁడు
ఒనరఁ గట్టడ చేసి యొకయేఁడు నిలిపె;
నిలిపినవానికి నిక్కంబు గాఁగ
వెలయ నాపద యైన విడిపింప వలయు."
అనుటయు మే లెంచి యాభీమసేనుఁ
డని సేయఁ దివురుచు నన్న కిట్లనియె:
"అగు నట్ల కాక మహాప్రసాదంబు.
జగతీశ ననుఁ బంపు చాలు నీపనికి.
అల్లదె వృక్షంబు నవలీలఁ బెఱికి
త్రు ళ్లడంచియు దాయఁ దూలించి యేను
విరటుని విడిపించి వేవేగ వత్తు
వెరవుతో; నాశక్తి వీక్షింపు మిపుడు."
అనుటయు నగి పాండవాగ్రజుం డనియె:
"ఘనమహోత్సాహంబు గని మెచ్చి పొగడ
దింతసాహసి వౌట యెఱుఁగనే నేను?
అంతకార్యము వల దయ్యె యీవేళ.
లాలితగతులఁ గాలానకుఁ జగిన
కోలాహలము మేలు కొంతేసి మనకు.
కావునఁ జక్రరక్షకులుగా వీరిఁ
గావింపు మిదె నీకుఁ గవ లున్నవారు.

సాధనంబులు మీకుఁ జాపబాణములు
సాధింపు వీరల క్షణములో" ననిన
గురుకుంభయుగళ మంకుశము దాఁకుటయు
దరువుఁ గూల్చక మానుదంతిచందమున
నన్నమాటకు భీముఁ డావృక్షచింత
క్రన్నన విడిచి సంగతి దోఁపఁ బలికె:
"అన్న మీయానతియట్ల కావింతు,
సన్నుతగతిఁ బోయి జయముఁ గైకొందు.
మీరు రా వలవదు మేము చాలుదుము.
గోరఁ బోవుపనికి గొడ్డ లేమిటికి?"
అనవుడు నృపునితో నటమున్నె తాను
ఘనరణం బొనరింపఁ గలవాఁడ ననుచుఁ
బలికినపలుకు లేర్పడఁ జెప్పి తనకుఁ
బలికి బొంకఁగ రానిభావంబుఁ జెప్పి
"నచ్చెగఁ బద" మని వడి ధర్మరాజు
చెచ్చెరఁ జని వైరిసేనపైఁ గవిసె.
అనజుండుఁ దానును శస్త్రాస్త్రములను
మునుమిడి పుంఖానుపుంఖంబు సేయఁ
గర ముగ్రముగను ద్రిగర్తసైన్యములు
తిరిగి లోకములకు దిగులుగా నార్చి

దాసియు వ్రేసియుఁ దాఁకఁగా మరలఁ
జేసియు నేసియుఁ జెలఁగి పోరాడి
ప్రథితసత్త్వమున నేర్పడ రెండువేల
రథములవారిదర్పము భీముఁ డణఁచె.
వీరుఁడై నకులుండు నెస నేడునూఱు
తేరుల ధరఁ గూల్చి తివుటమై నార్చె.
సన్నుతసత్త్వుఁడై సహదేవుఁ డవుడు
మున్నూఱురథముల మొద లంట నఱకె.
పాయక యమసూతి బాహుదర్పమున
వేయితేరులవారి విజయించి మించె.
అంతఁ బోవక త్రిగర్తాధీశుఁ దాఁకి
యంతకతనయుఁ డత్యంతవేగమున
ఘనదీప్తి నొప్పు(వ్రేఁకపు)నారసములఁ
జనుమఱ నాటింపఁ జాల మూర్ఛిల్లి
జవ మొప్పఁ దేఱి సుశర్మ ధర్మజుని
జవనాశ్వములమీఁద శరవృష్టిఁ గురిసె.
ధీరుఁడై యంతఁ గాంగేయుఁ డావీరు
సారథిఁ జంపి యశ్వములఁ జెండాడె.

### సుశర్మచేఁ గట్టుపడినవిరటుని యుధిష్ఠిరాదులు విడిపించుట.

అది సందు గాఁగ మత్స్యాధీశుఁ డంత
గదఁ గొని వానివక్షము నొవ్వ నేసి
యతివృద్ధుఁ డయ్యుఁ బ్రాయమువానిపోలెఁ
గుతలంబునకు దాఁటి కుశలి యై పోయె.
కరువలిపట్టి త్రిగర్తనాయకుని
యరదంబునకు దాఁటి యతని బంధించి
పగతురగుండియల్ పగుల నార్చుటయు
మగఁటిమి దిగనాడి మఱి వైరిసేన
భీతిల్లి వెస వికావికలుగాఁ బాఱె.
ఆతతగతి భీముఁ డడ్డంబు వచ్చి
గొడుగులు వ్రేయించి కొమరైనబిరుదు
పడగలు వ్రేయించి పసిఁ గ్రమ్మరించి
మఱియును రథవాజిమాతంగసమితి
నుఱక ధర్మజునకు నొప్పించెఁ దెచ్చి.
చెలఁగి యీవిధమున సేనతోఁ గూడ
బలియుఁ ద్రిగర్తాధిపతిఁ బట్టి తెచ్చి
తమ్ములుఁ దానును ధర్మనందనుఁడు
సమ్మదంబున మత్స్యజనపాలుఁ గనిన

నతఁడు నానందించి యాధర్మజునకు
నతిగౌరవము మీఱ నర్థి నిట్లనియె:
"ఓ కంకు భట్ట మీ రొనగూడి యిపుడు
మాకుఁ జేసినమేలు మఱవంగ రాదు.
తగినమీచేతకుఁ దగినట్టిమేలు
మగుడఁ జేసెద మన్న మాచేతఁ గాదు!
కా కున్న నేమి సౌఖ్యమున మాపదవిఁ
గైకొని మాకోర్కిఁ గావింపు మయ్య.
ఈయెడ లీలక్ష్మి యీమాసధనము
నీయిచ్చినవి కాన నీకిత్తు మగుడ.
ఎలమితో మిముఁ గొల్వ నిహపరోన్నతులు
గలుగు నంతియె చాలు గణుతింప మాకు."
అనుటయుఁ బ్రియ మంది యాధర్మజుండు
మనుజేంద్రుఁ జూచి సమ్మద మొప్పఁ బలికె:
"ఏమిటఁ గొఱఁత మా? కెల్లభోగములు
నీమన్ననయె చాలు నృపలోకచంద్ర,
ప్రియముఁ బెద్దఱికంబుఁ బేరుఁ గీర్తియును
జయమును నీతోడిసఖ్యంబె చాలు."
అనుటయు మఱియు నిట్లనియె భూవిభుఁడు
"విను కంకుభట్ట మీవిక్రమం బొప్ప!

మిక్కిలియును శాంతి నీమూర్తి యైన
నెక్కడ నేర్చితి వీసాహసంబు?
కలహలీలాప్రౌఢిఁ గనుఁగొన్న యపుడు
వలలునంతటివాఁడు వసుధలో లేఁడు.
కలశజుపరిపాటి గాఁడె యామేటి
గెలిపించె నన్ను నక్షీణసాహసుఁడు.
మఱియును మాకు దామగ్రంథి నేఁడు
మెఱయఁ జేసినలావు మితి మేర గనెనె!
కడువేడ్క నాతఁ డఖండవిక్రముఁడు
జడియక వైరులఁ జంపె నొప్పార.
ధీభవ్యుఁ డైనతంత్రీపాలుఁ డొకఁడు
శోభన మొప్ప నన్నుతులతోఁ గూర్చె.
మనసేన నెవఁ డైన మహితవిక్రమము
తనర యుద్ధము సేయఁ దలపడె నొక్కొ?
చెలి కెందు నెడ రైనఁ జేరి ప్రోవంగఁ
దలపోయువాఁడె పో ధర నుత్తముండు.
తరుణు లశ్వములును ధనము వస్తువులుఁ
గరులు గ్రామంబులుఁ గనకభూషణము
లడుగుఁ డిచ్చెద నంటి నభిమతం" బనినఁ
దడయక విభుఁ జూచి ధర్మనందనుఁడు

"ఇచ్చెద ననుమాట యిపుడు మాచోట
నొచ్చె మైనది మీకు నుర్వీశ వినుము.
ఇన్నియు నిచ్చుట యాత్రిగర్తేశు
మన్నించి సేనతో మరల నిచ్చినను.
చాటంగఁ బంపుమీ జయము సేమంబుఁ
బాటించి మనమత్స్యపట్టణంబునకు."

కంకుభట్టువేఁడికోలుచే విరటుఁడు త్రిగర్తాధిపుని
విడిచిపుచ్చుట.

అనుటయు వాని సైన్యముతోడ విడిచి
జననాథుఁ డపుడు సుశర్మ వీడ్కొలిపి
కాలరి నొకని నక్కడ మత్స్యపురికి
మేలువార్తలు దెల్పి మెలపుతో ననిచె.
అని చిన వాఁడును ననిలవేగమునఁ
జని మత్స్యపురిఁ జొచ్చి జయము చాటింపఁ
బురజను లెల్ల నద్భుత మంది యపుడు
పురము శృంగారింపఁ బురవీథులందుఁ
గస్తూరి నలికించి కమ్మపూసరులు
ప్రస్తుతి నిలిపి తోరణములు గట్టి
పుణ్యగంధంబులుఁ బుణ్యానాదములుఁ
బుణ్యచేష్టలుఁ గల్గి పురలక్ష్మి వెలయ

నవనీశచంద్రుని నర్థిఁ జూచుటకుఁ
గువలయాత్తులఁ జేరి కోరు చున్నంత
నటఁ బాండవులు భూతలాధీశుతోడఁ
బటుతరసైన్యసంపన్ను లై కదలి
సమరంబునడుమగాఁ జను దెంచునపుడు
అమితభూతవ్యాప్త మైనతావులును,
కరి సొచ్చి విఱిచినకదళీవనంబు
పరుసునఁ దొడ లూడి పడినతావులును,
పాతాళబిలములో ఫణిరాజు లున్న
భాతిఁ జేతులు తెగి పడినతావులును,
ఘనత నంచలు ద్రెంచుకమలనాళములొ
యనఁగఁ ద్రేవులు ప్రోవు లైనతావులును,
పూని నెత్తురునీటఁ బుష్కరాకృతుల
నాననంబులు దెస్సి యలరుతావులును,
చిగురాకు నెరసినశృంగారవనము
పగిది నంఘ్రులు ద్రెవ్వి పడినతావులును,
నీలాభ్రయుతశైలనికరంబు లనఁగఁ
గూలినకరులు నెక్కొన్నతావులును,
విరిగి కూలినసౌధవితతిచందమునఁ
బరియ లై రథములు పడినతావులును

గలిగి రోఁతయు భీతి గలిగించుకలను
దలఁకొని వెడలి యందఱు నొక్కచోట
వెన్నెలబయలును పడిసి నిద్రించి
యున్నతసుఖలీల నుండి రారేయి.
కర మర్థి నట్టిసంగరముఁ జూచుచును
సురరాజు నటు పోయె సురలోకమునకు.
అన విని తర్వాత నైనవృత్తాంత
మనఘాత్మ యెఱిఁగింపు మని వేఁడుటయును
డిండీరకీర్తి బట్టీపాటెనిలయ
చండశాత్రవశూర సంచారధీర
మదనసన్నిభగాత్ర మలిరెడ్డిపౌత్ర
విదితసత్కులచంద్ర విభవదేవేంద్ర
లలితచౌషష్టికళాప్రవీణాత్మ
కలితమహాభాగ్యకర్ణాటతిలక
ఇది సదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్ర
మతిమద్విధేయ తిమ్మననామధేయ
రచితవిరాటపర్వమున నాశ్వాస
ముచితార్థయుతముగా నొప్పె మూఁడవది.

శ్రీసమంచితనేత్ర చిరకృపాపాత్ర
వాసవాకార దేవయమున్మథీర
వినుము వెండియు నిట్లు వివరింపఁ దొడఁగె
జనమేజయునకు వైశంపాయనుండు:
అంతఁ గౌరవనాథుఁ డరుణోదయమున
నంతయుఁ దెలిసి సైన్యంబు రాఁ బనిచి
పాతాళభూతలబ్రహ్మలోకములు
భీతిల్లఁ బ్రస్థానభేరి వేయించి
కదలె ద్రోణాచార్యగాంగేయకృపులు
మొదలైనరథికులు మొత్త మై నడువ.
అప్పుడు సేనపై నాడె గృధ్రములు
నిప్పులు వర్షించె నిండుమేఘములు
వసుమతి గంపించె వఱళులు గూసె
నెసఁగి ఱువ్వుచు వీచె నెదురుగా గాలి.

ఇచ్ఛలో నివి యెల్ల నెగ్గుగాఁ గొనక
వచ్చి కౌరవసేన వడి మీఱి నార్చి

### మత్స్యపుర ముత్తరదిక్కునందలిగోవులఁ గౌరవులు పట్టుట.

పొలుపు మీఱినమత్స్యపురిసమీపమున
బలిమి నవ్విరటునిపసులఁ బట్టుటయుఁ
గలగొల్ల లెల్ల నొక్కట మూఁక లగుచుఁ
దలపడి ఘోరయుద్ధము సేయునపుడు
కర ముగ్రముగ భీష్మకర్ణవికర్ణ
గురుకృపాశ్వత్థామకురురాజు లపుడు
బాణజాలము లుచ్చి పాఱ నేయుటయుఁ
బ్రాణభీతిని నోడి పాఱి గోపకులు
కౌరవసైన్యంబుగా నిశ్చయించి
యారవాగముతోడ నరుదెంచునప్పు
డతివీరుఁ డొకఁడు గవాక్షుఁ డన్వాఁడు
క్షితినాథునగరివాకిటఁ దేరు డిగ్గి
తత్తఱం బెసఁగ నంతఃపురంబునకు
నుత్తరునకుఁ జెప్ప నొప్పారఁ బోయి
యతనిపాదములకు నర్థితో మ్రొక్కి
యతులితం బైనదైన్యముతోడఁ బలికె:

"ఉత్తర మనయూరియుత్తరంబునను
గ్రొత్తగా నిదె నేఁడు కురుసేన వచ్చి
గోగణంబులఁ బట్టి కొనిపోవఁ దొడఁగె;
నీగుణంబులు లావు నెఱపుదు కాక;
అరదంబుఁ దెప్పింపు, మతిశీఘ్రగతుల
ధరియింపు కవచంబు, ధనువుఁ దెప్పింపు
మాజికి; బలవంతు లగువారితోడ
రాజు వర్ణించు నీరణకళాకేళి.
దానికిఁ దగ వెంటఁ దగిలి గోగణముఁ
బోనీక మగిడించి పొరివుచ్చు మరుల.
నరుఁ డొక్కరుఁడు గాని నరనాథతనయ
కురుసేన నోరుఁడు మాఱొక్కన లేఁ డటన్న
యామాట బొంకుగా నాకౌరవులను
నీమగఁటిమిఁ జూపి నెఱి గెల్వు; మంత
సుత్తరుబలము లోకోత్తరం బనుచు
వత్తురు నినుఁ జూడ వసువతీజనులు."
అని యంగనలచెంత నగ్గించి యతఁడు
తనుఁ బెద్ద సేయ నుత్తరకుమారుండు
"వా రెంత, నే నెంత? వలదు పొ" మ్మనక
కౌరవసేనతోఁ గాలు ద్రవ్వుచును

మెలఁతలు తనుఁ జూచి "మేలు మే" లనఁగఁ
బలికె గర్వించి గోపకుల వీక్షించి:

కౌరవులు పసులం బట్టుట విని యుత్తరుఁ డంతః
పురమున వీరాలాపము లాడుట.

"పోద పోద గోవులు పో నెట్లు వచ్చు?
ఇదె వచ్చు చున్నాఁడ నేఁ గయ్యమునకు.
కురుసేనపని యెంత, ఘోరబాణములు
గురిసినఁ జాలు సంక్షోభింప వలదె?
సారథి దొరకఁడు సంగ్రామమునకు
నేరూపమునఁ గాని, యేమి చేయుదును?
కడుకొని వెదకుఁ డెక్కడ నైనఁ గాని
కడచి గోవులు దవ్వుగాఁ బోకమున్నె.
ఈవేళ నే నుండి యింతకార్యంబుఁ
గావింప కున్న భూకాంతుఁ డే మనును?"
అనుటయుఁ బాంచాలి యచ్చోట నుండి
మనుజేంద్రసుతుఁ డాడుమాట లాలించి
వచ్చి యంతయును వివ్వచ్చుతో ననిన
నిచ్చలో నపుడు దేవేంద్రనందనుఁడు
వడి నెన్ని యజ్ఞాతవాసవత్సరము
కడచుట యెఱిఁగి యాకాంత కిట్లనియె:

"జలజాక్షి యతనితో సారథ్యమునకు
నలు వొప్ప నాబృహన్నల నేర్చు ననుము?
వడి నర్జునుఁడు ఖాండవం బేర్చునపుడు
కడఁగి సారథ్యంబుఁ గావించె ననుము;
చతురుఁడై మఱియు వాసవు తేరు గడపె
నితఁడు ముఖ్యుండు నే నెఱుఁగుదు ననుము;
మఱియును వాఁ డేమి మాట లాడినను
విఱుగక నను బిల్చువిధము గావింపు"
మనుటయు నౌఁగాక యనుచు ద్రౌపదియు
నెనయ నుత్తర యున్న యెడకు ము న్నేగి
యాముగ్ధ కి ట్లను "నతివ మీాయన్న
వేమాఱు సారథి వెదకు చున్నాఁడు.
అంతకు నేఁ గన్న యంతఁ జెప్పెదను:
చింతింప సారథి సిద్ధించె మనకు;
అతఁ డెవ్వఁ డనినను నతివ పార్థునకు
నతులితగతి సూతుఁ డైనమీాగురువు.
ఈమాట లన్నియు నీవును నేను
భూమింజయునితోడఁ బోసఁగఁ జెప్పుదుము
ర" మ్మని చనుదెంచి రమణీలలామ
యిమ్ముల నృపసూతి కెఱిఁగించె నంత

మందహాసముతోడ మనుజేంద్రసుతుఁడు
పొందుగాఁ బాంచాలపుత్రి కిట్లనియె:
"మాలిని మాతోడ మందమేలములె?
ఏల నీ విట్లాడ నిపుడు నాయెడను
బరిహాసములు నీకుఁ బాడియే యకట!
అరయంగ లేవు నీ వాలంపువితము!
ఆవలఁ గురుసేన యరుదెంచునట్టి
భావింప నే వారిపైఁ బోదునట్టి
పేడి సారథి యైనఁ బృథివిలో నగరె?
కూడదు నగుబాటుకోలఁది సెప్పినను.
మున్నెన్నఁడును బేడిముఖము నేఁ జూడఁ
జెన్నార సారథిఁ జేయ నోపుదునె?
కర మొప్ప సారథి కలఁ డయ్యె నేని
పరిహాసములు నీకుఁ బాటి గా" దనిన
ద్రౌపది వెసఁ బల్కె "దైవాజ్ఞ నతఁని
కా పేడితన మైన నయ్యెఁ గా కేమి
ఖాండవదహనాదికములు పార్థునకు
దండియై మున్ను నాతఁడు తేరు గడప
సమకూరె" నావుడు క్ష్మాభర్తసుతుఁడు
"కొమ వీఁడు రథచోదకుం డౌట నరున

కరయఁగా నిజ మౌనె యది చెప్పు" మనిన
మరియు ద్రౌపది "యనుమానింప కయ్య
సారథి యతఁ డైన జననాథతనయ
కౌరవులను గెల్తు కడఁక నీ" వనిన
నెడపక సారథి యెందు లే కునికిఁ
దొడుక ర మ్మని వేడ్కతోఁ జెప్పుటయును

ఉత్తర యన్నకు సారథ్యంబు సేయ బృహన్నలం
బిలువం బోవుట.

"ఇత్తెఱఁ గైన నే నిదె తెత్తు" ననుచు
నుత్తర వెడలి తా నుల్లంబు చెలఁగఁ
గలికికన్నులడాలు కర్ణపూరముల
వెలుఁగున మెఱుఁ గెక్కి వింత యై పొలయ,
అందెలమొరపంబు లరసి యంచలును
సందడిఁ దనవెంటఁ జనుదెంచు చుండ
నడుగులనునుఁగాంతి నవనీతలంబు
కడుకొని పద్మరాగస్ఫూర్తి నలర
క్రచ్చరఁ గామాంధకారంబు వెంట
వచ్చు నాఁ గ్రొవ్వెద పరిభవింపఁ జని
నాటకశాలలో నరుఁ గాంచి యతనిఁ
బాటించి చూచుచుఁ బణఁతి యి ట్లనియె:

"ఉత్తరునకు మొన్న నొక్కకయ్యమున
నుత్తమగుణజాతుఁ డొకసూతుఁ డీల్గె.
తరువాత సూతవర్తనముఁ జెల్లింప
వెరవరి మఱి లేఁడు వెదకి చూచినను.
అది యటు లుండె నేఁ డఖిలకౌరవులు
మొదవులఁ బట్టిన మొనఁ జక్కఁ బెట్టి
యన్న తాఁ బోయెద నని విచారించి
క్రన్ననఁ దగినసారథి లేక వగవఁ
జూచి సైరంధ్రి నీచొప్పుఁ జెప్పుటయు
నేచినవేడ్క న న్నిచ్చటికి నతఁడు
నిన్నుఁ దోడ్కొని తేర నెమ్మిఁ బుత్తెంచె.
మన్నించి నీవు నామాటకై రమ్ము"
అనవుడు రమణి కిట్లనియె నర్జునుఁడు:
"వనిత సారథ్యంబువల నే నెఱుంగ;
నీవు వచ్చితి కాన నీవేడ్క నాకుఁ
గావింప కుండుట కా దెన్నిగతుల
రయ మొప్పఁ జేయంగ రానికార్యంబు
నియతిఁ జేయుదు నేను నీమాటకొఱకు"
అనుచు నాటకశాల నర్థితో వెడలి
చను దేరునరుఁ జూచి జననాథసుతుఁడు

నాదరం బొప్ప ని ట్లను "నీవు నాకు
నాదట సూతకృత్యము సేయ వలయు.
ఆరీతిఁ జేయఁ బొ మ్మన రాదు నీకు.
సైరంధ్రి చెప్పె నీసామర్థ్య మెల్ల.
కౌరవులకు నాకుఁ గయ్యంబు గలిగె;
వారక ధరియింపు వజ్రాంగిజోడు"
అనినయు త్తరుతోడ నాక్రీడి పలికె:
"చను నయ్య ననుఁ బిల్వ సారథ్యమునకు
నాటపాటలఁ బిల్వ నర్హంబుగాని?
పోటులాటకు నాకుఁ బొసఁగునే యకట!
చారుదోర్బలశౌర్యసంపన్నుఁ డొకఁడు
తేరు దోలినఁ గాని తీఱునే పనులు?"
అనుటయు నరు నిట్టు లనియె ను త్తరుఁడు
"విను బృహన్నల నీవు వేడ్కతోఁ దొల్లి
అరదంబు దోలినయాశ క్తిఁ గాదె
నరుఁడు ఖాండవదహనం బొప్పఁ జేసె
నాటిదోర్బలమును నాటిసాహసము
నాటినేర్పును జూపి నా మెప్పు గాంచ
కొప్పనియ ట్లింక నొకటిపై నొకటి
చెప్పు చుండిన నాదుచి త్తంబు నొచ్చు"

అనిన నుత్తరుమాట కడ్డంబు లాడ
మనసులో వెఱచినమాడ్కి నర్జునుఁడు
ననుమతించుటచేసి యతని కుత్తరుఁడు
ఘనవజ్రకవచంబుఁ గడఁగఁ దెప్పించి
తొడుగు మీ వని వేడ్కతోడ నిచ్చుటయుఁ
దొడుగ నేరనిలాగు దోఁప నర్జునుఁడు
నట్టిట్టుఁ దొడిగిన నచటికామినులు
నెట్టన నది చూచి నెఱి నవ్వు చుండఁ
దా వచ్చి తొడిగె నుత్తరకుమారుండు
దేవేంద్రసుతునిమూర్తికి సంతసిల్లి.
తాను వజ్రాంగి ధరియించి మించి
యానరు వీక్షించి యతఁ డిట్టు లనియె:

బృహన్నల యరదంబు దోల నుత్తరుఁడు
పనుల మరల్ప నేగుట.

‘‘మన మింక గోవుల మఱలించుపనికి
నొనరంగఁ బో నొప్పు నుఱియాడ నేల?
పోదము తే రెక్కి పూన్పు గుఱ్ఱముల
నాదట సిడ మెత్తు’’ మనినఁ గవ్వడియుఁ
వారువంబులఁ దెచ్చి వాని నొప్పఁ గట్టి
తేరున సింహాకృతిధ్వజ మెత్తి

శరశరాసనఖడ్గచక్రాదు లందు
నురవడిగాఁ బెట్టి యున్నచోఁ గదిసి
చెలులు నుత్తరయుఁ జెచ్చెరఁ గ్రీడిఁ జూచి
పలికిరి "మీ రింకఁ బరుల నిర్జించి
వచ్చునప్పుడు మీరు వారివస్త్రములు
తెచ్చి మాబొమ్మపొత్తికల కీవలయు"
అనుటయు వారి కిట్లనియె నర్జునుఁడు
"వినుఁ డుత్తరుఁడు శత్రువితతి నిర్జించి
యమరారఁ జీరల నపుడు కైకొనుచుఁ
గ్రమ మొప్పఁ దెచ్చుట కడిఁదియే నాకు?
పౌనర నన్నడిగినఁ బొల్లు పోరాదు,
వినుతి సేయఁగఁ దెత్తు వివిధాంబరములు"
అనుచుఁ బంతము లాడి యరదంబు నెక్కి
యనువుగాఁ బగ్గంబు లాయత్తపఱచె
ఉత్తరుండును గోవు లాగిఁ బట్టువడ్డ
నెత్తంబు గోపాలనికరంబు నడిగి
వారు చూపినత్రోవ వదలక పోవఁ
దేరెక్కి కదలిన ధృతిఁ జౌరు లపుడు
ముత్తెపుసేసలు ముద మొప్పఁ జల్లి
యుతను దీవించి రోలి నంగనలును.

నరుఁ జూచి పలికిరి "నాఁడర్జునునకు
నరు దారఁగాను బృహన్నల రథము
నేరీతి నడపి గెల్పించితి విపుడు
నారీతి గెలిపింపు మధిపనందనుని."
అని పౌరు లాడుమాటాలించి విరట
తనయుఁ డప్పట్టణద్వారంబు వెడలి
విజయునేర్పున వాయువేగమై పోవు
నిజరథగతులు వర్ణించి మెచ్చుచును
భీమపిశాచగర్భితమైనరుద్ర
భూమిఁ జేరఁగఁ బోయి పోయి దవ్వులను

ఉత్తరుఁడు కౌరవసేనం గని భయ మంది
బృహన్నలను రథము మరల్ప వేఁడుట.

వీక్షింపఁ గురురాజువిపుల సైన్యంబు
నక్షీణగజయూథమై యున్నదాని
బహురత్నములు గూర్చి పఱచినయట్లు
బహువర్ణధూళి నభ్రముఁ గప్పుదాని
ఫణితాళసింహాదిపటుకేతనములఁ
బ్రణుతింప మిక్కిలి భాసిల్లుదానిఁ
గుంభసంభవుఁడు దోకొని పోవు చునికిఁ
గుంభిని నొకదిక్కు గ్రుంగించుదాని

భావించి నిస్సాణపటలంబుచేత
గోవులరొదచేత ఘోషితం బగుచు
నలుగుల మెఱుఁగుల నఖిలదిక్తటులఁ
గలిగి మేఘమువోలెఁ గర మొప్పుదానిఁ
గని యెంతయును భీతిఁ గంపించి మఱియుఁ
దనువెల్లఁ బులకింప ధైర్యంబు డించి
వెఱపింపఁగాఁ బోయి వెఱచినయట్లు
పిఱికి యై నరుఁ జూచి ప్రియ మొప్పఁ బలికె
"రథముఁ బో నీకు సారథి నిల్పు నిల్పు;
పృథివిలోఁ గురుసేన భేదింప వశమె?
వాఁడె కౌరవభర్త వాఁడె భీష్ముండు
వాఁడె యశ్వత్థామ వాఁడె ద్రోణుండు.
అతఁడు కృపాచార్యుఁ డతఁడు కర్ణుండు
చతురులు వీ రెల్ల సంగ్రామమునను.
తగరును గొండయుఁ దాఁకె నన్నట్లు
తగ వేది వీరితోఁ దాఁక నోపుదునె?
బాలుండ నొక్కండఁ బ్రౌఢులు వారు
వేలసంఖ్యల మీఱి వెలయు చున్నారు.
వీరి మార్కొన నేల విరిగి పో నేల?
ఈరీతి నెఱుఁగక యేను వచ్చితిని;

మరల కుండుట గాదు మరలింపు తేరు.
తిర మొప్పఁ బ్రాణంబు తీపన వినవె?"
అనినఁ గవ్వడి మందహాసంబు చేసి
గొనకొని తా రాచకొడుకున కనియె:
"ఈసైన్యములమీఁద నే నేల పోదు?
ఆసమీపంబున నదె చూడు పసులు;
పరికింప నచ్చోటఁ బన లేదు సేన,
పరువడి నటఁ బోయి పసులఁ బట్టెదము.
పౌరులు దీవింపఁ బణఁతు లుప్పొంగఁ
దే రెక్కి పసుల కే తెంచితి విపుడు
మొనకు భీతిల్లుచు మున్గతఁ దిరిగి
చనిన నాడిక గాదె జగతిలోపలను?"
అనినగాండివికి ని ట్లనియె నుత్తరుఁడు
"మనుజు లాడిన నేమి మాన్పంగఁ దరమె;
మును సముద్రము మూయ మూకుడు గలదె?
విను మేను గోవుల విడిపింపఁ జాల;
పరరాష్ట్రముల నైనఁ బసులకుఁ బసుల
నిర వొప్ప సాధింతు, నివి యేల నాకు?"
అనిన నుత్తరుతోడ నాక్రీడి పలికె
"మనసు జాఱఁగ నీక మఱి వెలఁ బోక

ధీరత నిల్చి యుద్వృత్తి నేమఱక
భేరిభాంకృతి విని బెదరి లోఁ బడక
రణము గెల్చినఁ గాక రాజసూనులకు
గణుతింప నూరక కలుగునే కీర్తి?"
అనిన భూమిజయుండు నమరేంద్రపుత్రుఁ
గనుఁగొని పల్కె నంగము చంచలింప
"జనపాలకుఁడు నిన్న సకలసైన్యములు
గొనిపోయె రిపురాజకోటి నిర్జింప.
మనకుఁ దో డెవ్వరు, మనలావు లెంత!
మనకుఁ గర్ణుఁడ చాలు మనలావు గలఁప!
జను లెల్ల నవ్వ నశక్తజృంభణము
మనకుఁ జేయఁగ నేల? మరలు మీ" వనినఁ
బలికె నర్జునుఁ డంతఁ "బసులు రా కున్న
వల నొప్ప మరలనివ్రతము నావ్రతము.
కురురాజు గానిమ్ము గురుఁడు గానిమ్ము
సురరాజు గానిమ్ము సొరిదిఁ దాఁకుదము.
సైరంధ్రి ననుఁ బిల్చి సారథ్యమునకుఁ
బ్రారంభ మొనరించి ప్రార్థించె మొదల;
అది గాక గెల్చి ర మ్మని పౌరజనులు
ముదముతోఁ జల్లిరి ముత్యాలసేస;

లే నేల మరలుదు? నీవుఁ బో వలదు.
పూని గోవులు రాక పోరాదు - మనకు"
అనుచు వాసవపుత్త్రుఁ డరదంబు గడపఁ
దను దానె బెదరి యుత్తరకుమారుండు

బృహన్నల రథంబు మరల్పమికిఁ గలంగి
యుత్తరుఁడు తేరు డిగి పాఱుట.

"అగుఁ దేరకాఁడ వే మనిన ది క్కేది,
తగువాఁడవే చూడ దాయ వై తివుడు.
పసు లేల, నీ వేల, పలుకు లే" లనుచు
వసుధకుఁ గుప్పించి వాసిఁ బో విడిచి
తల వీడ మొల వీడఁ దనమోము వాడఁ
గలయ సేనలు చూడఁ గడునోడి పాఱె.
అంత నర్జునుఁ డాత్మ నతఁడు పాఱుటయు
నెంతయుఁ జింతించి యెలమిఁ బగ్గములు
నొగలతో ముడిచి తానును డిగ్గ నుఱికి
తగ నుత్తరుని వెంటఁ దవిలి పోవుటయుఁ
గురుసేనలోపలఁ గొంద ఱర్జునునిఁ
బరికించి యాజానుబాహు లౌటయును
గమనలక్షణమును గర్వ రేఖయును
సమరసన్నాహంబుఁ జర్చించి యపుడు

మహిం మాత్స్యగోవుల మరలింపఁ గలను.
సహజవిక్రమ నీవు చాటుగా నుండు”
మని బుద్ధిగాఁ జెప్ప నతఁ డెన్నిగతుల
ననుమతింపక యున్న నమరేంద్రసుతుఁడు
“సారథి వై యుండు చాలు నా” కనుచుఁ
దేరిపై నుత్తరుఁ దెఱఁ గొప్ప నునిచి.
తానును రథికుచందమునఁ దే రెక్కి
సేన చూడఁగ జమ్మిఁ జేరంగఁ బోయి
యందు నిక్షేపించినట్టికైదువుల
నందుటకును రథ మచ్చోట నిలిపె.
గురుఁ డంత నరుకాంతి గుఱుతుగా నెఱిఁగి
సురనదీసుతుఁ జూచి సొరిది ని ట్లనియె:
“కౌరవసేనలోఁ గలయు నుత్పాత
కారణంబులు తోఁచెఁ గంటి రే మీరు:
దినమణి రుచిఁ దాసె దిగ్ధూమ మెసఁగె
ఘనకేతువు ల్గూలె, కరు లెల్లఁ దూలె
వాపురంబులు క్రొమ్మొగ్గె, వసుధ గ్రక్కదలె
వావిరి గోమాయువర్గంబు లఱచె”
అని చెప్పి మఱి యతం డగ్రజునుం డగుట
మనసులో నెఱిఁగి తా మఱువెట్టి పలికె:

"ఎవ్వఁడొకో వీఁడు హితబుద్ధి మఱచి
క్రొవ్వునఁ దలసూపెఁ గురుసేనయెదుట?
నరుఁ డన రాదు నానావిధంబులను
సురరాజుఁ బోలుభాసురమూర్తి యితఁడు.
తొడరి కౌరవసేనతోడ మార్కొనిన
జడియక విపినంబు శరణంబు కాదె!"
అనుటయు భీష్ముఁ డయ్యర్థంబుఁ దెలిసి
యను వొప్పఁ బలికె ద్రోణాచార్యుతోడ
"ఎడపక రిపుకోటి కెడ మైనతావుఁ
గడచి వచ్చితి మింకఁ గలకలం బేల?
ఒక్కఁడు రానిమ్ము యుద్ధంబు సేయఁ
బెక్కురీతుల సేన పెరిఁగి రా నిమ్ము.
అమితసత్త్వముఁ జూప నను వైనవేళ
సమరంబు సేయుఁడు, శంకింప నేల?"
అనిన ద్రోణాచార్యుఁ డాత్మలోఁ బాండు
తనయులసమయంబు దాఁటెఁ బొమ్మనుచు
నానందమును బొంది యడ్డంబు లేక
సేనలఁ గలయ వీక్షించి యిట్లనియె:

తమపై వచ్చువాఁ డర్జునుఁ డని ద్రోణుఁడు
కురువీరులకుం దెలుపుట.

"అదె వచ్చెఁ బులివలె నమరేంద్రసుతుఁడు
కదుపుల మరలింపఁ గలఁ డింక నితఁడు.
ఎక్కటిపోరాట నీశు నొప్పించెఁ
దక్కినవా రెంత ధర నర్జునునకు?
ఆఁకలి గొనినసింహము సామజముల
మూఁకపై లంఘింప మోదించినట్లు
వనవాసమున నున్నవంత యంతయును
మనమీఁదఁ బుచ్చక మానునే యితఁడు!
కౌరవసేనలో గాండివిఁ దాఁకు
ధీరుఁ డొక్కఁడు లేఁడు తివిరి చూచినను"
అనుటయు రవిసూనుఁ డాగ్రహం బెత్తి
కనుఁగొని చాపశిక్షకున కిట్లనియె:
"భళిర పాండవపక్షపాతంబుచేతఁ
బలుమాఱు నీ విట్లు పలవరించెదవు
ముక్కక నిజము నిష్ఠూరంబు గాఁగ
నొక్కకందువ గారె నోగి నీవు వారు!
నీ విట్లు ప్రేలిన నిఖిలసేనలకు
భావంబులోపల భయము పుట్టించు.

పెద్దల మిమ్ముఁ గోపింపంగ రాదు;
తద్దయు వివరింతుఁ దగవు దప్పకుఁడు.
అర్జునుఁ బట్టి నే నాహవక్షోణి
నిర్జింపఁగాఁ జూచి నీవె మెచ్చెదవు.''
అనినఁ గౌరవనాథుఁ డర్థి ని ట్లనియె:
''వినుఁ డర్జునుఁడె యైన వేయు నేమిటికి
భావింప మనదృష్టిపథమునఁ బడుటఁ
బోవు నింతియ కాక పోసఁగఁ గానలకు.
కాక వే ఱొకఁ డైన ఘనబాణతతులఁ
బ్రాకటంబుగ నేసి పాఱఁ దోలెదము.''
అనినయామాటల కానేన లెల్ల
మనసులోపలను సమ్మతి సేయ నంత
నంచితశక్తి న ట్లరదంబు నిల్పఁ
బంచి యుత్తరుఁ జూచి పార్థుఁ డి ట్లనియె:
''ఎలమితోఁ బాండవు లీజమ్మిమీఁద
నెలవుగాఁ దమశస్త్రనికరంబు లిడిరి.
అందులో గాండివం బవసరం బిపుడు
పొందుగా నిటు తెమ్ము భూనాథతనయ.
ఈవిండ్లు కుఱుచలౌ నేలీల నేయ
లావునఁ బస లేదు లఘువు లెంతయును.

కరుల మైమరువులు ఖండించునపుడు
శరము లీవిండ్లను సంధింప రాదు.
కైదువుపస లేనికయ్యంబు గలదె?
ఆదటనాచేతి కది కాని కాదు.
ఇమ్మహీరుహ మెక్కి యీవు గాండివము
నెమ్మితోఁ దిగిచి యన్నియుఁ దొల్లిటట్ల
కట్టి ర” మ్మని శవాకార మై యున్న
కట్టఁ జూపినఁ జూచి కనలి యుత్తరుఁడు
“అది యేమి పీనుఁగు నంటికొ మ్మంటి
మది నింత యెఱుఁగవే మాచరిత్రంబు?
ఎక్కసక్కెములచే నే నిట్లు నీకుఁ
జిక్కితి నని వెట్టి చేయఁ జూచెదవో?
మనసులో నెంచవు మర్యాద కొంత,
సునిశితాస్త్రము లంచుఁ జూపితి శవము!
తెలియఁ జాలవు నీవు దృష్టిపాటవము.
వలసిన నీమ్రాను వడిగ నీ వెక్కి
యావిల్లు దెచ్చుకొ” మ్మన్నఁ బార్థుండు
భూవల్లభునిపుత్త్రు బోధించి పలికె:
“ప్రజలు ముట్టక యుండఁ బాండునందనులు
నిజకార్ముకము లిట్లు నిలిపిరి గాక

పీనుఁగు గా దిది పృథ్వీశతనయ
పూని నే న టులైనఁ బుత్తునే నిన్ను ?
ఇంక నామాటల కిదియె తార్కాణ
శంకింపకయ పొమ్ము శవ మది కాదు.
వేవేగ నాకు నావిల్లు దె" మ్మనిన
భూవిభుపుత్తు1ిండు భూజంబుఁ బ్రాఁకి
మోపు విచ్చుటయును ముసలనారాచ
చాపగదాఖడ్గచక్రదీధితులు
నెఱి మీఱి మెఱుఁగు లన్నియు నొక్కసారి
మెఱుముకై వడి దృష్టి మిఱుమిట్లు గొలుప
భావించి చూచినఁ బాము లై యున్న
వేవేగ వెఱచి యవ్విరటనందనుఁడు
వెలయ నత్తెఱఁ గెల్ల విజయుచేఁ దెలియఁ
దలకొన్న భీతి యంతయు డిందుపఱచి
తేరిపై నిలు చున్న దేవేంద్రసుతుని
"సారథి" యని పిల్చి చన వొప్పఁ బలికె:
"గ్రహములలోన భాస్కరునిచందమున
బహుచాపములలోన భాసిల్లు నొకటి;
అహిరాజగుణ మైనహరిబాణ మైన
సహజ మై యుండును జగతి దీనికిని!

ఎవ్వ రివ్వారిలో నీవిల్లు దాల్తు
రెవ్వ రెవ్వరు దాల్తు రివి యెల్ల?" ననిన
దివిజేంద్రసుతుఁడు దా నివిరి యాతనికి
వివరింపఁ దొడఁగె నావృత్తాంత మెల్ల:

అర్జునుఁ డుత్తరునకు నాయుధముల
వేర్వేఱ వర్ణించి తెలుపుట.

"తొలుత నీ వడిగినతోరంపువిల్లు
వెలయ గాండివనామవిఖ్యాతి నొప్పు.
తలఁపు గీర్వాణగంధర్వరాక్షసుల
నెఱయ సాధించె దానిం బూని నరుఁడు.
ఇది యుద్ధసాధన మిది సర్వరక్ష
యిదియేడుగడయు నాయింద్రనందనున
కీవింటఁ దొడిగినయిషుపరంపరల
కావల గిరు లైన నడ్డంబు గావు.
నుతశక్తి నిది బ్రహ్మ నూఱువే లేండ్లు
చతురుఁ డై తాల్చి ప్రజాపతి కిచ్చె
నలి నాతఁ డరువదినాల్గువే లేండ్లు
విలసితగతిఁ దాల్చి వృత్రారి కిచ్చె.
ఎలమి వృత్రారియు నెనుబదియేండ్లు
కలయంగ నది తాల్చి కమలారి కిచ్చె.

అతఁ డంత నేనూఱు లబ్దంబు లైన
హితబుద్ధి వరుణున కిచ్చె నావిల్లు.
అతఁడు నూఱేండ్లకు నగ్ని కొప్పించె;
అతఁడుఁ గిరీటికి నది తెచ్చి యిచ్చె.
అరయఁ గ్రీడియు నిది యరువదేనేండ్లు
ధరియింపఁ గలవాఁడు ధాత్రీశతనయ.
కావున నిది దివ్యకల్పితం; బింక
భావింప నితరచాపము లెల్ల వినుము.
వెలయంగ నెంతయు వృషభలాంఛనము
గలవిల్లు పాండవాగ్రజుఁ డొప్పఁ దాల్చు.
ఘనతాళమితియుఁ గర్కటలాంఛనంబు
నొనరినవిల్లు వాయుజుఁ డొప్పఁ దాల్చు.
అనలవర్ణంబు మీనాంకంబుఁ గలుగు
ధను వది నకులుసాధనము యుద్ధమున.
పసుపువర్ణంబును బర్హిలాంఛనము
నెసఁగునాసహదేవుఁ డిలఁ దాల్చువింట.
చదలఁ గ్రొమ్మెఱుఁగులు చల్లు చుండునది
గదఁ జూడు భీముసంగ్రామసాధనము.''
అని చెప్పి మఱియుఁ గాండాదివర్ణనము
లను వొప్పఁ జెప్ప నిట్లనియె నుత్తరుఁడు:

ఉత్తరుఁడు పాండవుల తెఱంగడుగ
నర్జునుఁ డెఱింగించుట.

"అక్కట కౌంతేయు లస్త్రశస్త్రముల
నిక్కడఁ బెట్టి తా రెటు వోయి రొక్కొ!
ఆపాండవులకు మేనల్లుండ నేను,
రేపును మాపు వారికి మేలు తలఁతు.
కాంతి నెంతయు నొప్పి కల్పవృక్షములు
కౌంతేయు లై పుట్టెఁ గానిచో నవని
నాకీర్తిపుష్పంబు లాదానదళము
లాకార్యఫలము లెట్లగు మానవులకు?
ఘనులు వారిప్పు డెక్కడ నున్నవారొ
కినియక నీ వెఱింగినఁ జెప్పవయ్య.
ద్యూతంబు దలఁపెట్టి దుర్యోధనుండు
పాతకం బొనరింపఁ బాడియే తనకు!
దుర్మతివలఁ జిక్కి దుఃఖు లై నాఁడు
ధర్మజుఁ డాకీడు దాఁ దెచ్చుకొనియె!
సకలశాత్రవకోటి సమరాంగణముల
నకలంకగతి నోర్చునతిబాహుసత్త్వ
లలభీమవిజయాదు లకట యెవ్వెడల
నలజడిపా లైరొ? యఖిలభూపాల

వల్లభాదీపికా ప్రథఁ గల్గుకృష్ణ
చెల్లెఁబో తా నెందు సిలుగులం బడునో?
ఏ మని విందునో యేను నీచేత!
ఏమి నీ వెఱిఁగిన నెఱిఁగింపు'' మనిన
నాతనితోడ నిట్లనియె నర్జునుఁడు
''భీతి నొందకు వా రభేద్యవిక్రములు
ప్రీతితోడుతను బం డ్రెండువత్సరము
లాతతవనభూములందు వర్తించి
జను లెఱుంగక యుండ సతితోడఁ గూడి
మనవీట నిపుడు నెమ్మది నున్నవారు.
పరికింపఁ గంకుండు పాండవాగ్రజుఁడు,
వరుస నావలలుండు వాయునందనుఁడు,
మఱఁ బోలువాఁడు దామగ్రంథి నకులుఁ,
డరయఁ దంత్రీపాలుఁ డతనిసోదరుఁడు,
మాలిని పాంచాలి; మఱి నీకు బొంక
నేల? యుత్తర విను మే నర్జునుండ.
మాలినికై కాదె మనభీమసేనుఁ
డాలానఁ గీచకు నణఁచి చొప్పణఁచె.''
అనిన భూమింజయుం డాశ్చర్యజలధి
మునిఁగి తేలాడియు మోదించి పలికె:

"తనర నర్జునునకు దశనామకములు
వినఁబడు నవి నీవు వివరింతువేని
నెమ్మి నప్పుడ కాని నీ వతఁ డగుట
నమ్మఁ బొ" మ్మనుటయు నరుఁ డొప్పఁ బలికె:

అర్జునుఁ డుత్తరునకుఁ దననామంబులు
సకారణంబుగాఁ దెలుపుట.

"కొలఁది నర్జునుఁడు ఫల్గునుఁడు పార్థుండు
చెలఁగి కిరీటియు శ్వేతవాహనుఁడు
వెలయ బీభత్సుండు విజయుండు జిష్ణుఁ
డిల సవ్యసాచియు నీధనంజయుఁడు
నన నివి పదిపేరు లాయర్జునునకు
ననుపమస్థితి నొప్పు" నన నుత్తరుండు
"ఈనామములు వాని కెట్టులు కల్గెఁ
బూని యొండొండఁ జెప్పుము విస్తరించి.
వంతున కిపుడు కవ్వడి నేన య నెద
వింతమాత్రమున నే నెట్లు నమ్ముదును!"
అనిన నించుక నవ్వి యగుఁ గాక యనుచు
వినిపింపఁ దొడఁగె నావిధ మర్జునుండు
"అర్జునవర్ణ మై యమర నాకీర్తి
యర్జుననామధేయము నాకు వచ్చె.

ఉత్తర, ఫల్గుని నుదయింపఁగాను
గ్రొత్తగా దెపుదు ఫల్గునుఁ డండ్రు నన్ను.
పృథ యనుపేరను బృథివి మాతల్లి
ప్రథిత యైనది కానఁ బార్థుండ నేను.
వెసఁ గిరీటము నాకు వేల్పు తేఁ డీయ
వసుధఁ గిరీటి నై వర్తింతు; మఱియుఁ
దలఁప నా తేరున ధవళవాహనము
లలరంగ శ్వేతవాహనుఁ డండ్రు నన్ను.
ప్రథితు లౌరిపుల బీభత్సు గావింపఁ
బృథివిలోపల నన్ను బీభత్సుఁ డండ్రు.
సమరాంగణంబుల శాతాస్త్రతతుల
విమతవీరులఁ గూల్చి విజయుండ నైతి.
కలనిలో ధర్మజుఁ గారించునతనిఁ
జెలఁగి చంపుదుఁ గాన జిష్ణుండ నైతి.
దురములో రెండుచేతుల విల్లు దివియు
సరవిచేతను సవ్యసాచి నాఁ బొలుతు.
మునుమిడి రిపుధనంబులు చూఱఁ గొనఁగ
నను మహీజనులు ధనంజయుం డండ్రు.
ఈపదినామంబు లీవిధంబునను
బ్రాపించె నాకు; ధర్మజుసోదరునకు

నఱిముఱిఁ గల్లల నాడ నేఁటయ్య?
నెఱిఁ ద్రిశుద్ధిగ నమ్ము నే నర్జునుఁడను.
ఖాండవదహనంబు గావించి సురల
దండించునాఁడు నాదర్పంబుఁ జూచి
శ్రీకంఠుఁడును విరించియు వచ్చి మెచ్చి
నాకు నిచ్చిరి కృష్ణనామధేయంబు;
మఱి వచ్చి సుర లెల్ల మంత్రయుక్తముగఁ
దెఱఁ గొప్ప నిచ్చిరి దివ్యాయుధములు.
అవి సాధనములుగా నర్థితో నేను
దివిజేంద్రురథ మెక్కి దివ్యలోకముల
నవిరళసురవైరు లైననివాత
కవచుల గెలిచితిఁ గదనంబునందు.
ఇర వొంద సురగణాహితులు హిరణ్య
పురనివాసకు లైనభూరిదానవులఁ
దెఱఁ గొప్ప భాగీరథీతీరభూమి
నఱువదివేవుర నందంద చంపి
నప్పుడు ప్రత్యక్ష మై కాదె వజ్రి
యొప్పార నిచ్చె నా కొకకిరీటంబు.
దేవసంఘముచేత ధృతిఁ బొందినాఁడ
దేవదత్తం బనుదివ్యశంఖంబు.

మనుజులు నాతోడ మత్సరించినను
ఘనభుజాటోపంబుకలిమిఁ జూపుదును.
గంధర్వపతి మొన్న గాంధారిసుతుని
బంధించి కొనిపోవ బలిమిమైఁ దాఁకి
విడిపించి ప్రచ్చితి వినవె నాలావు?
ఎడపక మఱియు ననేకముల్ గలవు.
నీ వింక వెఱవకు నిఖిలకౌరవుల
నావ లీవలఁ జేసి హతము గావించి
పన్నగధ్వజుమానభంగంబు చేసి
పన్నుగా మరలింతుఁ బసుల నీక్షణమె."

బృహన్నల యర్జునుఁ డౌట నెఱింగి యతని
కుత్తరుఁడు దెరు గడపం బూనుట.

అనిన భూమింజయుఁ డానందబాష్ప
జనితాభిషేకుఁడై శమి డిగ్గ నుఱికి
సవ్యసాచికిఁ జక్కఁ జాఁగిలి మ్రొక్కి
భవ్యాత్ముఁడై లేచి భక్తి నిట్లనియె:
"శ్రీకంఠపదపద్మసేవాధురీణ
ప్రాకటధర్మజప్రాణసంత్రాణ
అర్జున నీవు నన్నాదరించుటకు
నార్జించినాఁడఁ బుణ్యము లనేకములు.

ఏను మీఁ దెఱుఁగక యేమేనిఁ గొన్ని
కానిమాటలు నిన్నుఁ గడవ నాడితిని.
తప్పు లోఁ గొని నన్ను దయసేయు" మనిన
నప్పుడు బీభత్సుఁ డరదంబు డిగ్గి
యతనిఁ గౌఁగిటఁ జేర్చి యాదరించినను
అతఁడును మోదించి యర్థి నిట్లనియె:
"మంచు విచ్చినయట్లు మనసులో నున్న
చంచలత్వము వాసె జయశీల వినుము.
నీ తేరు గడపుదు నెఱి నింద్రు తేరు
మాతలి గడపినమాడ్కిఁ గయ్యమున."
అర్జునుఁ డిట్లను "నఖిలకౌరవుల
నిర్జింతుఁ గయ్యాన నిన్ను గుఱ్ఱములఁ
గాలియు సోఁకఁగాఁ గానివైఖరుల
నోలిఁ గాచెదఁ జూడు ముత్తర యింక
నాలంబులో నీవు నశ్వరత్నములఁ
దోలుము పసుల రాఁ దోలుదు నేను.
అరయ మీఁపను లెన్ని యన్ని యేనుఁగులు
కురురాజు మొనఁ జూఱఁ గొని తెత్తు నీకు."
అనిన భూమింజయుఁ డతని కిట్లనియె:
"విను నీవు చెప్పినవిధమె కావింతు

మఱవక మేనమామవు కాన నీవు
మెఱసి యొండడిగెద మెలఁపుతో నిన్ను
వదలక షండభావం బేల యపుడు
చెదలు పట్టినయట్లు సిద్ధించె నీకు?
చెప్పవే యీమూర్తి శృంగారజలధి
యిప్పుడ నినుఁ బొందె నిది యేమి చోద్య?"
మనుటయు నర్జునుం డమరలోకమునఁ
దనర నుర్వశి మున్ను తన కిచ్చినట్టి
శాపప్రకారంబు సకలంబుఁ జెప్పి
యేపార నృపసూతి కిట్లనె మఱియు
"ఎలమితో నీ వింక నీజమ్మి నెక్కి-
కలయఁ దనుత్రాణకంకటంబులును
గవదొనలును హేమకలితబాణములఁ
దివిరి గాండీవంబుఁ దెమ్ము నా" కనిన
నమ్మహీరుహ మెక్కి యతఁడు గాండీవి
తెమ్మన్నయవి యెల్లఁ దివిచి యాతూణము
కడు నొప్పుతక్కటికైదువు లెల్లఁ
గడఁకఁ దొల్లిటియట్ల కట్టగాఁ గట్టి
జమ్మిపై నిడి డిగ్గి జననాథతనయుఁ
డిమ్ముల నటఁ జూచి యింద్రనందనుఁడు

నస్త్రదేవతలకు నతిభక్తి మ్రొక్కి
శాస్త్రక్రమంబున సంతోషపఱిచి
పురములు సాధింపఁ బోవు చున్నట్టి
పరమేశ్వరుఁడుఁ బోలెఁ బౌరుషంబునను
గోత్రారి యిచ్చినకుండలద్వయముఁ
జిత్ర మైనట్టియుష్ణీషంబుఁ దలఁచి
తప్పక రప్పించి తలచుట్టుఁ జుట్టి
యొప్పారఁ గుండలయుగళంబుఁ బూని
దివ్యాంబరముఁ జేర్చి దిండుగాఁ గట్టి
భవ్యాంగరాగంబు పలుచగా నలఁది
యంకురించుచు నున్న హాసంబుతోడ
నంకిలు ధరఁ గూల నందందు నొక్కె.
అప్పుడు మౌళిపై నయ్యర్జునునకు
నుప్పతిల్లినమాడ్కి నుదయార్కుఁ బోలి
చెన్నార నింద్రుఁ డిచ్చినకిరీటంబు
కన్నులపండు వై కాంతి నొప్పారె.
నరుఁ డంత రథ మెక్కి నానాస్త్రవితతు
లరదంబుపైఁ బెట్టి యతిసంభ్రమమునఁ
గవచశిరస్త్రాణకలితుఁ డై మెఱసి
కవదొనలును బూని గాండీవ మెత్తి

లలి నెక్కు వెట్టి మెల్లన ముష్టిఁ బట్టి
వల నొప్ప వరగుణధ్వని సేయుటయును
జెదరె నంబరవీథి శేషాహి వణఁకె
బెదరెఁ గారవసేన పృథివి యల్లాడె
గిరులు పాతరలాడెఁ గిటి సంచలించె
స్థిర మేది దిర్దిరం దిరిగె లోకములు.
అంతలో మఱియు నయ్యమరేంద్రసుతుఁడు
చింతించె నగ్ని యిచ్చిన కేతనంబు.
అదియు మహోగ్ర మై యఖిలమాయలకుఁ
గుదు రై మహాభూతకోటులు గొల్వ
వానరాకార మై వచ్చి నిల్చుటయు
మానసంబున మోదమానుఁ డై నరుఁడు
చెలువారునుత్తరుసింహ కేతనముఁ
దొలఁగించి ప్లవగకేతువు తేరిమీఁద
నెత్తించునంతలో నే తెంచి దేవ
దత్తంబు దోఁప నెంతయు సంతసిల్లె.
జగతీశసుతుఁడును సన్నద్ధుఁ డగుచు
నొగ లెక్కి హరులమేనులు పెట్ట నిమిరి
పగ్గంబు లాయత్తపఱచుచోఁ నతని
యగ్గలికను జూచి యాక్రీడి పలికె:

« ఆలస్య మెంతయు నయ్యె నిచ్చోట
లే లెమ్ము పసుల మర్లింపఁ బోవలయు.
మొలవుమైఁ దేరు జమ్మికిఁ బ్రదక్షిణము
పొలుపారఁ జేయించి పోవ ని» మ్మనిన
నవనీతతనయుండు నట్ల కావించె.
దివిజేంద్రసుతుఁ డొత్తె దేవదత్తంబు;

నరుఁడు దేవదత్త మొత్త నుత్తరుఁడు
భయభ్రాంతిఁ దూలుట.

ఆమహారవమున నంభోధి గలఁగె,
హేమాద్రిశిఖరంబు లిట్టట్టుఁ బడియె,
అద్రిజ భీతిల్లి హరుఁ గౌఁగలించె,
నిద్ర మేల్కని శౌరి నింగికై చూచె,
బలభేది వెఱచి గీష్పతివంకఁ గాంచె,
లలిఁ బద్మభవుఁడు కాలము నెన్నఁ జొచ్చె,
ఉత్తరుండును మూర్ఛ నొరగెను హరులు
నెత్తిన లేవ లేకిలమీఁదఁ బడియెఁ
బడిన వీక్షించి యాఫల్గునుఁ డంత
గెడప కశ్వముల వాగెలు పట్టి యెత్తి
వెన్నులు చఱచి వేవేగ నూల్కొల్పి
యన్నరేశ్వరపుత్త్రు నర్థితోఁ దెలిపి

యాలింగనము చేసి యందంద పిలిచి
వాలినవికృతభావము చక్కఁ బెట్టి
ప్రియ మొప్పఁ బలికెఁ "గంపింతువే నీవు
భయ మెఱుంగనిమత్స్యపతికుమారుఁడవు?
దురమున శంఖదుందుభినాదములకు
ధరణీశతనయులు తల్లడింపుదురె!
వెఱపరి వై నీవు వెఱతు కా కేమి
తఱమిడి శంఖ మొత్తక మాన రాదు."
అనిన నానరుతోడ నామహీపాల
తనయుఁ డి ట్లనియెను దనువు కంపింప
"భేరినాదము విందుఁ బృథులశంఖములు
పూరింపఁగా విందుఁ బోరిలో నెపుడుఁ
గరిబృంహితధ్వని కర మొప్ప విందు
నరు దయ్యె నిది యిప్పు డవి యట్లు కావు.
కలఁగె గర్భంబును గలఁగెఁ జిత్తంబు
తొలఁగెఁ బ్రాణంబులు తునిసె గుండియలు
నాకు నీకపికేతనంబుఁ జూచినను.
నీకాంతిఁ జూచిన నెఱి నాకు భీతి
విమతవీరుల కింత వెఱవ నీయెడన
క్రమముతో భీతి యగ్గల మయ్యె నిపుడు"

అనిన వాసవపుత్త్రుఁ డాయుత్తరునకు
మనసులోపలిభీతి మాన్పంగ వలసి
చిందంబు మ్రోఁతయు శింజినీరవము
నందంద పరఁగించి యలవాటు చేసె.
అరదంబు వీతెంచునారవంబు విని
గురుఁ డుద్దవిడిఁ బల్కెఁ గురునాథుతోడ:

వచ్చెడువాఁ డర్జునుఁ డని ద్రోణుఁడు
దుర్యోధనునకుఁ దెలుపుట.

"ఇంక సందియ మేల? యింద్రనందనుఁడు
శంకింప కిటు వచ్చె సమరంబు గోరి;
అదె వచ్చె దేవదత్తాభీలరవము.
అదె తోఁచె గాండీవజ్యానినాదములు.
అదె చూడు దేవేంద్రుఁ డతనిలావునకు
మది మెచ్చి యిచ్చినమణికిరీటంబు.
అదె చూడు భూతంబు లతిఘోరభంగిఁ
గదిసి కొల్వఁగ నొప్పెఁ గపికేతనంబు.
కా కున్న నింతభీకరవృత్తి మనకుఁ
జేకొని తోఁచునే చేష్టితంబుగను?
ఇతనితో మార్కొన నిర వైన తెఱఁగు
చతురతఁ గావింపు జననాథ నీవు"

అని చెప్ప మఱియుఁ గృపాచార్య భీష్ముఁ
గనుఁగొని పలికె నక్కులశసంభవుఁడు
"ఇన్ని యుత్పాతంబు లీసేనఁ బుట్టెఁ
జెన్నారఁ గ్రీడికి సిద్ధించు జయము.
విలుకాఁడు గాంఢీవి, విల్లు గాండీవము
తలపోయ నతఁడు యుద్ధము గెల్చు టరుదె?
సేనకు నృపునకు సేమంబు గలుగ
నే నొక్కచందంబు నేర్పఱించెదను.
భూతలాధీశుఁడు మున్నాడి పోవ
నాతనివెంట నొయ్యనఁ బోవుఁ బసులు.
ఈవల మనయోధు లెల్లఁ గల్గఁగను
ఆవచ్చుక్రీడికి నందవు పసులు."
అనవుడు విని కౌరవాధీశ్వరుండు
తనమహారథుల నందఱఁ జూచి పలికె
"ఓహో విచారింప కూరక మీరు
ఆహవంబునకు సన్నాహ చున్నారు.
ఆడికఁ బడి జూద మాడి కౌంతేయు
లోడిననాఁడు తా ముగ్రాటవులను
జరియించి పండ్రెండుసంవత్సరములు
నొరు లెఱుంగక యుండ నొకయేఁడు గడప

నోడఁబడి రిట్టు లయ్యోడఁ బాటుఁ జిక్కఁ
గడపకము న్నేల కాన్పించు నరుఁడు?
ఇప్పు డేమిటఁ దప్పె నెల్లపాండవులు
నెప్పట్టియట్ల పోయెదరు కానలకు.
ఈ తెఱం గంతను నిటవచ్చునపుడు
మీతోడఁ జెప్పితి; మీ రేల పదర?
ఎక్కువతక్కువ లీకాలమునకు
నిక్కంబు భీష్ములు నిర్ణయించెదరు.
వెస రెండుతెఱఁగు లై విరటభూపాలు
పసులఁ బట్టుట యెల్లఁ బాండునందనులఁ
జూడ నింతియు కాదె? చూచితి మితని.
వేడుకఁ గయ్యంబు విజయుతోఁ గల్గఁ
బరికింప మే లయ్యె! పసులఁ బట్టితిమి.
నరుఁ డైన హరుఁ డైన నా కేల వెఱవ?
రా నిమ్ము వచ్చిన రణము సేయుదము.
సేనలతోడ డాసినయట్టిమనము
సరగ జయింతుము సంచలింపకుఁడు.
అరుదెంచె రథయోధుఁ డాయత్తపడుఁడు.
పరికింపఁ బగవాఁడు పాఁతఱం బడిన
కరణి నర్జునుఁ డొంటిగా వచ్చె నేఁడు!

సంతసింతురు కాక; సైన్యంబు బెదర
నింత భూషింతురే యెదు రైనరిపుని?
అనుకూలపవనంబు హరిహేషితములు
మనకుఁ గల్గెను గాన మనము గెల్చెదము.
గురుఁ డిట్లు గాండీవిఁ గొండగాఁ జెప్పఁ
బరఁగఁ బాండవపక్షపాతి గావునను.
నీతిశాస్త్రపుగోష్ఠి నెఱిఁ జేయునపుడు
నాతతశస్త్రవిద్యలు నేర్పునపుడు
ననిచినతమి భోజనము సేయునపుడుఁ
బొనర నిష్టాలాపములు పల్కుఁ గాని
కలశజుఁ డని సేయఁ గలవాఁడు గాఁడు;
తొలఁ గింత మతఁ డేల దురములోపలను?
ఏపార నొకకొంత హితుఁ డయి మనకు
దూపింప మేలు గోరుచు నున్నఁ జాలు"
అనిన నశ్వత్థామ యధిపు నీక్షించి
విను మని మొగమోట విడిచి యిట్లనియె:
"ముసలిబోయల గెల్చి మొదవులఁ బట్టి
వసుధేశ నీ కింత వలదు గర్వింప.
అరుల గెల్చుట లేదు హర్షించి పురికి
నరుగుట లేదు మీఁ దరయఁ గా వలదె?

ధరణీశ చెనఁటిజూదము నేరనట్టి
గురుఁ డేల కృపుఁ డేల కురురాజ నీకు?
అదియును నిఁక నేల? యఖిలపాండవులుఁ
గదలి వత్తురు రాజ్యకాంక్ష నెల్లుండి;
అలనాఁడు శకునితో డైనఁ బాండవుల
గెలిచిన ట్లిప్పుడు గెలుతు కా కేమి!
ఘనతఁ గవ్వడి పాచికలు వేయ రాఁడు
వినుతబాణము లేసి విదళించుఁగాని.
లీల నాచార్యుఁ బల్కినయట్లు కాదు
తొలి తొప్పులాడు దురములోఁ గ్రీడి.
నిలిచి కవ్వడితోడ నీవు మార్కొనఁగ
నెలమిఁ జూచెదఁ గాక యెందుఁ బోయెదను.
అక్కట ప్రియశిష్యుఁ డని ద్రోణుఁ డతని
నొక్కింతఁ బొగడిన నోర్వ లేవైతి!
కిన్నరసురసిద్ధఖేచరు లతని
సన్నుతింతురు మాన్పఁ జాలుదె నీవు?
అదియును గాక ద్రోణాచార్యుఁ డెపుడుఁ
గదనంబు సేయఁడు, కాక చేసినను
దిక్కులు వ్రక్కలౌ ధృతిఁ బట్టపగలఁ
జుక్కలు పొడుచు శేషుఁడు మూర్ఛపోవు.

అది యెన్న నేల మీ రందఱుఁ గూడి
పదిల మై యరుదెంచి పసులఁ బట్టినను
ఎలమితో నుత్తరుఁ డిట వచ్చె నేని
తలపడి పోరాడఁ దగుఁ గాక తప్పి
కౌంతేయుఁ డరుదెంచెఁ గడఁగి యవ్వీరు
చేంతఁ జేరెడివానిఁ జెప్ప మీ" వనిన

కర్ణుఁ డర్జునునిఁ దా గెలిచెద నని
వీరాలాపంబు లాడుట.

నంతయు విని కర్ణుఁ డతని కిట్లనియె:
"కౌంతేయు నిర్జింపఁగా నేను గలను.
పనుపడి మీ రేల పాండునందనులఁ
గనుఁగొన నిటు వచ్చి కౌంతేయుఁ జూచి
చలమునఁ బోరాడ సన్నాహపడక
పలుమాఱు నావీరుఁ బ్రస్తుతించెదరు?
ప్రకటింప మీరలు పాలుపోఁ దొలఁగుఁ
డోకని కొక్కఁడ చాలు యుద్ధంబు సేయ.
కవ్వడిచాపంబుఁ గపికేతనంబు
దవ్వులఁ ద్రుంచి యాతని నాక్రమించి
సప్తాంబురాసులు సప్తశైలములు
సప్తలోకంబులు సంచలింపఁగను

గోపాగ్ని బాణాగ్నిఁ గూడ నైకొలిపి
చూపెద నాలావు చూడుఁడు మీరు.
అదె క్రీడి పదిమూడుహాయనంబులకు
వదలక తనదుసత్త్వము జోక చేసి
ధృతిఁ బూఁచిపట్టి యేతెంచె; మీ రతని
జితలోకుఁ డని పెద్ద సేయు చున్నారు!
ఏనును బంటనే హితబుద్ధితోడ
నీనరేశ్వరుసొమ్ము హితముగాఁ గుడిచి
గాండీవి గెలిచినఁ గాని కా దనుచు
నుండితి నున్నందు కొదవెఁ గయ్యంబు.
అతనినాలోనియాయధికత్వ మెఱుఁగ
ధృతిఁ గోరుజనులసందేహంబు మాన్ప
రమణతో జమదగ్నిరాముచేఁ గన్న
యమితశస్త్రాస్త్రవిద్యలు విస్తరింతు.
మొగి సారసత్త్వాలమొన వాడిసేయు
పగిది నర్జును నంత ప్రస్తుతింపకుఁడు.
పైపచారమె కాని పౌరుషంబునను
ఆపార్థుఁ డేమికార్యము సేయ నోపు!
గోవులవెంటఁ జేకొని మీరుఁ గూడఁ
బోవుట మేలు గుంపులు గూడి" యనినఁ

గలకిల మని నవ్వి కృపుఁ డొప్పఁ బలికెఁ
"బలుక నేర్తువు కర్ణ బహుభాషణములు!
పలుకుమాత్రమె కాక పలికినయంత
నిల వారు చేసిన నే మేమి గాదు!
కవ్వడి నిర్జింపఁ గలవు నీ వనిన
నెవ్వఁడు నమ్ము? ము న్నెఱుఁగమే నిన్ను?
గాండీవి ద్రౌపదిఁ గైకొన్న నలిగి
మెం డైననృపు లెల్ల మెఱసి పోరాడి
యతనిచే గజిబిజి యై పోవునాఁడు
జతన మై నీవు నచ్చటఁ బాఱ లేదె?
పతిభక్తి గల వని పరికింతుమేని
పతి మొన్న గంధర్వపతిచేతఁ జిక్కఁ
జేయ వైతివి లావు! చేతులు కూరఁ
గోయఁ బోయెనె కర్ణ? కోపింప వలదు.
ఒంటి వచ్చినక్రీడి నోర్తు నే నంటి
వొంటి మైఁ గాలకేయులఁ జంపె నితఁడు;
ఇంద్రాదిదివిజుల నితఁ డొంటి గెలిచెఁ
జంద్రశేఖరు నొంటి సాధించె నితఁడు
చూచినవా రెల్లఁ జోద్యంబు నొంద
నేచి యాదవసేన నితఁ డొంటి గెలిచె.

ఎలమి కౌరవసేన నెన్నిక కెక్కఁ
గలుగునీ వెన్నఁ డేకయ్యంబులోన
నిలిచి గెల్చితి వది నెఱయంగఁ దెలుపు.
పలుక నేర్తువు చాల! పలుకు లిం కేల?
పోటుమాటలె కాక బుద్ధిమార్గంబు
సూటి నీ వెఱుఁగవు; సూక్ష్మంబుగాను
వివరింతు మది నీకు వినుము; కౌంతేయు
లవనిఁ బ్రఖ్యాతసమర్థు లందఱును.
చెచ్చెర నంభోధిఁ జేయీఁత నీఁద
వచ్చిన వచ్చు; విద్వత్తు గెల్వఁగను
గావు పో ద్రోణుండు గాంగేయుఁ డేను
నీవు నీతమ్ముఁడు నృపుఁడు సైన్యములుఁ
గూడి తాఁకినఁ గాని; ఘోరాహవమునఁ
గ్రీడితో నొంటిఁ దాఁకిన నోర్వ వశమె?"
అనుటయు రాధేయుఁ డాజ్యంబు పడిన
యనలంబుక్రియ మండి యతని కిట్లనియె:
"అగు నీవు పగతుర నతిభక్తితోడఁ
బొగడ నేర్చుట యెల్ల భూనాథుఁ డెఱిఁగె!
ఎఱిఁగియే నినుఁ బిల్వఁ; డిదె మిన్ను పడిన
నఱచేతు లిడెడుసాహసు లున్నవారు.

చేకొని మాఱాజుసిరి యడ్డ మింత
లేక భోగించితి లీలతో నీవు
కుడిచినదానికిఁ గొడవ లే దెందు.
వెడలు మిచ్చటఁ బాసి వివిధయజ్ఞములఁ
గుడిచి నెమ్మది నుండు; ఘోరాజి యేల
బడుగుబాఁపడ నీకు; పతి సంతసింప
నేను వి ల్లందిన నింద్రాదిసురల
నైనను విదళింతు నాపార్థుఁ డెంత?''
అనిన భీష్మాచార్యు లతనిపాటలకు
మనసునఁ గోపించి మనుజేంద్రుఁ జూచి
''కలశజుపలు కొప్పు గలశజాత్మజుని
పలుకును మేలు తప్పక పల్కెఁ గృపుఁడు.
కర్ణుండు తనదుసంగ్రామపాటవము
నిర్ణయించును గాక నృపునికట్టెదుటఁ
దగిలి కోపించి పెద్దల ధిక్కరింపఁ
దగదు; నీకును వినఁ దగదు; వారింపు;
మేకాంగిఁ దలపడి యెలమి రర్జునుని
భీకరాకృతిఁ బేర్చు బిరుదువాఁ డైన
నరనాథుచేత మన్ననఁ బొందుఁ గాక.
పరనింద లాడి పాపముఁ బొంద నేల!

కొనియాడుదురు శత్రుకోటుల నైనఁ
బని మోఁచు నపుడు దోర్బలము చూపుదురు
ధరణిఁ బెద్దలజాడ తా నేమి యెఱుఁగు?
సురలనై వేద్యంబు శునక మే మెఱుఁగు?''
అని చెప్పి గాంగేయుఁ ''డాచార్యుఁ గృపుని
ఘను ద్రోణనందనుఁ గడు వేఁడికొనుము.
పని చాలఁ గలదు బీభత్సుఁ డే తెంచె?
మనలోన మన కింత మాత్సరం బేల?
కడుకొని యన్యోన్యకలహంబు మాని
తొడఁగుఁడు బీభత్సు దురములో గెల్వ''
అని చెప్పి గాంగేయుఁ డారాజుతోడఁ
''బనివడి ద్రోణునిఁ బ్రార్థింపు మిపుడు
విను మాతఁ డెఱుఁగు నావివ్వచ్ఛులావు''
అనిన దుర్యోధనుం డపుడు తా లేచి
యలభీష్ముఁడును గర్ణుఁ డనుగమింపఁగను
గలశజుఁ బ్రార్థింపఁ గనలు పో విడిచి
పరివేషనిర్ముక్తపద్మారిఁ బోలి
వరదుఁ డై ద్రోణుండు వల నొప్పఁ బలికె:
''మానెఁ గోపము భీష్మమాట విన్నపుడె.
ఏ నేల కోపింతు నిట్టికార్యమున?

క్షితినాథు నిదె సురక్షితము సేయుదుము.
ప్రతివీరులకు బాహుజలము సూపుదుము.
జననాథుఁ డనెఁ "గ్రీడి సమయంబు దాఁటె
నని కిట్లు వచ్చుట' నది విచారించి
భీష్ముఁ డుత్తర మిచ్చుఁ బ్రియముతో" ననుడు
భీష్ముఁ డి ట్లని పల్కెఁ బృథివీశుఁ జూచి

సమయము గడచియె నరుఁడు పొడసూపె నని
భీష్ముఁడు నిర్ణయించుట.

"అధికమాసములు రెండనయేట వచ్చె
నధిప పాండవు లిట్టు లవి యెల్లఁ జూచి
పుడమి మెచ్చఁగఁ బదినూఁడవయేఁడు
కడమ నిండించిరి; కాన రే మీరు?
సమయంబు నిండక చను దెంచుపనులు
యమసూతి సేయింపఁ డనుజులచేత.
ఆపాటివా రైన నాస్థానసీమ
ద్రౌపది మీ రట్లు తల పట్టి యీడ్వఁ
గనియు నూరక యుంట కటుధర్మపాశ
మునకు లోఁబడి కాలమును వేచి యుంట
కని యేల తెలియ? రయ్యాభీలశౌర్య
ధనులు నాఁడె తఱియఁ దాఁకిన మిమ్ము

సరిముఱి జక్కాఁడి యమలోకమునకుఁ
దెరువు సూపర? మీకుఁ దెలివి డీల్వడియె!
వా రింత కాలంబు వనభూమిఁ దిరిగి
వారక యజ్ఞాతవాసకష్టములు
తాలిమి నోరిచి తమపూన్కి నెఱపి
వాలినకోపాగ్నిఁ బజ్వరిల్లఁగను
గ్రూరులై యున్నారు కురువార మనఁగ.
ఏరీతిఁ జూచిన నెద భీతి యడరు
నటు చూడు మర్జునుఁ డరుదెంచినాఁడు.
నిటలాక్షు గెలిచినెఱవాది వాఁడు.
ఇంతశూరుని గెల్తు నిప్పు డంచుఁ బలికి
పంత మాడఁగ రాదు; భాగ్యంబుకొలఁది.
కా దని యని సేయఁగాఁ జెప్పినట్లు
రాదు మేలును గీడు రణశూరునకును.
సంధి సేయుట మేలు సకలభాగ్యములు
సంధించుఁ గా కింత చల మేల మనకు?"

సంధి పొసంగ దని దుర్యోధనుఁడు
భీష్మునకుఁ దెలుపుట.

అనిన సుయోధనుం డాభీష్ముతోడ
"వినవయ్య నే నెన్నివిధముల నైన

నలవడఁ గ్రీడితో నడరి యుద్ధంబు
చెలువారఁ జేయుదు సిద్ధ మీపలుకు.
సంధిమాటలు మీరు సంధింప రాదు
బంధుత్వమున రాజ్యభాగ మే నీను.
పోరాడఁ దొడఁగుదు భుజశక్తి" ననియె.
ఆరీతి నృపుఁ డాడ నాచార్యుఁ డనియె:
"రాజునకంటె సంగ్రామకార్యంబు
భూజనులకు నేరఁ బోల దెట్లయిన.
ఏ నెఱింగినయంత నేర్పరించెదను.
సేన నాలవపాలు సేవింప నృపుఁడు
మున్నాడి పోయిన మొగి నంత సేన
వెన్నాడుకదుపుల వెసఁ జుట్టి చనును.
తక్కటిసగముతోఁ దగ మోహరించి
యుక్కునైఁ జన నొప్పు నొయ్యన మనకు.
వెనుకొనిపోవ నవ్విభుఁడు గోవులను
మనభూమిఁ జొచ్చు నెమ్మది నీక్షణంబె.
నానాముఖంబుల నరుఁడు వచ్చినను
సేనకు నడ్డంబు సేయు మే ల" నిన
నెలమితోఁ గర్ణుండు "నిదియె మే" లనియె.
అలద్రోణుమాటల నాలించి భీష్ముఁ

డెలనవ్వు చెలువార నీకొని యపుడు
బలము భూవిభునకు భాగించి యిచ్చి
వెనుక నుజ్జ్వలసైన్యవిసరంబు మెఱయ
మొన సేయ నపుడు నిమ్ములఁ ద్రోణు నడుమఁ
దలకొని కర్ణు ముందఱఁ గృపాచార్యు
వలపలితల నిల్పి వరుస నెల్లెడల
శకునివికర్ణదుశ్శాసనద్రౌణి
శుకబాహ్లికాదు లాశూరపుంగవులఁ
దనర నిల్వఁగఁ బంచి తా నందఱకును
వెనుక నై సన్నాహవిభవంబు మెఱసి
పరికింపఁ దగు తాటిపడగ యెత్తించి
యరుగుచు నుండెఁ దూర్యములు ఘోషింప.
అంత నింద్రుఁడు దివ్య మగువిమానమున
నంతరిక్షంబున నరుదెంచి నిల్చి
సరసు లైనసురలు ఖేచరులుఁ గిన్నరులు
గరుడగంధర్వులుఁ గర మర్థిఁ గొలువఁ
జక్రిప్రాపునఁ గాలచక్రంబు గెలుచు
చక్రవర్తులు రాజచక్రంబుఁ గొలువ
"నీమహారథులతో నితఁ డొంటిఁ దాఁకి
యేమి సేయఁగ నోపు నిది చోద్య" మనుచు

వీక్షించు చున్నచో విజయుఁ డాకీతి
నక్షీణశత్రుసైన్యములతోఁ గదిసి
కొలఁది మీఱినదైత్యకోటులమీఁద
బలశీలుఁ డై పోవుబలభేది పోలె
తడయక బహుపయోధరపంక్తిమీఁద
వడిఁ గూడి చనుగంధవాహుండు పోలె
నతిధీరగాండివజ్యానినాదంబు
ప్రతిపక్షులకుఁ బ్రాణభయము సేయఁగను
దరమిడి దేవదత్తంబు పూరించి
కురుసేనగుండెలు గుద్దలించుచును
కపికేతనజ్వాల కబళించి విడువ
నృపులచిత్తంబులు నీఱు చేయుచును
"ఏయుఁడు చూడఁగా నిటు రాక పోఁడు
వేయుఁ" డంచును గురువీరులార్వఁగను
మెఱసినమింటఁ బ్రామ్రోఁగుచందమున
మిఱుమిట్లు గొనఁ దేరు మెఱసి యేతేర
దళములఁ గ్రోశమాత్రంబులోఁ గూడి
తల యెత్తి చూచి యుత్తరున కిట్లనియెః

అర్జునుఁ డుత్తరునకుఁ గురుసేన
యున్నవిధంబుఁ దెలుపుట.

"వెరవక కురుసేన వే చూడు; మొనలు
తిరిగి పోయెడిఁ జూడు తెఱఁగులై; చూడు
మీవలిపౌఁజు; ని దెంతయు ఘనము.
భావింప నడుమ నల్పంబు సైన్యంబు.
ముందఱ నల్లదె మొత్త మౌసేన.
ఎం దున్న వాఁడొకో యీకురువిభుండు?
తడయక యతనిఁ జూతముగాని తేరు
నడపుదు కాని సేనకు దాపలింపు
మజుఁ డడ్డ మగునేని హరుఁ డడ్డ మైన
నిజబాణతతులచే నిర్జింతు విడువ.
అంతట సేనక న్నది కన్నవంక
నెంతయుఁ బస చెడు నితఁడు చిక్కినను.
ఈ పౌఁజులోపల నితఁడు లేకున్న
వే పోయి గోవుల విడిపింప వచ్చు.
అక్కడ రొద సేయ నపుడైన దాయ
చిక్కక పో" డంచుఁ జిత్రంబుగాను
నరుఁడు చెప్పినయంత నరనాథసుతుఁడు
నరదంబు నడపింప నపుడు సైన్యముల

సరస కేతెంచి యాసర్ప కేతనునిఁ
బరికించి యందులోపలఁ గానరాక
నరుఁ డట్టిసేనకు నడును ముందఱను
వరుసతో దక్షిణవామభాగములఁ
వెనుకదిక్కున నున్నవీరవర్గముల
నొనరంగ భూమింజయున కేర్పరించి
“తొలఁగె నిచ్చట లేఁడు దుర్యోధనుండు;
తలఁగి పసులవెంటఁ దాఁ బోవ నోపు.
లీల యొప్పఁగ రాజు లేనికయ్యంబు
నేల సేయఁగ మన కీసేనతోడ?
పొద పొద మనతేరుఁ బోవ ని” మ్మనుచుఁ
బదిలంబుగాఁ జెప్పి బలభేదిసుతుఁడు
కృతభక్తి ద్రోణాగాంగేయులకృపుల
శ్రుతిపాదయుగళంబు సోఁక రెండేసి
బాణంబు లేసినఁ బరిజనంబులకు
ద్రోణుఁ డర్జునుఁ జూపి తోడరి యి ట్లనియె:
“ఒనరుగాండివము విద్యుల్లీలఁ గ్రాల
వనచరధ్వజరావపటుగర్జ లోలయు
జలదాకృతిం దాల్చి జవ మొప్ప వచ్చు
నలరథంబునఁ జూడుఁ డలరారు నదిగోఁ

బర్జన్యునోజ దోర్బలసాంద్రుఁ డగుచు
నర్జునుం; డిదె చూడుఁ డస్త్రయుగ్మముల
నాపాదములమోలి నయమొప్ప నేసి
యేపునఁ బూజించె; నింతయే కాక
సోఁకి సోఁకములుగా శ్రుతిపుటంబులకు
సోఁకునట్లుగ నాదుసుఖ మెల్ల నడుగు
పగిది బాణము లేసె బహునీతివిదుఁడు!
పగవారిచేఁతలఁ బ్రాభవం బెడలి
యిడుమలఁ బడి నొచ్చి యింతకాలంబు
నడవి నుండినశోక మంతయుం బుచ్చి
సమయంబు వెస నిశాసమయంబుభంగి
నమరంగ నెరపి మార్తాండుఁ డై కదిసెఁ
నని గురుం డాడంగ నాభీష్మకృపులు
మనసున నరుఁ డేయుమార్గణంబులను
దమకు మ్రొక్కుట గాఁగఁ దమచేమ మరయు
క్రముముగా నెఱిఁగి తా మలరంగఁ గ్రీడి
తక్కినవారికి దర్శింప రాక
స్రుక్కక పసు లేగుచోటుకై పోవ
నాతనిఁ జూచి దివ్యాపగాసుతుఁడు
నాతతకురుసేన కర్థి నిట్లనియె:

నరుఁ బెద్దకాలంబునకుఁ జూడఁ గల్గె
సరసుఁ డీతఁడె! వీనిసౌజన్య మొప్పు!
ఇన్నరు వీక్షింప నింద్రుండు వేయు
గన్నులు ధరియించెఁ గానోపు మొదల!
కలఁగక మనపైఁజూకై వచ్చి తాను
తోఁబుతను దన తేరుఁ దోలఁగఁ దోలించె.
బలములఁ గ్రేఁగంటఁ బరఁగఁ జూచుచును
వెలయఁ గౌరవరాజు వెదకు చున్నాఁడు.
చిక్కినఁ గరిరాజు సింహంబుచేతఁ
జిక్కినచందంబు సిద్ధించుఁ బతికి.
మనకు నాతనికిని మధ్యంబు క్రీడి
చన రాజు విడిపింపఁ జనునొక్కొ మనకు?
అతని కొక్కటి యైన నఖిలంబుఁ దప్పు
నితరకార్యము లేల యీగోవు లేల?"
అని సేనలును దాను నతులవేగమున
జననాథు మొనఁ జేరఁ జనుదెంచునంత
మొదవుల వెనుక నిమ్ములఁ బోవుప్రజయు
నదె వచ్చె నరుఁ డని యందంద పఱవ
గోవుల నరుఁ డంతఁ గోశద్వయమున
వేవేగఁ గూడి భూవిభునూనుఁ బలికె:

"చేకొని కూడ వచ్చితిమి గోవులను
వీకతోఁ బఱతెంచె వెనుక సైన్యంబు.
సరగున నరదంబు సైన్యమధ్యమున
నరుదార నడపు; బాహాశక్తి నేను
త్రిప్పెదుఁ బసులను దీవ్రత రిపులఁ
గప్పెదు శరవృష్టిఁ గలఁతు భూనాథు"
ననిన నాసేనకు నడ్డంబు నడప
మునుమిడిఁ దూరుపుముఖముగా రథము

కౌరవపరివేష్టితము లైనగోవులనెల్ల
నరుఁడు విడిపించుట.

జననాథతనయుండు చన నిచ్చుటయును
దనపేరు వాడి సుత్రామనందనుఁడు
పాతాళలోకంబు బబ్బరింపంగ
నాతఱి రథఘోష మందంద నెఱపి
మెలమితో "నెందుఁ బోయెదరు, పో నా నె?
నిలుఁ" డని చే వీచి నిష్ఠురాస్త్రములఁ
జెన్నుగా సేనలు చెదరంగ నేసి
మిన్ను నేలయుఁ గప్పి మొఱసి యార్చుటయు
వెఱచి తప్పక చూడ వెఱచి చేష్టలను
మఱచి యుండిరి; క్రీడి మహితవేగమున

మొదవుల వెంట నిమ్ములఁ బోవు ప్రజల
నదలించి తూర్పునకై పాఱఁ దోలి
తెలిపి గావించినఁ దేఱఁ గొప్పఁ జూడఁ
దఱ చైనగోవు లాతతసేననడుమఁ
దునిసిన మొయిలుసందునఁ గానఁబడిన
ఘన మైనశత తారకములచందమున.
భవ్యదోస్సారంబు భాసిల్ల విలిచి
సవ్యసాచియు నంత సవరించి యొత్తె
దివ్యశంఖంబు భూదిశలు ఘూర్ణిల్ల
నవ్యయం బగుదానియారవంబునకు
హరి కేతనము సేయునార్భటంబునకు
హరి కేతుభూతాట్టహాసంబునకును
శోభిల్లుమకుటరోచులతీవ్రతకును
నాభీలగాండివజ్యానాదమునకు
నరిసేన సేయుహాహారవంబులకు
నురవడి సేయుదివ్యులయెలుంగులకు
బెదరి గోవులమూఁక పృథివి గంపింపఁ
జెదరి గాండీవి వచ్చినజాడఁ బట్టి
చిఱుకొట్టుచును వాలశిఖరంబు లె
పఱచె దక్షిణదిశాభాగంబునకును;

పసులతోడన పట్టుపడినగోపకులు
వెస నేగి రాధేనువితవి వె న్దగిలి.
అనఘుఁ డర్జునుఁడు తానాహాహోత్సాహ
మొనర మూఁపులు పొంగ నుత్తరుఁ జూచి
"అరులు గోవుల కింత నడ్డంబు రాక
యరదంబు వారలు నరుదెంచు నెడకుఁ
బోవ ని" మ్మని చెప్పి భుజదండ మెత్తి
గోవుల దెసఁ జూపి గోపవర్గముల
"నోడకుఁ డింక నే నున్నాఁడఁ బసులఁ
గూడి పొం" డని చెప్పి కొమ్మ కొప్ప నంత
వెరవునఁ దేనె గప్పినమక్షికముల
పరుసునఁ గురుసేన పసులకై పొదువ
వెమ్ముచుఁ గోపించి వెసఁ జొర రాక
యమ్ములు పఱచి బాహాశక్తి నతఁడు
భావనకై వచ్చుబహువికారములఁ
బోవఁ ద్రోచినయోగిపురుషుండు పోలె
వారించుటయు సేన వశము గా కుండె.
చేరె గోవులు తొంటిసీమ కన్నియును.
అనినఁ గౌరవు లెల్ల నటమీఁద నేమి
యొనరించి రది తెల్పు మొనరంగ ననిన

చారుయశఃపూర సరసగంభీర
భీరువైరిత్రాణ భీమప్రతాప
తాపసకృతసౌఖ్య ధర్మస్వరూప
రూపమనోజాత రుచిభానుబింబ
బింబాధరా భద్రబిరుదావలంబ
లంబధరాధీర లలితసంచార
చారుతరస్తుతసద్గుణాధార
ధారాధరౌదార్యధర శుభావాస
వాసవప్రతిమాన వరజనావాస
ధీశక్తినిజపాత్ర దేవయపుత్త్రి
ఇది సదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్త్రి
మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితవిరాటపర్వమున నాశ్వాస
ముచితార్థయుతముగా నొప్పె నాలవది.



శ్రీకరచారిత్ర శృంగారగాత్ర
ధీకల్పితోద్ధార దేవయముమ్మ
వినుము వెండియు నిట్లు వివరింపఁ దొడఁగె
జనమేజయునకు వైశంపాయనుండు:
ఈచందమునఁ గౌరవేశుండు మొనలఁ
జూచుచుండఁగఁ జేర్చి సురరాజసుతుఁడు
బాహుబలాభీలభవ్యదోర్దండ
దోహలబాణసందోహంబు పఱపి
పులినోటిమాంసంబుఁ బుచ్చికొన్నట్లు
బలియురచేఁ బడ్డపసిఁ గ్రమ్మరించి,
యరుదొంది కురునాథుఁ డరిసేన నుంట
గరుడుండు తాఁ బన్నగముఁ గన్నమాడ్కి
నాహూఢి నర్జునుం డప్పుడు వీక్షించి
బీరంబు మోమున వెలయుంగఁ బొంగి

"యమ్మహీపతిమీఁద నరదంబుఁ బోవ
ని" మ్మని నృపసూతి కేర్పరించుటయుఁ
బ్రథితకౌరవులు నేర్పడ రెండువేల
రథములవారు ధీరత మున్నె కడఁగి
వేయేసిరథముల వెసఁ గర్ణభీష్ము
లాయత్తమై వచ్చి రతని కడ్డంబు.
నరనాథుఁ డటమున్నె నరునిచేఁ బనులు
తిరుగుట వీక్షించి దీనభావమున
రాయుచు ననుజవర్గముఁ దాను మగిడి
వేయురథములతో వెఱఁ గంది నిలిచె.
తక్కటిబలము లుద్ధతి మోహరించి
రెక్కడఁ జూచిన నిల యీనినట్లు.
ఇందఱు నొకనిపై నింత సేయుచును
అందందు నేకాంగి కను వైనయట్లు
దర్పించి ననుఁ జూడు తనుఁ జూడు మనుచు
నేర్పులు దొరలతో నిర్ణయించుచును
ఉదయించుభాస్కరు నుగ్రరాక్షసులు
పొదివినగతిఁ గ్రీడిఁ బొదువునత్తఱిని
అతఁడు మోమున మందహాసంబు నిగుడ
నతివీరరసవార్ధి నందంద తేలి

### ఉత్తరునకు నర్జునుఁడు కౌరవవీరులను వారియడియాలంబులను దెలుపుట.

యుత్తరు వీక్షించి యొప్పారఁ బలికెః
"ఉత్తర చూచితే యుగ్రసైన్యముల
నర్థితో వైరు లిట్లరుదెంచు టెల్ల ?
పార్థునోఁచిననోముఫలము కాఁ బోలు !
కురువీరవరులకు గుఱుతు చెప్పెదను
వెర వొప్ప నది నీవు విని యుండ వలయు.
పసిఁడిఁ జేసినవేదిపగిది యై పడగ
యసమానగతి నొప్పునతఁడు ద్రోణుండు.
శృంగార మై యున్నసింగంపుఁబడగ
యంగీకరించువాఁ డతనినందనుఁడు.
పసిఁడియాఁబోతును బడగలోఁ గల్గు
నసమాక్షసమరూపుఁ డగువాఁడు కృపుఁడు.
ఉడురాజు సరిపోలు చున్నశంఖంబు
పడగఁ దాఁ గలవాఁడు భానునందనుఁడు.
పడగలలోఁ గానఁబడుఁ తాటిమ్రాని
పడగఁ దాఁ గలవాఁడు పరఁగ భీష్ముండు.
సర్పంబుఁ దానును సరివచ్చు చుంట
సర్పకేతువువాఁడు సరవి రారాజు.

ఎసఁగినవేడ్కతో నింక ద్రోణునకు
వెసఁ బ్రదక్షిణము గావింతము గాని
తేరుఁ దోలుము వీరి దెస నెన్న మనకుఁ
గ్రూరంబు గొఱగాదు గురుమూర్తి గాన.
జలదంబుఁ బిడుగుతో సంధించినట్లు
విలువిద్య నేర్పె నీవిప్రోత్తముండు;
భావింపఁ దెలియు మశ్వత్థామకన్నఁ
గేవలమును ననుఁ గృప సేయు మదిని.
కావున నితనితోఁ గయ్యంబు సేయ
భావంబు గొలుపదు పరికింప నాకు.
కురురాజుతోడ మాఱ్కొనఁగఁ దా నిట్టు
లరుదెంచె నితఁ డేసినప్పు డేయుదము.
అతనిపుత్త్రుఁడు తండ్రియంతటివాఁడు
అతులితం బైనశస్త్రాస్త్రవిద్యలను.
పురహరువరమునఁ బుట్టె ద్రోణునకుఁ
బురుహూతుతో నైనఁ బోరాడు నతఁడు.
మఱి కృపాచార్యుండు మాతండ్రిసఖుఁడు
చిఱుతకాలమునాఁడు చెప్పె విల్విద్య.
కృపుఁ డంట గాని నిష్కృపుఁడు వైరులకుఁ
జపలదుర్యోధనుసర్వాంగరక్ష.

ఈయిరువురు నేయ కే నేయ వెఱతు
మాయెడఁ గృప గల్గుచూచ్చు టెంతయును
అదె చూడు రాధేయుఁ డాహవక్షోణిఁ
గదల కుండెడిమేటి గర్వపర్వతము.
ఇతఁ డర్థికోటికి నిచ్చుకాంచనము
ద్రుతగతి రెంకుమేరువు లంత గలదు.
కురురాజు వీఁడు నఁ ఘోరాజి గెల్చు
నరుదార నంచుఁ దా నాత్మలోఁ దలఁచు.
వీక్షింపు కౌరవవిభుఁ డల్ల వాఁడె
యక్షీణుఁ డభిమాని యసమానబలుఁడు.
బలిమిఁ బాండవులను వారక యేఁపఁ
గలిగె నా కని యాము గవిసి యున్నాఁడు.
కలిగె నీతనితోడఁ గయ్యంబు నాకుఁ
గలిగె బందువు సేయ గాండీవమునకు!
అర్కసూనుఁడు నీతఁ డని నన్నుఁ గన్న
మాకొఁనఁ గలవారు మదిఁ గొంకు లేక!
ఎలమితో వీరల నే నేయునపుడు
సొలవక నీనేర్పు సూపంగ వలయు.
పిడుఁగైన నిల్చు నాపేరు సెప్పినను
బుడమిపై వీరి నిల్చుట యెంత నాకు?

రారాజు మారొండ్రున రా కున్నవాని
తేరుచేరువఁ బోవఁ దెలిసితో? చోరుము.
ఇంక భీష్ముని జూడు మితఁ డాజిభీష్ముఁ
డింకించు నరిబలం బేచి యెల్లెడల;
సంచితభుజబలసంపన్నుఁ డితఁ
డంచితగాంభీర్యుఁ డసమసాహసుఁడు
పరశురాముని లావుఁ బరఁగ నిర్జించె;
మరు కేళి హనుమంతుమాడ్కి వర్జించె.
తలపోయఁ బాండవధార్తరాష్ట్రులకు
నెలమిమై నొకరీతి నేకార్యమునను
భేద మించుక లేక పిల్చి తా నెపుడు
నాదరించును గూర్మి యలరార నితఁడు.
ఇతనిపొంతను బోవనీకుమా రథము
జితలోకుఁ డితఁడు నిర్జింప నీఁ డరుల''
అని మహావీరుల నతని కేర్పఱిచి
యని సేయ నర్జునుం డరుదెంచునప్పు
డెలమి నశ్వత్థామ యించుక నవ్వి
పలికెఁ గర్ణునిఁ జూచి భావంబు చెదర:

### అశ్వత్థామ కేరడంబు లాడఁ గర్ణుఁడు వీరభాషణంబు లాడుట.

"కర్ణ నీమాట లాకర్ణించె నృపుఁడు
నిర్ణయించితి క్రీడి నిర్జింతు ననుచు.
అదె వచ్చె బీభత్సుఁ డాహవంబునకు!
ఎదు రేగి పోరాడ విది యేమి నేఁడు
తలఁకొని వానితోఁ? తలపోసి చూడు.
తలఁప నిందఱు గారె తలపోయఁ బతికి
పలుక నేర్తురు గాని పలికిన ట్లెల
యిల వారు చేసిన నే మేమి గాదు!"
అనుటయుఁ గోపించి యర్కనందనుఁడు
పెనుఘనఁ బడగెత్తు పెనుపాము వోలె
ని ట్లని పల్కె "నే నెట్లు లాడితినొ
యట్లె చేయుదుఁ జూడు మాలంబులోన.
నిను నమ్మి వచ్చితినే కయ్యమునకు?
విను నీవు నన్ను నవ్విన నేమి యయ్యె!
బీభత్సు నిదె యడ్డపెట్టెద" ననుచు
నాభోగశరవేగుఁ డై త్రోచి నడవ
నతనికి మున్ను భీష్మాచార్యకృపులు
చతురు లై నడచి రశ్వత్థామతోడ.

ఈరీతి నవ్వీరు లేవురు నడవ
ధారుణీవిభుఁ డంతఁ దానుఁ దమ్ములును

కురువీరులు దర్పంబునఁ జేర్చి యొక్కుమ్మడి
నర్జునుం దలపడుట.

శకునిసైంధవముఖ్యసకలబాంధవులుఁ
బ్రకటబాహ్లీకముఖ్యబహుమహీవిభులు
సకలకుంజరములు సకలాశ్వతతులుఁ
నకలంకగతి బీర మభివృద్ధి చెందఁ
గూడి యొక్కటఁ జేర్చి ఘోరాహవమునఁ
గ్రీడిఁ దాఁకినఁ బ్రాఁకెఁ గెందూళి మింట,
గజగజ వణఁకె దిగ్గజము లన్నియును,
త్రిజగము ల్గలఁగె వారిధు లెల్ల నింకె,
పటహాభాంరవములఁ బగిలె నల్దెసలు,
పటుబాణరుచులచే భానుండు మాసె,
“హాపుత్త్రి హాపుత్త్రి” యని వజ్రి పలికె
రూపింపఁ బాండుపుత్త్రునిలావు మించె.
అప్పుడు తఱచుగా నవనీపుహములు
గప్పినశిఖి పోలె గాండీవధరుఁడు
నిర వొప్ప బాణంబు లీసుమైఁ గురిసి
యరుల మార్కొనుచు బాహాటోప మొప్ప

వైరిసైన్యముఁ జొచ్చి వారు వీరనక
ఘోరశరాగ్ని గగ్గోలుగాఁ బఱచి
కదిసి పాఱఁగ నొక్కకాలంబునందుఁ
బదియింటఁ బదియింట భటవార మేర్చి
త్రిదశులు బెదర నుద్రేకించి యార్చి
కదనంపుఁగ్రీడలోఁ గడుదిట్ట యగుచుఁ
దలఁకక మాఱొక్కనఁ దమకించువారిఁ
దొలుతను జెండాడి తోడ్తోడ భటులు
భంగంబుతోఁ బటాపంచ లై పాఱ
ముంగలిమొనవారి మొత్తి పోఁ ద్రోలి
శింజినీనాదంబు సింధుగర్జనము
రంజిల్లుగతి నొక్కరవముగా మొరయ
దళములపైఁ దేరుఁ దఱిమించి మించి
కొలను సొచ్చిన యట్టికుంజరం బనఁగ
బంధురగాండివపటుమౌర్వియందు
సంధించి యేయుచో శరపరంపరలు
పదియు నూఱును వేయి పదివేలు లక్ష
పదిలక్షలును గోట్లు పదికోట్లనంగ
మెఱసి లెక్కకు మీఱి మిణుఁగుర్లు చెదర
నెఱమంట గ్రక్కుచు నేచి వేగమున

నిలువక కలనిలో నెత్తుటఁ దోఁగి
యలమి సైన్యము నెల్ల నదలించి మించి
పంచాననంబులపగిది నేనుఁగులఁ
జించి మాంసంబులఁ జిద్రుపలై రాకి
జననాథులను బోలె శాస్త్రసమ్మతుల
ఘనహస్తపదమస్తకముల ఖండించి
యురవడి నుగ్రవాయువులచందమున
నరదంబులొకకొన్ని హతము గావించి
కాటెనుమునుబోలె గతి నేపురేఁగి
మీఱి వైరుల నెల్ల మెఱయంగఁ ద్రుంచి
జలజనాభునిమూర్తిసంపత్తిపోలెఁ
దలఁప నెక్కడ నైనఁ దాన యై యుండె.
అప్పుడు సైన్యంబు లాయోధవరులు
తప్పక నరుమీఁద దట్టమై కదిసి
జలధిపైఁ గవిసిన చటులాగ్నిసమితి
పొలుపున రూపఱి పోవ నన్నియును
బరఁగ వాలమ్ములు వర్షించి తాఁకి
యరుదార నిరుగేల నాలంబు సలుపు
సురరాజసుతుని యాశుగ వేగమునకుఁ
బరువిడి నిలువ నోపక పాఱి పోవ

మఱి కొంద ఱుత్తుంగమాతంగసమితిఁ
దఱచు డీకొల్పుచుఁ దగఁ బార్థుమీఁదఁ
బరిఘముద్గరకుంతబాణనారాచ
కరవాలశూలచక్రము లొప్ప వైచి
కుంభజుతోడ మార్కొనినవారిధుల
జృంభణ మెట్లయ్యెఁ జెలఁగి య ట్లయిరి.
రథికులు కొంద ఱూరక చిత్తజల్లు
పృథివీధరంబుఁ గప్పినరీతి దోఁప
బెడిదంపుఁ దూపుల బీభత్సుఁ గప్ప
బెడబెడ మనియార్చి వే పోయి మఱియుఁ
బురములు మూఁడు గోపురములతోడ
హరుచేతఁ బడినట్ల యతనిచేఁ బడియుఁ
జౌకళించుచు రాజసమితితోఁ గొంద
ఱాకీర్ణశరఖడ్గు లై వచ్చి తాఁకి
హేషారవంబుల నిద్ధకింకిణుల
రోషభాషణముల రొద చేసి కప్ప
శబ్దభేదులు కొన్ని సంధించి యప్పు
డబ్దవాహనపుత్త్రుఁ డస్త్రంబు లేయ
నాతతబాణాగ్ని యలమ నందఱును
ఊతగా నశియించి రొగిఁ జూడ నపుడు.

అంత నర్జునుచేత నాభంగి సేన
యెంతయు గాసిల్లు టెఱిఁగి రారాజు
గజపురంబునఁ బేరు గలవీరవరుల
గజహయారూఢులుగాఁ జూచి యేర్చి
పదివేలఁ బొం డని పంపు వెట్టుటయుఁ
త్రిదశేంద్రసుతుఁ దాఁకి ధీరు లై వారు
“కదియుఁడు పొదువుఁడు ఖండింపుఁ డేయుఁ
డదలింపుఁ” డనుసొంపు లగుచుంట లెసఁగ
నిప్పులు గురియించు నిష్ఠురాస్త్రములు
కప్పిన సంతోషకలితుఁడై సఖుఁడు
ఉత్తరుపై బాణ మొకటి పోనీక
యుత్తమాశ్వంబుల నొకటి పోనీక
క్రక్కునఁ దనతేరు గడగండ్లఁ బడక
చెక్కు చెమర్పక చెలువుమై మెఱసి
తుల లేనియక్షయతూణీరములను
నెలువడి యొండొంటి వెంటనే నిలుచు
శరములు సంధించి సైన్యంబు మీఁదఁ
బరువడి వర్షింప భగ్నమై యదియుఁ
గరములు నుచ్చి యంగములు నొచ్చియును
శరవహ్నిఁ జచ్చియు శరణుచొచ్చియును

వడిఁ గూడఁ బోరియు వంతఁ బాఱియును
జడబుద్ధి మీఱియు సఖులఁ జీరియును
నెత్తురు గ్రక్కియు నెరయఁ జిక్కియును
చిత్తంబు స్రుక్కియుఁ జేష్ట దక్కియును
వీడిన వెస నేగి వీక్షించి వీకు
"లోడ కోడకుఁ" డని యొకలక్ష గూడి
కర్ణాదు లనుప నగ్గలికతో వచ్చి
యర్ణవధృతి శోఁప నందంద యార్చి
నరుమీఁద నేసిన నరుఁడు భీతిలక
దరహాస మొసఁగ నుత్తరున కిట్లనియె:

అర్జునుఁ డుత్సాహవచనంబు లాడి యుత్తరుని
యుద్ధసన్నద్ధుఁ జేయుట.

"ఓరాజనందన, యుద్ధంబు బలిసె.
సారథ్యమునకు వేసఱకుమీ నీవు.
ఈసేనఁ జొచ్చిన నింకఁ బై రాదు;
భాసురగతిఁ దేరుఁ బాఱని" మ్మనిన
మెలపుఁగో నతఁడును మిఱ్ఱుపల్లంబు
తలఁపఁ జేరువయును దవ్వు దుర్ఘటము
నొక్కసమాన మై యుండ నారథము
నెక్కుడు వెసఁ దోలె నెల్లసేనలును

నెలకొని యడ్డంబు నిడుపు మూలలను
వలయంబులును గాఁగ వచ్చి వర్తింప.
నరుని బాణముల రత్నపుఁ గేతనములు
ధరఁ గూలెఁ జుక్క లుద్ధతిఁ గూలినట్లు.
“మముఁగావు”మని మ్రొక్కు మాడ్కి నశ్వములు
నమరేంద్రసుత బాణహతిఁ జేసి మ్రొగ్గ.
రక్తాబ్ధిలోన వారణపయోదములు
యుక్తంబుగాఁ గూలె నొకక్రీడిచేత.
పడగలు గొడుగులు పార్థుబాణములఁ
గడువేగమునఁ ద్రెవ్వి గాలిచే నెగసె
నటమున్నె దివి కేగి యాడునట్టులును
జటులభూపాలలాంఛనములో యనఁగ!
కొలఁది మీఱినయట్టి ఘోరయుద్ధంబు
చెలఁగఁ గౌరవరాజుసేనలో నపుడు
మదమేది కూలినమాతంగఘటలు
చిదిసినహరులు నొచ్చినరథావళులు
నొరగినకేతువు లొరగుసారథులు
విరిగినవిండ్లుఁ ద్రెవ్వినగుండియలును
దునిసినగోళ్లును దొరఁగునెత్తురును
బెనఁగొన్న ప్రేవులు బెరయుపీనుఁగులుఁ

గలుగుచు సంగరాంగణము చూడ్కులకు
విలయకాలమునాఁటివిభవంబు చూపె.
కాలినశిఖిఁ జొచ్చి కనకఖండములు
కాలుష్యములు మాని కడు నొప్పినట్టు
లనిఁ జొచ్చి విరథు లై యర్జునాస్త్రముల
మనుజభావము లూడ్చి మఱి దివ్యు లగుచు
రమణతోఁ గొందఱు రంభకౌఁగిటను
క్రమముతోఁ గొంద ఱుర్వశిసౌధములను
మెలపుతోఁ గొందఱు మేనకయింటఁ
దలఁపఁ గొందఱు తిలోత్తమయింటఁ గాఁగ
నలవక యింటివేశ్యలపాలు పోక
తలకొని ఘోరయుద్ధము చేసి రచట.
అప్పుడు క్రీడిచే నాభంగి సేన
చెప్పఁ జూపఁగ లేక శీఘ్రముంబె తెగిన
నతిరథసమరథు లట మహారథులు
ధృతి నర్ధరథులు నుద్రేకంబుతోడఁ
బరఁగ నర్జునుఁ డనుబడబాగ్నిమీఁదఁ
బొరిఁ బొరి శరవార్ధిఁ బురికొల్పుటయును
అది వీక సేయక హరితనూభవుఁడు
త్రిదశు లిచ్చినయట్టిదివ్యబాణములు

కలుపించి యేయుచోఁ గలశసంభవుని
నలు వొప్ప డెబ్బది నాఱు బాణములుఁ
బరఁగ దుశ్శాసనుఁ బదియేను నాఱుఁ
బరఁగంగ దుష్ప్రభుఁ బం(డెండు నాఱు
నలు వొప్ప నలుబది నాఱు సౌబలునిఁ
నలరంగ ముప్పది యాకృపు నాఱు.
కర్ణురథ్యంబులుఁ గర్ణుసారథియుఁ
గర్ణు తేరును (దుంచి కర్ణు నొప్పించి
ధీరుఁ డై నరుఁ డంత దేవదత్తంబు
పూరించె సైన్యంబు భుజశక్తి నెడల.
దారల లిట్లు వడుటయుఁ దొడరి వీక్షించి
వరుస నిల్వఁగ లేక పాఱె సైన్యంబు
సేనానిచే దెతఁ సేనలు తొలి
జా నొప్పఁ బాఱినచందంబు దోఁప;
సురరాజసుతుమూర్తిఁ జూడంగ వెఱచి
మరలి గాంగేయునిమఱుగు సొచ్చినను
అతఁడు వారల కెల్ల నభయహస్తంబు
చతురత నిచ్చి యాశ్వాసించి పలికె:

అర్జునునకు నిలువ లేక పాఱుసైన్యంబునకు
భీష్ముఁ డుత్సాహవచనంబులు పలుకుట.

"ఓకర్ణుసైన్యంబ, యోద్రోణుసేన,
ఓకృపుసైన్యంబ, యోడకుం" డనుచుఁ
"గ్రమము సర్వము మీఱి కాలాగ్ని రాదు,
రమణతో జలధి మేరకు మీఱి రాదు,
గఱకంఠు మెడ నున్న గరళంబు రాదు,
తెఱఁ గొప్ప శమనుఁ డుద్రేకించి రాఁడు!
ఒకపింటివానికి నోడి వచ్చితిరి!
ప్రకటింపఁ దల్లిగర్భముఁ జొచ్చువారె!
మెఱయ విండ్లును గావె మీకు పట్టినవి?
మెఱయు తేరులు గావె మీర లెక్కినవి?
ఎలమి నెంతటి కైన నే నున్నవాఁడఁ
దలపడి మీర లుద్ధతి నేయుఁ" డనిన
నీసున నటు పోక యేచి యార్చుచును
భాసురగతి భూమిపైఁ ద్రొక్కి నిలిచి
మఱియుఁ గవ్వడిమీఁద మహితసత్త్వంబు
నెఱప నుద్యోగించె నెఱి సైన్యవితతి.
అటు లేచువైరులయాటోప మెల్లఁ
బటుకార్యగతిఁ జూచి బాహు లుప్పొంగ

నుత్తరునకు వారియుత్సాహ మెల్ల
నత్తఱిఁ జూపుచు నర్జునుం డనియె:
"కురురాజు గూర్చినఘోటకవితతి
పరిణద్ధసైన్యవైభవముఁ జూచితివె?
ఎలమితో మన మెంత యేపు సూపినను
బలము దగ్గక వైరివర్గంబు పొలుచు!
ఇటమీఁద మనము ప్రత్యేకయుద్ధమునఁ
బటుభయంకరలీల బటువు చూపుదము.
నెఱయ నించుక నీవు నీరథ్యములను
దఱుమక నిల్పి కింథర మప్పళింపు.
జా నొప్పఁ జూతము సైన్యమధ్యమునఁ
గాన వచ్చుచు నుండుఁ గర్ణు కేతనము.
వాఁడు మూరొ్కాన నున్నవాఁ డింక మనకు
వాఁడిమి పచరింప వలయు మున్నాడి.
ఆదిక్కునకుఁ జేర నరదంబు పఱుపు
మాదిత్యతనయునియాటోప మెల్ల
నుడిగింతు" నని పల్క నుత్తరుం డపుడు
కడుకొని హరులపగ్గము సడల్పుచును
రథము వేగమె తోలె రాధేయుమీఁద.
ప్రథితబాహాగర్వపరివేష్టుఁ డగుచు

నావులమందలో వ్యాఘ్రంబు చొచ్చి
వావిరిఁ గలఁచునప్పగిది నర్జునుఁడు
కురుసేనఁ జొచ్చి తా ఘోరంబుగాను
శరములు వర్షించి సమయింప నరులఁ
జిత్రాంగదుండును జిత్రసేనుండుఁ
జిత్రరథుండుఁ జెచ్చెర వికర్ణుండు
సరగ శ్రుతుంతపసంగ్రామజిత్తు
లరయ దుర్ముఖదుర్జయాఖ్యదుష్కృతులు
మరియుఁ బేరైనకుమారవర్గంబు
మురువొప్పఁగాఁ గ్రీడి మున్నాడి తాఁకి
తఱచుగాఁ దూపు లుద్ధతి నెల్లయెడలఁ
బఱపి దిక్కులు దీప్తిఁ బరిఢవిల్లఁగను
జెలరేఁగి తమ సేయుసింహనాదముల
బలిమి శేషునిశ్రోత్రపటలంబు పగులఁ
గదనంబు సేయుచో గాండీవి యపుడు
“పదర నేటికి మీరు పసిబిడ్డ” లనుచుఁ
దలపోసి సగరనందనులపైఁ దొల్లి
నలిగినకపిలసంయమిపోలె నలిగి
ధరఁ గూర్చె బాణసంధానజర్ఝరితఁ
బరచాపపరయుగ్యపరకేతనములు.

అంత వికర్ణుఁ డత్యంతవేగమునఁ
గాంగేయుమీఁద మార్గణవృష్టిఁ గురియ
నజిముజిఁ దనచాప మతనిబాణముల
విఱుగంగఁ దానును విఱుగుచో వీరు
"వెసఁగి పోవకు" మని యెంత చెప్పినను
వెస వికర్ణుఁడు కాన విను లేక పాఱె.
క్రూరుఁ డై యపుడు శత్రుంతపుం డార్చి
నారాచతతుల నన్నరు తేరు మాటి
యుత్తరుఁ జంప నుద్యోగించి యపుడు
చిత్తవిక్షేపంబు సేయుచో నరుఁడు
వానిసూతునిఁ జంపి వానివి లీఁటిచి
వానిరథ్యంబుల వసుధపైఁ జమరి
చెలఁగి యాయాహవక్షేత్రపాలునకు
బలి యిచ్చె మఱి వానిపటుమస్తకంబు.
ఇచ్చి యంతటఁ బోక యీకురువీరకులు
విచ్చి పాఱినఁ గాని విభుఁడు రాఁ డనుచు
దృష్టించి యరు దైనదివ్యబాణముల
సృష్టిఁ జీఁకటిఁ బడఁ జేసి యేసినను
తనికినదిగులుచే ధైర్యంబు వదలి
యనిఁ దొలంగుచుఁ బాఱె రరియోధవరులు.

ఇత్తెఱంగునఁ బాఱ నెలమి సంగ్రామ
జిత్తు తాఁ బోవక జిష్ణుపైఁ గవిసి
మునుమిడిఁ గర్తరీముఖకూర్మనఖము
లనుసాయకము లేయ నతఁడు నవ్వుచును
దల మీఱి వాని కేతనముఁ జాపంబుఁ
దలయును ద్రుంచి యాతలఁ బాఱ వైచె.

కర్ణుండు పరాక్రమించి బీభత్సునిపయిం
గవియుట.

ఈచందమునఁ దమ్ముఁ డిలమీఁదఁ బడినఁ
జూచి యాగ్రహమును జోద్యంబు నెరయ
నుడికెడినేతిలో నుదకంబు వడిన
వడువునఁ జెలరేఁగి బలిమిఁ గర్ణుండు
దివిజేంద్రసుతుమీఁదఁ దేగు దోలించి
వివిధబాణంబుల వెస నేసి యేసి
రథికు నొప్పించి సారథిఁ జిక్కుపఱిచి
రథరథ్యకేతుమర్మంబులు నాటి
బలిమి వాటింప నాపార్థుండు కినిసి
బలునారసంబులు వైరిసంత్రాస
కరదర్పపరిణతిఁ గర్ణుపైఁ గురిసి
వరభండనోద్దామపటుకేళి సలిపె.

ఘరుడుండు ఱెక్కలఁ గప్పుచుఁ బాముఁ
బారిఁగొన్న వడువున భూరిశౌర్యమున
రవిసూనుఁ దాఁకి దారణకర్మపరత
దివిజేంద్రసుతుఁ డేచి దివ్యాంబకములఁ
గల నెల్ల నిండఁగాఁ గడువేడ్కఁ బఱప
నలకర్ణుఁ డవి యెల్ల నందంద చదిపి
నిజపరాక్రమలీల నెరపంగ నెన్ని
విజయుఁ గిట్టెను గోపవేగంబు మెఱయ.
ఆమహావీరు లట్లాహవోద్దామ
భీమప్రతాపు లై పేర్చి పోరాడ
సేనాను లపు డాజిచేష్ట చాలించి
పూని చూచుచు నుండి బుద్ధిమార్గమునఁ
గాంగేయునొప్పికిఁ గర్ణునొప్పికిని
సంతోషభయరోషసంయుతు లైరి.
నరుఁ డంతఁ గోపించి నారాచభల్ల
శరశితక్రకచార్ధచంద్రబాణముల
సూతుని నరదంబు జోడుఁ జాపంబుఁ
గేతువు హారులు మిక్కిలి నొవ్వ నేసి

### కర్ణార్జును లొండొరులతోడ శూరభాష లాడికొనుట.

కర్ణుఁ దప్పక చూచి కర మొప్పఁ బలికె:
"కర్ణ చిక్కితి కాదె గాండివిచేత!
ప్రేలు చుందువు కొన్ని పిట్టబీరములు;
నీలావుపస యెల్ల నేఁడు చూచెదను.
అదియును గాక నీయనుజన్ముచావు
పొదివి చూచితి కానఁ బోరాదు నీకు.
ద్రోవదితలఁ బట్టి దుశ్శాసనుండు
వేవురు సూడఁగా వెస నీడ్చునపుడు
విడిపింతు ననిన నవ్వీనఫలంబు బింకఁ
గుడువ కూరక పోవఁ గూడునే నీకు?
తగ వొప్ప నాఁ డేను ధర్మపాశములఁ
దగిలి యుండుటచేసి తప్పి పోయితివి.
నేఁ డెట్లు పోయెదు నీ" వన్న నతఁడు
వేఁడిచూపులఁ గ్రుడి వీక్షించి పలికె
"కుంతికుమార నీకును బంటుకోలఁది
పంత మింతయుఁ గాక బహుభాష లేల?
నీవు ధర్మజుమీఁద నేరంబు పెట్టి
లావు సేయక నాఁడు లజ్జఁ గోల్పడితి!

క్రోధించి నేఁడు కైకొన్నలా వేది?
రాధేయు గెల్చితో రాజు గెల్చితివో?
వనవాస మీడేర్చి వచ్చినఁ గాని
మనరాజ్యభాగంబు మన కీరటంచు
నాయూసఁ గాదె మీ రాయాసపడుట!
దాయలు మీ కేడ ధర్మసంచయము!
ఈవల నావలఁ నీవు గావించు
లావులవలెఁ గాదు లలిఁ గర్ణుచోట!
చూచి పోరాడు నిష్ఠురబుద్ధి'' ననుచు
నేచి వాలమ్ము లనేకంబు లేసె.
అతఁడును నేయుచో నయ్యస్త్రసమితి
కుతలంబుఁ బొదివి యర్కుని కాంతి నణఁచె.
అప్పుడు రణభూమి నంధకారంబు
గప్పెను వాయువేగము లేక యుండె.
భానుజుబల మంతఁ బార్థుపైఁ గవిసి
నానావిధంబుల ననిచి రేఁగఁగను
జల మొప్ప మందు వేసవిఁ దుంగమడువు
బలిమిఁ జొచ్చినదంతిభాతి నర్జునుఁడు
చతురంగబలముల సమరరంగమున
ధృతిఁ గూల్చి మఱియు రాధేయు నొప్పించి

పరికించి యతనిచాపముఁ ద్రుంచి వైవ
నురుతరక్రోధి యై యుగ్రాంశుకొడుకు
మింట మంటలు వాఱ మెఱుఁ గారుశక్తిఁ
గంటగించుచుఁ గేలఁ గడుబల్మిఁ బట్టి
గట్టిగా ధృతి దోఁపఁ గౌంతేయుమీఁద
నెట్టన వైచె నిర్భిద్రదర్పమున.
ఆశక్తిఁ జూచి భయాసక్తి నడలి
వాసవాదులు చూడ వాసవాత్మజుఁడు
వదిలుఁ డై బహుబాణపటలంబు దొడిగి
యది నూఱుఖండంబు లై రాల నేసె.
నుతశక్తి నంతఁ గర్ణునిమూలబలము
పతికి నడ్డము వచ్చి పార్థుపై నపుడు
భద్రదంతావళప్రతతి డీకొల్పి
రౌద్రముద్రోన్నిద్రరసికభావమున
బలుతూపు లేసి యార్భటము చేయుటయుఁ
బ్రళయకాలాంతకప్రతిముఁ డై యతఁడు
దంతకాండంబులు తరుమండలములు
సంతతమదధార చారునిర్ఝరము
ఘనగండయుగళముల్ గండశైలములు
గొనముక్కుచమరులు గుహలుగాఁ గలిగి

పొలు పైనభూధరంబులఁ బోలుకరుల
బలుపిడుఁగులఁ బోనిబాణంబు లేసి
యిలఁ గూల్చునంతలో నినతనూభవుఁడు
వెలయంగ వేఱొకవిల్లు సంధించి
యాఱింట నుత్తరు నాఱింట హరుల
నాఱింట రథముఁ బదాఱింటఁ బడగ
నరుమేన డెబ్బదినాల్గుబాణముల
వరుసతో నాటి భూవరుని మెప్పించె.
నరుఁడు కర్ణుని నేసె నరుఁ గర్ణుఁ డేసె;
ఇరువురుఁ బోరాడి రి ట్లొక్కరీతి.
అప్పుడు కౌంతేయుఁ డలుక దీపింపఁ
దప్పక వీనితోఁ దడ వయ్యె ననుచు
కడఁగి నన్నూరుగ్రేఁకపునారసములు
తొడిగి రాధేయు బంధురకంధరమునఁ
గరములఁ బార్శ్వభాగముల ఫాలమున
నురమున రక్తంబు లొలుక నేయుటయు
మతి గిట్టి వెసఁ గిట్టి మార్తాండుపట్టి
ధృతి గట్టి పెట్టి భీతిలి ముట్టఁ బాఱె.

క్రీడి యరదంబు ద్రోణునెడకుం దోల
నుత్తరున కాజ్ఞాపించుట.

పాఱిన వైరాటి పకపక నవ్వెఁ;
మీఱిశంఖము మ్రోఁతమొరయించె నరుఁడు.
పొగడిరి సుర లెల్ల బోరున మునులు
పొగడిరి క్రీడిఁ దుంబురునారదులును.
తివిరినరణకాంక్ష తిర మైన నతఁడు
తవిలి నల్గడలను దవ్వు వీక్షించి
"అరదంబు గురునిపై నరుగ ని" మ్మనుచు
నరనాథసుతున కున్నతిఁ జెప్పుటయును
నొగిలి సమ్మెటకోల నొగలపై నతఁడు
డిగ వైచి భీతి రెట్టింప ని ట్లనియె:
"అమ్మక్క! ఇంక నే నైనఁ గానిమ్ము
నెమ్మి నెవ్వం డోపు నీతేరు గడప!
తురగయూథముమీఁదఁ దోలి వేసఱితిఁ
గరిసమూహముమీఁదఁ గడపి వేసఱితిఁ
దల మీఱి దొరలపైఁ దఱిమి వేసఱితి
బలియురపై నెల్లఁ బఱపి వేసఱితి.
తుద యేది మొద లేది దురము సేయుటకు?
ఇదె నీకు భుజసార మెక్కు చున్నదియ!

అరయ శౌర్యము నీకు నభివృద్ధి చెందెఁ
గరము నిర్భర మైనఘన తేజ మొప్పె!
ఇటు లెక్కు డగులావు నే నెందుఁ జూడ
నటమటించెను జిత్త మాలంబునందు;
సారథికార్యంబు సాధింపఁ జాల.
వారక చేష్టలు పాసె నెమ్మేను
భీతిమై నిండారె విహ్వాలభావ
మేతీరునను బుద్ధి యెలమిమై నిలువ"
దనిన భూమింజయు నాక్రీడి చూచి
"వినుము వేసఁజ నేల వీరకార్యముల
కే నున్నవాఁడ నీ కేల చింతింప?
పూని యశ్వంబుల బోధించి నడుపు;
మరుణాశ్వములతోడియరదంబుమీఁద
గురుఁడున్నవాఁడు చూడ్కుల నిల్పు మచట;
నురుకంధరమును మహోల్లాసముఖముఁ
బర పైనయురమును బాహుదీర్ఘతయుఁ
గలిగినపుణ్యుఁ డాగమశాస్త్రవిదుఁడు.
చెలువార విలువిద్యఁ జెప్పె మా కితఁడు.
క్షత్రియగోత్రసంజాతదోషమునఁ
జిత్ర మీతని నేను జెనకంగ వలసె!

కానీనుచందంబుగా నేఁడు ద్రోణు
నేను మార్కొనువాఁడ నీ వేల తలఁక?
పొలుపార మన తేరుఁ బోవ ని" మ్మనుచుఁ
దొలఁగక ద్రోణుపైఁ దోలించి యతఁడు
అక్కజంబుగ మ్రొక్కి యాచార్యుఁ బలికె:
"అక్కటా మీతోడ సని సేయ వలసె!
భీకరాటవిలోనఁ బెద్దకాలంబు
చేకొని తిరిగి వచ్చినయట్టిఫలము
కురుసేన నెల్ల మార్కొన మాకు వలసె.
కర మర్థి మీ రెఱుంగనిపని గాదు
గురువులతోడనా గుటగుట లనక
కరుణింపు మయ్య సంగరము సేయఁగను.

ద్రోణార్జునులద్వంద్వ
యుద్ధము.

మున్ను మీ రేయక మొగి నేయ" ననినఁ
బన్నుగా నిరువదిబాణంబు లతఁడు
దొడిగి యేసిన వానిఁ దోడ్తోడఁ గ్రీడి
నడుమనే తునుమాడె నాల్గుబాణముల.
గురుఁడు వెండియు నేసెఁ గోటిబాణములు
నరుఁ డవియును ద్రుంచె నానాస్త్రతతుల.

గతభీతి నిట్లు దిగ్గజములు రెండు
ప్రతిఘటించినమాడ్కిఁ బార్థుండు గురుఁడు
బవరంబు సేయుచో బాణఘట్టనలఁ
బ్రవిమలబ్రహ్మాండభాండంబు పగిలె
సురగిరి కంపించె సారిగిరి మునులు
సురరాజు దప్పక చూడ లేఁ డయ్యె.
ఇద్దఱు రణశూరు లిద్దఱు ధీరు
లిద్దఱు నతిరథు లిలఁ బార్థగురులు
చెలువార గురుభక్తి శిష్యమోహములు
తొలఁగించి కోపంబుతోడ నేయుచును
గోలలు దప్పించుకొనునేర్పుతోడ
నాలోన నొవ్వ నేయనివారిఁ బోలె
నున్నచోఁ గురుసేన లొప్పారువేడ్కఁ
బన్నుగాఁ దమలోన భాషించి రిట్లు:
"గురునితో నిట్లు మాఁర్కొని లావు సూప
నరుఁ డోపుఁ గాక యొవరుఁ డోపు నింక.
నలి నెత్తుగఱులు నున్నతిఁ దెల్లగఱులుఁ
గలుగుబాణంబులు కౌంతేయగురులు
ఏయుచోఁ జూపఱ కేపుమై రవియు
రేయెండయును గూడురీతి యై తోఁచె.

ఒక్కబాణముపోలె నొగి బాణపంక్తి
నెక్కొని గురుఁ జేయు నిమిషమాత్రమున;
నరుఁ డది తుమురుగా నఱకు చున్నాఁడు
ధరణి నే మని చెప్పుదము వీనినేర్పు!"
అనునంత గురుఁడు దివ్యాస్త్రంబు లింద్ర
తనయుపై నేయంగ ధరణి గ్రక్కదల
బుగులుకొంచును బేర్చుభూరిబాణాగ్ను
లెగయంగఁ జూచి యాయింద్రనందనుఁడు
వరుసతో నింద్రాగ్నివరుణాదిసురల
వరములఁ గొన్నయుజ్జ్వలబాణతతుల
నతితీక్ష్ణములఁ గూర్చి పరఁగ నేయుటయు
నతుల మై బాణపఙ్క్తినిలం బపుడు
పడగలు చించి యంబరవీధి కెగయ
గొడుగులు గొనిపోయెఁ గురుసేనలోన.
తెగఁబడి ద్రోణుఁ డద్దివ్యబాణములఁ
బొగలఁ జిక్కినవహ్నిఁ బోలె నుక్కణఁచె.
అప్పుడు కనలి ద్రోణాచార్యుసేన
కుప్పలుపడ నస్త్రకోటు లేయుచును
గాండివిఁ దాఁకినఁ గల్పాంతచండ
దండధరోద్దండతండ మై యతఁడు

తడిచేతఁ దుడిచి చిత్రము మాపినట్లు
తడయక సేన నంతయు రూపు మాపి
యంకితరత్నంబు లగుకిరీటములఁ
గంకణంబుల నొప్పుఘనబాహుతతులఁ
గలితకుండలము లౌకర్ణజాలములఁ
గలని శృంగారింపఁ గడఁకతో నచట
విపుల మై నిండి పర్వినరక్తవార్ధి
కపుడు రత్నాకరం బనుపేరు చెల్లె.
అర్జునుం డపుడు సైన్యముఁ జంపి వైచి
దుర్జయుఁ డై పేర్చి ద్రోణుదేహమునఁ
బసిఁడిపింజలచేతఁ బరఁగుబాణములు
దశకోటిశతకోటి దాఁక నేయుటయు
నతఁడును దల యూఁచి యాశ్చర్య మంది
మతిలోన మెచ్చి సమ్మత మొప్పఁ బలికె:
“శూరుండ వగుదు వర్జున మేలు మేలు!
ధారుణి నెవ్వరితరము ని న్గెలువ?
వృష్టిగాఁ దూపులు వెద చల్ల నేర్తు
వష్టావధానంబు హస్తలాఘవము!
మిగుల నేర్పున మమ్ము మించితి కాన
జగతిలో వింటి కాచార్యుండ వీవ.”

అని పెక్కుభంగుల నగ్గించుటయును
వినువీథిఁ గొలు వున్నవేల్పు లందఱును
"గురుఁడు గాండీవి మార్కొని యింతసేపు
మరములో నిల్చె సంతోషింప వచ్చు!
ధరణి దావాగ్నిముందర నిల్వ వచ్చు
ధరణి నుగ్రాక్షుముందర నిల్వ వచ్చు
నిలువంగ వచ్చునే నెఱిఁ గ్రీడిముందు!
విలువిద్య మేటివి వెఱవక నిలిచి
తల్లవో కలశజ యల్లవో ద్రోణ
యెల్లసేనలలోన నీవె శూరుఁడవు!"
అనునంతఁ గౌంతేయుఁ డాచార్యుమీఁదఁ
బనిగొని శరపరంపర బిట్టు పఱపి
సారథి యరదంబు చాపంబు నారులు
ఆరథికుఁడు కేతు వనక యన్నియును
బాణాంబురాశిలోపల ముంచుటయును
ద్రోణుఁ గానక సేన దుఃఖింపఁ దొడఁగె.

### అశ్వత్థామ యర్జునుం దాఁకి విజృంభించుట.

ఫల్గునుసేపు నశ్వత్థామ చూచి
విల్లొని దాఁకె నవ్వీరు మార్కొనుచు.

ఆ మెయి గురుపుత్త్రుఁ డధికరోషమున
భీమకోపాటోపభీషణుం డగుచు
నామేటి కెదురుగా నరిగి బాణముల
భూమియు మిన్ను నద్భుతముగాఁ గప్పె.
నరుఁడు వానిని ముంచె నారాచవృష్టి
గురుపుత్త్రుఁ డంతటఁ గోపంబు పెరుఁగఁ
జక్రాదులను గొంత జళిపించి చూచె
విక్రమంబునఁ గొంత వెఱపించి చూచెఁ
బెలుచ నత్తఱిఁ గొంత బెదరించి చూచె
బలుతూపు లేయుచు భర్జించి చూచె
నతఁ డెంత చూచిన నరదంబులోని
ప్రతిబింబమును బోలిపార్థుండు రథము
నందినగతి నుండు నందంగ రాఁడు
ముందర విహరించు ముట్టంగ రాఁడు.
విజయుఁ డప్పుడు శత్రువిజయంబు నెరపి
భుజములు తల మీఱి పొంగారు చుండ
గురుతనూభవసేన ఘోరాజిలోన
నరికట్టుకొని భీషణాస్త్రంబు లేయఁ
గొందఱ వంచించి కొందఱ నొంచి
కొందఱ విదళించి కొందఱఁ జించి

నడుములు ద్రుంచి యానవములు ద్రెంచి
నిడుపు వ్రయ్యలు వాఱ నెఱపి కొందఱను
బొట్టలు చించి వీపులు విదళించి
యట్టలు నేలతో నణఁచెఁ గొందఱను.
బెగ్గడించుచు నిట్లు బీభత్సుచేత
స్రగ్గుడుమ్రగ్గు డై సకలసైన్యములు
వెస వార్ధిలో నోడ విరియుచందమునఁ
బోసఁగ నర్జునవార్ధి బొంకక విరిసె.
విరిసినఁ గోపించి విజయు నీక్షించి
గురుతనూజాతుండు కొమ రొప్పఁ బలికె:
"ముదమున నావంక మొగముగా వెఱచి
కదన మెవ్వరితోడఁ గొంతేయ నీకు ?
అచార్యు గెలిచినయాబీర మెల్లఁ
బాచి పుచ్చెద మంచి బంట వై రమ్ము.
గాండీవ ముండఁగాఁ గాదె గర్వించి
తొం డేల యింక నేయుదు గాక" యనుచు
జలజలఁ గ్రీడిపై శరవృష్టి నెఱపి
నలు వొప్ప నొకకోల నారి ఖండించె;
అతఁడు వే ఱొకనారి యరయుసందునను
నుతశక్తి నందంద నొప్పించి యార్చె.

సుర లంత నాచార్యసుతుని వీక్షించి
"కురువీరులందు నెక్కుడుశూరుఁ డితఁడు
చక్కఁగా దీనసవ్యసాచిచాపంబు
చక్క నున్నది వానిసత్యంబుకతన!
చెచ్చెఱ వీరవర్జిత మైనసేనఁ
జొచ్చి జక్కాడునర్జునువిల్లు నేఁడు,
తల మీఱునలద్రోణతనయు సాధించుఁ
జెలఁగుచుఁ దల యెత్తి సిద్ధ మింతయును"
అని నారి ద్రెవ్వినయాక్రీడివిల్లు
వెనుకొని సుర లెల్ల వీక్షించుటయును
ఒక్కింత నగుచు వే ఱొకనారి వింట
నెక్కించి మ్రోఁత మి న్నెక్కించి నరుఁడు
నాచార్యసుతునితో నతిఘోరసమర
సూచితబాణవిస్ఫూర్తిమైఁ బోరి
గసబెస నతనియంగము లుచ్చి పాఱ
నసమునఁ గ్రొవ్వాఁడియమ్ము లేయుటయు
లావున లక్షోపలక్షబాణముల
దేవేంద్రసుతు వైచె ధీరుఁ డై ద్రోణి.
ఇరువురు నీరీతి నిరుమూఁడుగడియ
లరుదారఁ బోరుచో నర్జునాస్త్రములు

అతిశయంబులు గాన నభివృద్ధి నొందె
నీక్షింప ద్రోణికి నిషుపంక్తి పొలిసె.

కృపాచార్యునితోడ నర్జునుఁడు
యుద్ధంబు సేయుట.

ఆవేళ నెఱిఁగి కృపాచార్యుఁ డెలమిఁ
దా వచ్చి ద్రోణిముందఱఁ బన్ని నిలిచి
వశముగా దనక వివ్వచ్చుపై నడరి
పసిఁడియమ్ములు గొన్ని పాఱ వైచుటయుఁ
బీతాంబరంబు గప్పినశౌరి పోలె
నాతఁడు కృపమార్గణావిష్టుఁ డయ్యె
దెరలమిఁ దానును దేవేంద్రసుతునిఁ
దిర మొప్ప నేసెను ధీరుఁ డై ద్రోణి.
ఇర వొప్ప నర్జునుఁ డిషుపరంపరలు
పరపి కృపాచార్యుఁ బరఁగ నొప్పించె.
మౌర్వినినాదంబు మహితనాదంబుఁ,
బర్వినకోపాగ్ని బడబానలంబు,
నురుతరశరకోటు లూర్మిమాలికలు,
నరుణవీక్షణపుష్పహారవల్లరులుఁ
గలితశోణితవస్త్రకాండంబురుచులుఁ
గలవీరలక్ష్మియుఁ, గలిగి చూపఱకు

సులభగాంభీర్య మర్జునపయోరాశి
ప్రళయకాలమునాఁటిభావంబు దాల్చెఁ
చెలరేఁగి ముందు వచ్చినకృపాచార్యుఁ
డలవోకగా వించె నలుక రెట్టించి
కడువాఁడితూపులఁ గపికేతనంబుఁ
దొడిఁబడి యతఁ డిట్లు దోర్బలంబునను
దొనకుఁ జేచాఁచుట తూపు గైకొనుట
ధనువు తోఁ దివియుట తగ నేయుటయును
ఎలమి నింద్రున కైన నెఱుగంగ రాక
బలిమిపోఁడిమిఁ జూపి పార్థు నొప్పింప
లావునఁ జిఱుతకాలమునాఁటిగురువు
భావింప గురుఁ డని పాండవుం డలరి
తూపులఁ గృపునికేతువుఁ ద్రుంచి వైచి
చాపంబు రథము వక్షము నేయునంత
సురతనూభవు నరిష్టుండును గృపుఁడు
సరవిఁ జిత్రాంశుండుఁ జంద్రకేతుండు
నరుణవర్ణుఁడు ధీరుఁ డగుసుషేణుండు
మరి మణిమంతుండు మంజుకాళియును
అన నొప్పువేల్పవా రటఁ గూడి తాఁకి
గొనకొని రథరక్షకుల నొంచుటయును

ఆపార్థుఁ డందఱ కన్ని బాణములు
చాపశింజినియందు సంధించి మించి
ప్రాసఁగఁ దాళీఫలంబులు రాల్చుకరణి
వసుధ డొల్లఁగ నేసె వారిమస్తములు.
అంతటఁ బోక తా నాగాంతికొడుకు
వింతగాఁ గోపించి వెసఁ గృపాచార్యు
నొప్పించి యరదంబు నుగ్గుగా విఱిచె;
అప్పు డైనను బోక హరులఁ జెండాడి
సారథిఁ దెగటార్చి చాపంబుఁ దునిమి
పూరించె శంఖంబు భూమి గ్రక్కదల.
విరథుఁ డై కృపుఁ డంత విపులకోపమున
నరుణపంకజముల ట్లకు లొప్పార
దారుణాకృతి యాచుఁ దవరారుశక్తి
బోరునఁ గ్రీడిపైఁ బూన్చి వేయుటయు
నది ఘోరభయకారణాకార మగుచు
నది భానుకోటిప్రభాభాసి యగుచు
నది శూలధర కేళికాభీల మగుచు
నది గౌరవారుణం బగువర్ణ మగుచు
వచ్చుచో నడరి వివ్వచ్చుఁ డాశక్తి
యుచ్చి పో నేసిన నడుగక యదియు

నడ తెంచు చున్న నున్నతిఁ బార్థుఁ డపుడు
పొడిపొడిగాఁ జేసి భూమి రాల్చుటయు
నరు నంత దేవదానవసిద్ధఖచర
నరులు కీర్తించిరి నానాముఖముల.
ఆకృపాచార్యుండు నట ద్రోణురథముఁ
జేకొని నిల్చె నొచ్చినవాఁడు గాన.
అప్పు డంతటివీఁరు డాచంద మైనఁ
గప్పినభీతిమైఁ గలసేన లెల్లఁ
జంద్రిక లెల్ల భాస్కరునకు వెఱచి
చంద్రుచెంతకు నేగుచందంబు దోఁప
మఱి పోయిగాంగేయుమఱుఁగుచొచ్చుటయు
నటిమురి బీభత్సుఁ డంటంగఁ దఱిమి
సమరశంఖంబులు సమరకాహళులు
సమరభేరులు మ్రోఁగ సమరంబు చేసి
యొనరినశక్తిచే నురుశక్తి మెఱసి
మునుకొని మొత్తంబుమొన కంతఁ బొడిచి
యలరుచక్రంబుల నరిచక్ర మణఁచె.
బలిమిబాణంబుల బ్రద్ద లై పగిలి
పడి యున్న పునకలు పానపాత్రములు
మడపక రుధిరంబు మదిరారసంబు

శరవహ్నిఁ గురియుమూంనంబుఁ గూరలును
దరతరం బగునేత్రతతులు మీనములు
గాఁగఁ గైకొని భూతకాండంబు లచట
వీఁగ కెంతయువేడ్క విహరింపఁ దొడఁగెఁ
బొనర యుద్ధము రణభూమిలో బలియ.
ఘనత గాంగేయుపైఁ గడఁకతో నరుగు
నెడఁ జొచ్చి వృషసేనుఁ డిషుపరంపరలు
బడలుపడంగ నాపార్థుపైఁ గురియఁ
జతురుఁడై నరుఁ డర్ధచంద్రబాణముల
నతనివిల్లును ద్రుంచి నైదుబాణముల
వక్షంబు నేయుచో వ్యాఘ్రంబుఁ గన్న
యుక్షంబుగతిఁ బాఱె నొగిఁ దేరు డిగ్గి.
అంత దుశ్శాసనుం డావికర్ణుండు
సంతతోద్ధతిని వింశతి దుర్ముఖుండు
వచ్చి తాఁకినఁ గ్రీడి వారివర్మంబు
లుచ్చి పాఱఁగ నేసె నుగ్రబాణముల;
నఱకె వర్మంబులు నఱకెఁ జాపములు;
నఱికినఁ బాఱి రన్నరనాథసుతులు.
పాఱినఁ గని నవ్వి పాండునందనుఁడు
మీఱినవేడ్క భూమింజయుఁ జూచి

"మన మింక భీష్మతో మార్కొన్న మేలు
ఘనతాళకేతువుఁ గంటివే యతని?
పనివడి యతనితోఁ బస చూప కున్నఁ
దనియదు హృదయ మింతటికయ్యమునకు.
వరుసఁ బగ్గంబులు వదలుగా విడిచి
హరుల వేగమె తోలు మచ్చోటి" కనిన

నరునాజ్ఞ నుత్తరుఁడు భీష్మునెడకు
రథంబు దోలుట.

నవనీశతనయుండు నట్లు గా కనుచు
జవనాశ్వములమీఁద సమ్మెట వేసి
యరయ నూలును బట్టిన ట్లుండి నరుని
యరదంబుఁ దోలెఁ జయ్యన భీష్మమీఁద.
అప్పు డర్జునునకు నాభీష్మునకును
ఒ ప్పార నతిఘోరయుద్ధంబు చెల్లె.
అందు గాంగేయుండు నాహవోత్సాహ
సందేహములు మాని శంఖ మొత్తుటయు
నతఁడును నొత్తె బ్రహ్మాండంబు లగల
ధృతి దేవదత్తంబు దేవదత్తంబు.
కౌరవేశ్వరుఁ డంత గాంగేయుఁ డొడరి
పోరాడి నరుఁ జోడి పోవుఁ బొమ్మనుచుఁ

గొండంత వేడ్కఁ గైకొని చూచు చుండ
నొండొరు ల్దలపడి రొగి భీష్మనరులు;
నుతవాయువేగమనోవేగములను
అతిభారగతిఁ దేరు లపుడు వర్తించె.
తొడిగి వా రేసినతూపు లన్నియును
నడుమఁ దార్కొని పోరి నగ్గుగాఁ దూలు.
పొనర నాగ్నేయాస్త్రమునకు వారుణము
మునుమిడి నైంద్రాస్త్రమునకు రాక్షసముఁ
బొనరంగ నంతకమునకు సౌరమును
మునుకొన్నయురగాస్త్రమునకు గారుడముఁ
బోలు పైనదైత్యాస్త్రమునకు వైష్ణవము
నలి మేఘబాణంబునకు వాయుశరము
మొద లైనప్రతిబాణములు సంతరించి
కదిసి యొక్కరుని కొక్కరు డీలు పడక
చల మొప్ప దొనలపైఁ జాఁచినచేయి
సొలవక శరముఁ దెచ్చుచు నున్నచేయి
క్రచ్చఱ వేగంబుఁ గైకొన్నచేయి
క్రుచ్చి యమ్ముల నారిఁ గోరాడుచేయి
గలిగి నిశ్చలబాహుఘనచతుర్భుజునిఁ
దలపించు చుండి రిద్దఱుఁ బెద్దప్రొద్దు.

అడరి కౌరవసేన లంత నార్పులును
బెడబొబ్బలును మీఱ భీష్ము నగ్గించి
“ గెలిచితి ! గాంగేయ గెలువు మర్జునుని.
తలపంగ మాపాలిదైవంబ వీవ;
నీవు వి ల్లందిన నృపుఁడు మి న్నందె.
ఆవల నీచిత్త” మనిన భీష్ముండు
పడగపై నెనిమిదిబాణంబు లేసి
పడగ నుండెడిభూతపం క్తి నొప్పించి
పరఁగ నుత్తరుమీఁదఁ బదితూపు లేసి
పరఁగ రథ్యములపైఁ బదితూపు లేసి
యర్జునుపైఁ దూపు లఱిబోయు నంత
నర్జునుఁ డవి ద్రుంచె న స్త్రవర్షముల.
త్రుంచి వెండియు మంచు దొఱఁగువేగమున
నంచితకాండంబు లవనిపైఁ బఱప
నవియును భీష్మబాహాతీవ్రగతుల
రవిచేత నంధకారమువోలె నడఁగె.
వెండియు నరుఁ డేయ వెస భీష్ముఁ డేయ
మండుచు బాణాగ్ని మహిత మై పర్వె
నెరయ వార్ధులలోనినీ రెల్లఁ గ్రాఁగి
యరయ వేల్పులకొండ యంతగాఁ గాచి

సురనదితోఁ గూడ సురరాజుతోట
పరఁగఁ బచ్చనిశాకపాకంబు చేసె.
అంత నర్జునుఁ డేచి యాభీష్ముచాప
మింతింత తుమురుగా నేసి యార్చుటయు
మునుకొని రేఁగినపులివోలె భీష్ముఁ
డొనరఁ గోపించి వేఱొకవిల్లు దాల్చి
శరము లేయుచు నుండె; చక్రరక్షకులు
తరమిడి ఘోరయుద్ధము చేయునపుడు
నరుఁ డేచి వారి నందఱఁ ద్రుంచి వైచె.
సురరాజసుతుఁడు భీష్ముని నొవ్వ నేసి
యతనిసారథిఁ జంపి హరులఁ జెండాడి
యతనిసిడంబు వ్రయ్యలువాఱ నేసి
వనజాసనున కైన వారింప రాని
యనువునఁ బోరాడ నడరి భీష్ముండు
భయ మేది నరునిదాపలిభుజంబునను
రయ మొప్ప దొడ్డనారసము నాటించి
సిందూరములతోడిసింధురం బనఁగ
నందంద రక్తసిక్తాంగుఁ జేయుటయు
వెండియు నాతనివింటి నర్జునుఁడు
ఖండించి యార్వ నఖండకోపమున

నతఁడు వేఱొకచాప మరయునాలోన
శతలక్షశతకోటిశతపరంపరల
ఘన మైనయుగము వ్రక్కలు సేయ నతఁడు
పని చెడి రథముపైఁ బడి మూర్ఛపోవె.
పోయినయెడఁ జిన్నఁబోయి సారథియు
నాయనరథము నొయ్యనఁ దోలుకొనుచు
నచ్చోటు దొలఁగిన నాహవక్రీడ
నిచ్చలోఁ దనివోక యింద్రనందనుఁడు
తల యెత్తి చూచి రాధాపుత్త్రుఁ గృపునిఁ
గలశజు మఱియు నక్కడివారిఁ గాంచి

అశ్వత్థామ మర్మభాషణంబులఁ
గర్ణునిం గేలి సేయుట.

యటఁ దేరు దోలింప నంత ద్రోణజుఁడు
పటుతరాటోపుఁ డై పలికె భానుజుని
"గాండివి మఱియు నిక్కడ వచ్చెఁ గర్ణ
చెండాడి విడుచును సేన నంతయును;
ఏవంకఁ దొలఁగుద మేమి సేయుదము?
నీవు మార్కొన రాదె నిలుచు నీచేత;
సకలసేనలు గాచి జయసిద్ధిఁ బొందు
మొకని కొక్కఁడు చాలు యుద్ధంబు సేయ"

నని మర్మ మెత్తిన నతఁడు కోపించి
"నను గేలి గొనఁగ మానఁగఁ జాల వకట.
ఇంకఁ దప్పక చూడు మితనిసత్త్వంబు
బొంకు చేసెద నీవు బుద్ధిలో మెచ్చ"
ననుచు రాధేయుఁ డాహవకాంక్షుఁ డగుచుఁ
జనఁ జొచ్చె నతనిపై సైన్యంబుతోడ.
క్రమ్మరి యిటు వచ్చుఘనసేన నంత
నిమ్ములఁ జూచి దేవేంద్రనందనుఁడు
వెలయఁ బండినచేను వృషభంబు సొచ్చు
పొలుపునఁ జొచ్చి యద్భుతలీల మెఱయ
సైరింప రానియస్త్రములు సంధించి
ధీరుఁడై శరములు ద్రెంపఁ బూనుటయు
నతనిబాహాశక్తి యంత కంతకును
వితతమై హెచ్చుట వీక్షించి సేన
పతికి లజ్జించినబాలచందమున
ప్రతిచేష్ట చేయ నేరక యూర కుండె.
అంత గాండీవి కిట్లనియె నుత్తరుఁడు
"కౌంతేయ రమ్ము సంగ్రామమ్ము చాలు;
ఇది యాదిగా నొక్కయేఁడు పోరినను
మదిలోన రణకాంక్ష మానదు నీకు!

రక్షింపఁ గురుసేనలకు సిగ్గు లేదు;
శిక్షించి విడిచినఁ జెదరి పోవలదె?
చదియంగఁ గొట్టిన జాఱంగ లేక
పదిలమై కలసి యెప్పటియట్ల వచ్చు!
ఎన్నఁడు మోక్ష మిం కెన్నఁడు గెల్పు!
ఎన్నఁడు విరటుతో నేను భాషింతు?
సూతకృత్యమునకుఁ జొరఁ జాల నింక;
చేతులు నొచ్చె నొచ్చితి" నన్న నవ్వి
నరుఁ డొప్ప ననియె "మానవనాథతనయ
కర మొప్ప నీ డేఱెఁ గార్య మంతయును.
తొడరి యింతకు మున్ను దుర్యోధనునకు
నుడియుతూపులచవి చూపంగ లేదు;
అతఁడును సన్నద్ధుఁడై యున్నవాఁడు
హితులుఁ దమ్ములుఁ దాను నిదె కయ్యమునకు.
తురగరత్నంబులఁ దోలి వేసరితి,
పరఁగ నేనును దోడుపడువాఁడ" ననుచుఁ
"దేరు పోని" మ్మని తెలిపి చెప్పినను
ధీరుఁడై యపుడు ధాత్రీపాలసుతుఁడు

బీభత్సుఁడు దుర్యోధనునిపై సాయకంబులు
వఱపి పరిభవించుట.

సేనలు చెదర నాక్షితిభాగ మదర
భూనభోంతరము నద్భుతధూళి మునుఁగ
రారాజుపై వాఁడు రథము దోలుటయు
వారును మదిని దుర్వారకోపమునఁ
బైపాటు సేయుచోఁ బార్థుండు వారిఁ
బ్రాపైనతూపులఁ బాఱఁ దోలుచును
గురురాజుఁ దాఁకి వక్షోవీథియందు
సరవి నాటఁగ రెండుశరము లేయుటయు
మదధార లొలికెడుమదహస్తిపోలెఁ
గదలి నెత్తురు గాఱఁ గౌరవేశ్వరుఁడు
నొలిగా నెత్తురు లొలుక నర్జునుని
ఫాలమ్ము వాలమ్ముఁ బరఁగ నాటించి
యొకరశ్మిమున్నుగా నుదయించుసూర్యు
నకలంకగతిఁ బొల్చునతనిపై మఱియు
బొమముడి నెరయంగ భూరిబాణములు
శమనమహారాతిసముఁ డౌచుఁ బఱపి
యాతనిబాణంబు లంతంత నఱకి
చాతుర్యమున నొక్కశక్తి వైచినను

"మేలు దుర్యోధన మేలు మే" యనుచుఁ
జాల సంతోషించి శక్రనందనుఁడు
అతఁడు వైచినశక్తి నవనిపైఁ గూల్చి
మితి లేనిశరముల మెఱసి వర్షించి
లాక్షాగృహంబు గాల్పఁగ నున్నపగయు
నక్షీణకపటాత్ముఁ డై యున్నపగయు
నెడపక పాంచాలి నీడ్చినపగయు
నుడుగక పుట్టంబు లొల్చినపగయు
నొక్కట సాధింప నుద్యోగపడఁగఁ
గ్రక్కున నతనిభాగ్యముకల్మిఁ జేసి
ఘనుఁడు వికర్ణుండు కరిరాజు నెక్కి
తనవెంట రథములు తవిలి యేతేర
జలదంబుపై నున్నజంభారిపోలె
బలుతూపుగములను బార్థుఁ గప్పుచును
ఎడఁ జొచ్చి నిల్చి తా నెల్లసేనలకుఁ
గడువేడ్క సేయుచోఁ గాంతేయుఁ డలిగి
కాలదండముఁ బోలుకఱకునారసము
లీల సంధించి వాలినదృష్టి నిలిపి
తెరఁ గొప్పఁ దెగ నిండఁ దిగిచి యేయుటయుఁ
బరఁగంగ నది దంతిఫాలంబు నాటి

ఱొనర వాలముచాయ నుచ్చి పోవుటయు
ననయంబు నొప్పిచే నామహాగజము
కులిశంబు దాఁకినకుంభినీధరము
చలియించి కూలినచందమై కూలె.
అతిభీతుఁడై యంత నావికర్ణుండు
ధృతిఁ బాసి తనయన్న తేరుఁ జేరుటయు
నరుఁడు వేఱొకదొడ్డనారసంబునను
గురురాజు నొప్పించి కురుసేనమీఁద
గణుతింప రానిమార్గణము లేయుటయు
రణము చాలించి కౌరవరాజుసేన
యేలినవారి నయ్యేడఁ బాఱవైచి
కాలిచప్పుడు దివ్యకటకంబు ముట్ట
రథములు విడిచి వారణములు విడిచి
ప్రథనంబు విడిచి గర్వము లుజ్జగించి
కురుభూమికై మెండు గూడి పాఱుటయుఁ
గురురాజుఁ దానును గుట్టు పో విడిచి
సారథి యపుడు మెచ్చఁగ వేగమునను
దేరు దాఁ దోలుచు ధీరుఁడై మరలి
గాలిఁ బోవుచు నున్న కాఱాకుపోలె
తేలి పాఱఁగఁ జూచి తిర మేది దొరలు

తారును దమయంతిఁ దగిలి పాఱుటయు
వారక నరుఁ డంత వారి వెన్నగిలి
వివిధసాయకములఁ వేధించి తోలి
రవిసూనుపెడతల రయ మొప్ప నేసె;
దివిజులు కొనియాడ దివ్యశంఖంబు
రవళిచేసినఁ జూచి రవితనూభవుఁడు

దుర్యోధనునిఁ బ్రోవఁ గురుసేనలోనిదొరలఁ
గర్ణుండు పిలుచుట.

"కలశసంభవ పోకు; గాంగేయ తిరుగు;
భలభేదిసూనుండు పతిమీఁద వచ్చె.
నిలువు మశ్వత్థామ నిలువుము శకుని;
ఎలమి సందడిఁ జోదురే కృపాచార్య?
ఇప్పుడు ప్రాపుగా నీనృపాలునకుఁ
జెప్పఁడు మన మేమి చేయంగ నొప్పు?
పదివేల రక్షించుపతి రక్షసేయ
నిది వేళ" యనుటయు నెల్లసైనికులు
"తిరుగ నోపినఁ గర్ణ తిరుగు; మే మైనఁ
దిరుగ నోపము పార్థు తెరువు పో లేము.
తనువున నర్జునాస్త్రములు గ్రిక్కిఱిసె;
దొనలలో వెదకినఁ దూపులు లేవు;

రథికయు గ్రమ్మ లొక్కరథముపై నిలిచె;
రథముల రెండేసిరథ్యంబు లయ్యె;
పటుశస్త్రములు వైచి బలిమిఁ బోనాడి
భటు లాలమును బాసి పాఱు చున్నారు;
పోయినకయ్యంబు పోవ నీ" మ్మనుచు
వాయువేగముతోడ వచ్చుచో నపుడు
"వెనుకఁ జిక్కినసేన వెసఁ గూడికొనక
చనుట ధర్మము గాదు చర్చింప మనకు;
చెన్నారఁ గవ్వడిచేతితూపులకుఁ
గన్నులు గల వెండుఁ గాఁడునో యెఱుఁగ!
కూడి పొం" డనుచును గురుఁడు భీష్ముండు
వీడినసేనకు వెనక యై నిలిచి
యొయ్యనఁ బోవుచో నానరఁ బార్థుండు
చయ్యన నెఱుఁ గత్తి జననాథుఁ బిలిచి

సేనతోడం బాఱుదుర్యోధనునితో
నర్జునుఁడు కేరడంబు లాడుట.

"నిలుము దుర్యోధన నీయంత రాజు
తొలఁగి పోవునె యిట్లు దురము చాలించి?
నీవు నీపుత్త్రులు నీసహోదరులు
నీవు మన్నించిననృపులు నీసఖులు

వచ్చితి; శే నొంటి వచ్చి తాఁకుటయు
విచ్చితి రిది చూడ వీరధర్మంబె?
గజపురివీరవర్గము లెల్లఁ జూడ
గజముపై వచ్చుట గాదు కయ్యంబు!
తద్దయుఁ గై నేసి తగఁ గొల్వులోన
గద్దెపై నుండుట కాదు కయ్యంబు!
అస్తోకదివ్యగంధాకీర్ణ మైన
కుస్తూరిఁ బూయుట కాదు కయ్యంబు!
సంతోషమున రత్నసౌధంబులందుఁ
గాంతలఁ గూడుట కాదు కయ్యంబు!
ఏదిగాఁ జూచితి వీవు కయ్యంబు?
జూద మాడిననాటిచూాటలు గలవె?
పోలు పోంగ నీకొక్క బుద్ధి చెప్పెదను
తోలఁగక నీవు మాతోడ మార్కొనుము;
ఏనును నినుఁ బట్టి యెల్లరుఁ జూడఁ
బీను గుఁ జేయుచోఁ బృథివీశ వినుము
ఎదురుగా వచ్చు దేవేంద్రలోకంబు!
చదు రొప్ప నందలిసౌఖ్యంబు మేలు!
అటుకాన౯ బాటిన నపకీర్తి నీకు;
కుటిలవర్తన నిన్నుఁ గొల్తురే నృపులు?

పోరాడు, పోయినఁ బోవ నీ" ననినఁ
గౌరవనాథుఁ డాగ్రహముతోఁ దిరిగి
తొలఁగక గాంగేయద్రోణులఁ గడచి
బలభేదిసుతుఁ దాఁకి బవరంబు సేయ
దొరలును మరలి బంధుర బాణవర్ష
నిరతులై తాఁకిరి నెమ్మి నర్జునుని.
వారలఁ జూచి కవ్వడి విల్లుఁ ద్రిప్పఁ
గౌరవబలము నక్కడఁ బోక తిరిగి
ధైర్యంబు భీతియుఁ దగిలి వర్తింప
శౌర్యభూషణుఁ డైనశక్రజుఁ దాఁకి
భూరజఃపటలంబు భువనంబు నిండ
నారాచరోచులు నలువైపు లలమ
సింహనాదార్భటిఁ జెవులు ఘూర్ణిల్ల
రంహవిస్ఫూర్తి తోరంబుగాఁ బ్రబలఁ
గరవాలపటుశూలఘనభిండివాల
శరజాలముల నెల్లఁ జతురులై కప్ప
నవ్వాడి కొదుగక యాలంబు సేయు
కవ్వడిపై వాఁడు కలనేర్పుఁ జూపి
వడి నెల్ల దిక్కులు వ్రయ్య నార్చుటయుఁ
గడు నుగ్రుఁ డై మండి గాండీవధరుఁడు

అలయక రిపుల గూ పణఁప నోపియును
దెలిసి పాండవులప్రతిజ్ఞ లూహించి
"పేర్చి వీరల భంగపెట్టెదఁ గాని
చర్చింప నూరక చంపఁ బో" మ్మనుచు
సమ్మదంబున మున్ను శక్రుచేఁ గొన్న
సమ్మోహనాస్త్రంబు సంధించి మించి
సేనలఁ గలయ నీక్షించి యేయుటయు
మేనులు మఱచి భూమికి వ్రాలి తూలి
శరశరాసనములు జాఱంగ విడిచి
పరఁగ నిద్రలు వోవుపగిది నందఱును
నెట్టన వివశులై నెఱి వింధ్య మాఁక
పెట్టినగతి నుండఁ బ్రీతుఁడై నవ్వి
తనలోనఁ బార్థుఁ డుత్తరమాటఁ దలఁచి
మనుజేంద్రసుతుఁ జూచి మక్కువఁ బలికె

మూర్ఛిల్లినకురువీరుల శిరోవేష్టనముల
నుత్తరుఁడు సంగ్రహించుట.

"ఉత్తర నీ వింక నుగ్రసైన్యముల
హత్తినసొక్కు మాయక మున్నె కవిసి
నలువుగా ద్రోణనందనసుయోధనుల
తలచుట్లు తిగిచి యెంతయు వేగమునను

భానుజుతల నున్నపచ్చనిపాగ
మానక తిగిచి క్రమ్మర ధీరు లైన
ద్రోణునికృపునిశిరోవేష్టనములు
జాణతనంబున స్రంధించి తెమ్మ.
హితపుణ్యుఁ డగుభీష్ముఁ డీయస్త్రమునకుఁ
బ్రతికృతి యెఱుఁగుమూర్ఛ యుఁబొందకుండు.
అతనిఁ జేరకు'' మన్న హరులపగ్గముల
నుతలీల సమ్మెట నొగలతో ముడిచి
యను వొప్పఁ బోయి వాఁ డవి యెల్లఁ దిగిచి
కొని వచ్చి నిలిచెఁ గ్రక్కునఁ దేరిమీఁద.
అట్టిద కాదె నాఁ డబలవస్త్రంబుఁ
బట్టినదోషంబు ప్రాపించె నృపుని!
తనరార నంత నుత్తరుఁ జూచి నరుఁడు
మన కింక రిపులసమ్మర్దంబు వలదు
తురతుర మన తేరు దొలఁగింపు మనిన
సురనదీసూనుఁ డర్జును వచ్చి తాఁకి
"యెందుఁ బోయెద" వని యెలుఁగెత్తి బాణ
సందోహములఁ గప్పి సంభ్రమించుటయు
"మీకు నేటికి రేఁగ మిగిలినయట్టి
చీకటి నిఁక'' నంచుఁ జెలఁగి యర్జునుఁడు

గరళంబురూపు లై కర మొప్పుతూపు
లరుదార నేయుచు నటఁ జిక్కుపఱిచి
యడరి రాహుగ్రస్త మై నోరిలోన
వెడలినయినుఁ బోలె వెడలె నచ్చోటు.
అప్పుడు మూర్ఛ యొయ్యనఁ దేఱి విభుఁడు
తెప్పలు దెఱచి జాఱినవిల్లు దాల్చి
తలచీరఁ గాన కెంతయు వెచ్చ నూర్చి
నలుదిక్కులను జూచి నరు నొప్పఁ గాంచి
కాలాగ్నిరుద్రుని కరణిఁ గోపించి
యాలంబు సేయ నుద్యతుఁ డైనఁ జూచి
పఱఁగ లేనగవుతోఁ బలికె భీష్ముండు
"నరనాథ యింక మానఁగ రాదె రణము?
నరుచేతఁ జిక్కి సైన్యముఁ జంపుకొనక
తిరిగి యూరును జేరి తెఱఁ గొప్పఁ బాండు
తనయులకును వారితండ్రిపా లొసఁగి
పెనుపారుకూరిమి వెలయించు టొప్పు.
ఈమాటు నామాట యిచ్చలో నాటు
మీమచ్చరము నేఁటి కేమిటి?" కనిన
గురుమంత్రయుత మైన ఘోరాహి వోలెఁ
గురురాజు నిలిచె నక్షులఁ గెంపు గదుర.

### మూర్ఛఁ దేఱి కౌరవసేన
### పాఱి పోవుట.

ఇతరసైన్యంబులు నెలమితోఁ ద్రెళ్ల
కిత వాడె నని భీష్ము నెలమితోఁ బొగడి
రారాజు నొకకొంత రక్షించుకొనుచు
భేరులరొద మాన్చి బీరంబు లెడలి
బెదరుచుఁ దమయూరిపెనుద్రోవఁ బట్టి
కదలినఁ జెడ నార్చి గాండీవధరుఁడు
గుణనాదమున శంఖఘోరనాదములఁ
బ్రణుతించుదివ్యులభాషణంబులను
భూనభోవీధిఁ గప్పుచు నంటఁ దఱిమి
సేనకుఁ "బోయి వచ్చెద" నని చెప్పి
బెడఁ గైనగొడుగులు బిరుదుటెక్కెములు
నడియాలముల నెల్ల నవనిపైఁ గూల్చి
సరసుఁ డై గురుకృపాచార్యభీష్ములకుఁ
బరఁగ నమస్కారబాణంబు లేసి
యొకమిట్టకోల నయ్యురగకేతనుని
మకుటరత్నంబులు మహి డొల్ల నేసి
వారి వీడ్కొనినభావము నిర్వహించి
ధీరుఁ డై నిలిచినఁ దెరలి సైన్యములు

"ఇటు వేగ పద" మని మెచ్చరించుచును
"భటులు రా లే" రని పతికిఁ జెప్పుచును
బెల్లుబ్బుదప్పిచే బెగడొంది నడచి
యూళ్లలోఁ జొరఁబడి యుదక మానుచును
హయములు మట్టించె నని డిగ్గి చనుచు
"రయమున రాదు వారణ మేల" యనుచుఁ
గురుసేన పోయినఁ గుంతినందనుఁడు
పరితోషమున మత్స్యపతిసూనుఁ జూచి
"మనకు గోవులు వచ్చె; మనము గెల్చితిమి;
మనచేత రారాజు మదము గోల్పడియె!
రయ మొప్ప దొరలు చీరలు దోఁపుపడిరి!
భయముతో వైచిరి పడగ లన్నియును!
మచ్చరింపఁగ నేల మరలింపు తేరు
వచ్చియుఁ దడ వయ్యె వాహంబు లలసె.
నీతల్లి ప్రజ లెల్ల నీరాక కెదురు
చూతురు శంకింపఁ జూతు రింతకును;
నడపింపు మనుటయు నరనాథసుతుఁడు
తడయక పాండునందను తేరు ద్రిప్పి
నలువు మీఱఁగ మత్స్యనగరమార్గమునఁ
నలయక వచ్చుచు నమరేంద్రసుతుఁడు

ఉత్తరాయనమున నుండిభాస్కరుఁడు
క్రొత్తగా యామ్యదిక్కున కేగునట్లు
మీఱి యేతెంచుచు మెఱయ మార్గమునఁ
బాఱ నోపక పోవుభటుల నీక్షించి
"వెఱవకుఁ డోరి మీవిభుఁ గూడి పాండు
నెఱి మిమ్ముఁ జంప మన్నించితి" ననుచు
నభయహస్తం బిచ్చి యాసేనచేత
శుభమైనదీవెన లొప్పరిదిఁ బొందుచును

ఉత్తరునితో నర్జునుఁడు తన్నుఁ బ్రకటింప
వల దని చెప్పుట.

ఒకకొంత దవ్వేగి యుత్తరుఁ బలికె
"ప్రకటింప వలదు భూపతితోడ నన్ను;
కురుసేన గెల్చిన గురుశక్తి యెల్లఁ
గర మొప్ప నీశక్తిగాఁ బ్రతిష్ఠింపు.
తనరూపు నెన్నఁడు ధర్మనందనుఁడు
మనుజుల కెఱిఁగించు మనుజేంద్రతనయ
మాకు నప్పుడు గాని మాతోడివిధముఁ
గైకొని వర్తింపఁ గాదు కావునను
రథికుండ వీవు సారథి నే నటంచుఁ
బృథివీశునకుఁ దెల్పు ప్రియముతో" ననిన

భావించి లజ్జించి పలికె నుత్తరుఁడు
"భూవిభుఁ డెఱుఁగఁడె బొంకైనమాట
వెసఁ గౌరవుల నేను విదళింప లేమి
వసుధేశుఁ డేల యెవ్వరు నెఱుంగుదురు!
మంచున నణఁగునే మార్తాండరుచులు?
నించినసిలావు నెఱి దాఁప నేర;
నీయనుమతి లేక నీప్రసంగంబు
సేయ నేఁ బతితోడఁ జిరకీర్తిహార;
మీవాఁడ మీయాజ్ఞ మీఱ లే" ననఁగ
నావాసవాత్మజుం డట జమ్మిఁ జేరి
యొనర గాండీవాదియుద్ధసాధనము
లనువుగాఁ దొల్లిటియట్ల కట్టించి
కపికేతనంబు శంఖముఁ గిరీటంబు
విపులముల్ మఱి కొన్ని వేల్పు లిచ్చినవి
వీక్షించి మ్రొక్కి వేర్వేఱ వీడ్కొల్పి
యక్షీణరథముపై హరికేతు వెత్తి
యత్తఱిఁ దొంటిశస్త్రాస్త్రంబు లిచ్చి
యుత్తరు రథికుగా నొనరించి తాను
సారథి యై నపుంసకరేఖఁ దాల్చి
ధీరుఁ డై నొగ కెక్కి తేరు దోలుచును

అరుదెంచునంత నయ్యానఁ గొల్వు విరిసి
సురరాజు మునులతో సురలతోఁ గూడి
నరునిఁ గీర్తించుచు నరుని మెచ్చుచును
నరుఁడు నారాయణునకు నాత్మ యనుచు
నది ప్రసంగంబుగా నానంద మంది
త్రిదివంబునకుఁ బోయి తెఱఁ గొప్ప నుండె.
అప్పు డుత్తరుఁ జూచి యాక్రీడి పలికె
“ చెప్పి పంపుము నీదు సేమంబు పురికి
గోపాలకులు వీరె కొలిచి యున్నారు
నీపంపు సేయఁ బూనినవార” లనిన
రాజనందనుఁడు వారలఁ జేరఁ బిలిచి
మోజించి పంప మహోత్సవంబునకు.
అంతకు మున్నె మత్స్యాధీశుఁ డచటఁ
గాంతేయుఁడును దాను గదనంబు గెలిచి
మెం డైనచీరలు మేఁకుఁగారుమణులు
దండనాయకులకుఁ దగఁ గట్ట నిచ్చి
విభవ దేవేంద్రుఁ డై వెసమత్స్యపురము
శుభముహూర్తంబున సొత్తెంచునపుడు
చెలఁగి పుణ్యస్త్రీలు సేసలు చల్ల
నలఘువిప్రులు పుణ్య లాశీర్వదింప

వందిమాగధకోటి వరుసఁ గీర్తింప
మందిరద్వారంబు మఱి చేరి నిల్చి
"యలసి వచ్చితి" రస యాసెన నంపె
యెలమిఁ బాండవులును హితులు నేతేర
వారిమధ్యలును గొల్వ నంతఃపురమున
కరుదెంచి రత్నసింహాసనంబునను
సుఖలీలఁ గూర్చుండి సుముఖుఁడై పద్మ
ముఖిఁ జూచి మోహంబు మొనయ నిట్లనియె
"ఉత్తరుఁ డెచ్చోట నున్నవాఁ?" డనిన
మత్తకోకిలవాణి మనుజేంద్రుఁ జూచి

ఉత్తరుఁడు యుద్ధమునకుఁ బోయినాఁ డని విని విరాటుఁడు పరితపించుట.

"వినవయ్య తెలిపెద విరట భూపాల
మనమీఁదఁ గురురాజు మచ్చరం బెత్తి
తానును గురుఁడు మందాకినీసుతుఁడు
భానుజకృపులు సౌబల ద్రోణసుతులు
నెఱయుసైన్యముతోడ నెఱబీర మొప్పఁ
బఱతెంచి మనయూరిపసులఁ బట్టుటయు
నగధీరుఁడై బృహన్నల దేరు గడపఁ
దగఁ గూయివోయె నుత్తరకుమారుండు"

అనినఁ గంపించి మత్స్యాధీశ్వరుండు
తనమంత్రివరుల నందఱఁ జూచి యనియె
"పసులఁ బట్టుట విని పసిబిడ్డ గానఁ
బోసఁగ మీఁ దెఱుఁగక పోయె నుత్తరుఁడు.
ఇతఁ డెంత, కురువీరు లెంత? మీ రకట
హితవు మాడక కాతని నెట్లు పుచ్చితిరి?
తప్పెఁ గార్యము గానఁ దగుసేనఁ గూర్చి
యప్పాపనికి సాయ మను వొందఁ జేయ
మీబలంబులు మీరు మెఱసి పో వలయు
నా బాలుఁ గొని తెచ్చి నను (బోవుఁ" డనినఁ
గంకు డి ట్లనియె భూకాంతు నీక్షించి
"శంక నీ కేల సుశర్మ గెల్చియును?
వాఁ డోడెఁ గాన నవ్వాలను రారాజు
నేఁ డోడి పోవుట నిర్ణయించితిమి.
అదియునుగాక బృహన్నల నేఁడు
కదనంబునకుఁ దోడుగాఁ బోయెఁ గానఁ
గురుసేన గెల్చుట కొనియాడ నేల?
సురసేన నైన నీసుతుఁడు నిర్జించు"
నని తెల్ప మఱియు భీతాత్ముఁ డై నృపుఁడు
తనబాంధవులఁ జూచి తగుసంభ్రమమున

"నేమి సేయుదు నింక? నెల్లసైన్యములు
భీమయుద్ధము చేసి పెద్ద నొచ్చినవి.
పోటులు దాఁకక పోడ వైనవారిఁ
బాటించి రిపులపైఁ బంపెదఁ గాక.
మునుపు రా లేనైతి! ముద్దుపాపనికి
ననిలోన నేచంద మయ్యెనో నేఁడు!"
అని తలపోయునయ్యవసరంబునను
బనివడి యొక్కగోపాలుఁ డే తెంచి
నరపతిఁ గాంచి "భూనాథ మీకొడుకు
గురుబలాధిక మైనకురుసేన గెలిచి
యాలమూఁకలు ద్రిప్పి యాలంబులోనఁ
గాల ముల్లాడక గాకీశుకృపను
సారథియును దానుఁ జనుదెంచు చుండి
వారలయీ మేలువార్త చెప్పుటకు
మున్నాడి పొమ్మని మొగి నన్నుఁ బనుపఁ
జెన్నార నేను వచ్చినరాక" యనిన

ఉత్తరుఁడు జయించినాఁ డనుమాట విని
విరాటుఁడు సంతసిల్లుట.

జననాథుఁ డానందజలధిలో మునిఁగి
తనువునఁ బులక లెంతయు విస్తరిల్లఁ

బటుల మై పొడమినబాష్పబిందువులు
పటునఖంబుల నూడ్చి పాఱఁ జల్లుచును
సకలమంత్రులఁ జూచి చాల గర్వించి
యకలంకచిత్తుఁ డై యర్థి ని ట్లనియె
"ఇది గాక సంతోష మిది గాక తేజ
మిది గాదె సత్పుత్త్రు నిలఁ గాంచుఫలము!
అర్జునుం డన మించి యఖిలకౌరవుల
నిర్జించె మద్వంశనిస్తారకుండు!
కరిరాజముల మీఁద ఘంట వెట్టించి
పురిలోనఁ జాటఁ బంపుఁడు వానిజయము.
వేదపారగు లైనవిప్రపుంగవుల
వాదిత్రములతోడ వాహనంబులను
వరరథవ్రతతుల భద్రద్విపముల
గురుశౌర్యరంజితకోటిసైనికులఁ
బాదివి కై చేసినపుణ్యభామినుల
నెదురుగాఁ బుచ్చుఁడు హితు లెల్లఁ బొందు.
మకరతోరణములు మణితోరణములు
ముకురతోరణములు మొగి నెత్తికొనుచు
నతివలుఁ దానుఁ బుష్పాక్షత ల్గొనుచు
హితరీతి ను త్తర నెదురు పో మనుఁడు"

అని మంత్రులకుఁ జెప్పి యాగోపకులకు
ధనధాన్యములు లిచ్చి ధర్మజుఁ జూచి
చెయుత్తిన వేడ్కతో నాఁగ "నక్షపలక
నెత్తమాడుద" మన నృపుఁ జూచి యతఁడు
"నీవు సుమాళించి నిన్ను నీ వెఱుఁగ
వీ వేళ నీతోడ నే నాడ" ననిన
నించుక నగుచు ధాత్రీశుఁ డచ్చోటఁ
బాంచాలిచేత నప్పలకఁ దెప్పించి
సారెలు దిగిచి "యీసారి ర" మ్మనిన
నారసి ధర్మజుం డవనీశుతోడ
"ఈజూదమునఁ గాదె యెలమి ధర్మజుఁడు
రాజచిహ్నము లోడి రాజ్యంబు నోడి
యనుజుల నోడి పుణ్యాంగన నోడి
వనముఁ గొల్వఁగఁ బోయె వలదు జూదంబు"
అనియు సారెల నంది యాడంగఁ దొడఁగె.
అను నైనచోటఁ దా మఱి నిద్దఱును
చవ్వంచ దుగయును సతయు దుచ్చొక
తివ్వంచ భార యిత్తిగయు వేఁడుచును
ఆడఁగ విరటుఁ డిట్లనుఁ "గంకుభట్ట
కూడినకురుసేన ఘోరాజిఁ దాఁకి

పోడి గా దనక యల్పులె వీర లనక
తో డెవ్వ రనక కైదువు దాఁకు ననక
తల మిాఱి గెలిచె నింతటి వాఁడు గలఁడె?
కుల ముద్ధరించినకొడుకు నాకొడుకు
ధాత్రిలో నిదియుఁ జిత్రము గాదె" యనిన
"ధాత్రీశ విను" మని ధర్మరా జనియె
"కౌరవు లెల్ల నిక్కడ వచ్చి రనఁగ
బోరునఁ బోయి మిాభూమింజయుండు
వారలబాహుగర్వమునకు నోర్చి
శూరుఁ డై గెల్చి వచ్చుట నిక్కమైన
నితనిఁ బోలిన వీరు లెవ్వరు గలరు?
హితబుద్ధి వీని మిా రెఱుఁగరే?" యనిన
నుర్వీశుఁ డామాట కోర్వంగ లేక
గర్వించి పాండవాగ్రజువంకఁ జూచి
"ఎలమి నిట్లను టెల్ల నీవు మాసుతుని
గెలుపు లే దనెడు చక్కియపలుకు గాదె?
చాలు నూరక యుండు సన్యాసి వగుటఁ
జాలించి విడిచితి సకలకోపములు.
తగఁ బెద్ద వయ్యుఁ బెద్దలజాడ నుండ
కగునొకో నీ కిటు లాడు చుండఁగను?"

బృహన్నల గెల్చె ననుధర్మజుమాటకుఁ గినిసి
విరాటుఁ డతని సారెతోఁ ద్రేయుట.

అని మిట్టఁ గోపించి యానెత్తపలక
నినదంబు ఘనముగా నృపుఁ డాడుటయును
అది లెక్కసేయక యమతనూభవుఁడు
మదిలోన గర్వించి మఱియు నిట్లనియె
"నరనాథ మనబృహన్నల తేనుమీఁద
నరివీరశౌర్యాపహారి యై నిలిచి
'భుజబలం బచటఁ జూపుటచేసి కాదె
నిజముగా గెలిచెను నీకుమారుండు.
అతఁడు తోడై యున్న నమరేంద్రు నైనఁ
గృతకృత్యుఁ డై తాఁకి గెలుచు నుత్తరుఁడు.
అసముఁ డాతఁడు గల్గ నాలంబులోన
బిసరుహాక్షున కైన బెదరఁ డుత్తరుఁడు;
అట్టి తోట జయ మొందు టబ్రంబె?" యనినఁ
గటము లొప్పంగ నుత్కటకోపుఁ డగుచు
నరనాథుఁ డాధర్మనందనుఁ జూచి
"ధరలోనఁ గ్రొత్తచందములు చెప్పెదవు;
సారథు లేయూర సమరంబు గెలిచి
శూరు లై యున్నారు చోద్యంబు గాఁగ?

వేఁ గాఁగ నోర్చితి నిన్నిమాటలకు
లోఁగక యింకఁ బల్కుట గాదు విడువు"
మనుటయుఁ జలముతో నతఁడు వండియును
జననాథుఁ జూచి హాస్యము దోఁపఁ బలికె
"వెస బృహన్నల నేఁడు వీరాహవమున
రసికు మీసుతుని సారథిఁ జేసి తాను
ధనువు ధరించి యుద్ధము చేసెఁ గాని
యొనర సారథికృత్య మొనరింపఁ డతఁడు;
కడపట నిట్లు కాఁ గలదు కార్యంబు;
తడయక నీవింక ధరణీతలేశ
నగరంబులో బృహన్నల గెల్పు చాటఁ
దగువారిఁ బంపుము తగ నొప్ప" ననినఁ
జండకోపావేశజాల్యుఁడై మండి
దండ మెత్తినదండధరునిచందమునఁ
దనచేతిసారె నుద్ధతిఁ బూని ధర్మ
తనయుని నేయఁ గ్రోధము లేక యతఁడు
తొడరి యజాతశత్రుఁడు గాన నవ్వి
తడయక ద్రుపదనందనఁ జూచుటయును
అరుదారఁ జనుదెంచి యావ్రేటుగంటిఁ
దొరఁగు నెత్తురుఁ జూచి ద్రుపదతనూజ

యది మెల్లఁ దనదుపయ్యెదకొంగునందు
మృదువుగాఁ దుడిచి యమ్మెలఁత వెండియును
బసిఁడి బిందియ యందు భాసిల్లునీటఁ
బస మీఱఁ దనపాణిపద్మంబు దడిపి
తుడుచుచో "నీ వేల తుడిచెద?" వనిన
పుడమిఁ దేనికిని నాపూఁబోఁడి యనియె
"ఇతఁ డుత్తమాచార్యుఁ డితఁ డసదృశుఁడు;
ఇతనినెత్తురు ధాత్రి నెన్నిబిందువులు
రాలెడి నన్నివర్షములు నీభూమిఁ
జాల దుర్భిక్ష దోషము గల్గుఁ గాన
విను నీకు హితము గావించితి" ననుచు
నొనరంగఁ దుడుచుచు నుండె నమ్ముదిత.

అర్జునుఁడు నుత్తరుఁడును బురముఁ
ప్రవేశించుట.

అంత నక్కడఁ బౌరు లాయుత్తరునకు
నెంతయు వేడ్కతో నెదురుగాఁ బోయి
శుభతూర్యములు కర్ణసుఖముగా మ్రోయ
శుభవాక్యములతోడ సొం పగ్గలించి
నరనాథసుతుమీఁద నరుమీఁద నపుడు
సరసాక్షతలు నిండఁ జలి దీవించి

రావేశఁ జూపఱు లలమారుగఁజెమొ
భావింప భావజుపటుశస్త్రమొకొ్క
యసమ యామరునిమోహనవిద్యయొకొ్క
కుసుమాస్త్రసతిచిల్కకొదమయానొకొ్క
యని యాత్మ నబ్బురం బంది చూడఁగను
ఒనర బంగరుబొమ్మ యొప్పు గైకొనుచు
వేవురుకన్యలు వెన్నాడి కొలువఁ
దా వచ్చి నగుచు నుత్తర యన్నమీఁద
విజయుమీఁదను గూర్మి వెలయంగ నంత
నిజకటాక్షప్రభ ల్నింగి నిండఁగను
మృగనాభితోఁ గూడి మే లైనవిరులు
నగరు మిశ్రము లైనయాణిము త్తెములు
గరపల్లవంబులఁ గర మర్థిఁ బట్టి
మురు వైనగాజులమొరపంబు లలరఁ
జల్లి క్రమ్మొక్కిన నంత సకలబాంధవులు
నుల్లంబు లింపార నుత్తరుఁ జూచి
"సాహసభుజసార జయరమాధార
బాహుదర్పోల్లాస వరకీర్తివాస
కురువీరులను దాఁకి కొమ రొప్ప జయము
నరుదార నిం కొరుఁ డందంగఁ గలఁడె!

నినుఁ బోలుశూరుండు నెగడునే యిలను!"
అనిపల్క నుత్తరుం డనువారఁ బలికె:
"కినిసి కౌరవులను గెల్చి వచ్చుటయు
మనపాఁడికుఱ్ఱలు మగిడి వచ్చుటయు
నాకును నీబృహన్నల గల్గఁబట్టి
చేకూరెఁ గాని నాజీవాల మెంత?
ఒనర సారథు లుర్వి నున్నారుగాని
తనరారుబలిమి నీతనిసాటి మెఱుఁగ"
నని సూతనుతి దోఁప నర్జునుఁ బొగడి
ఘన మైనరాజమార్గముఁ జొచ్చి వచ్చి
పతిమందిరముఁ జేరఁ బణిహారి నృపున
కతఁడు వచ్చుట యెల్ల నధిపుతోఁ జెప్ప
రాజును "రథికసారథుల నిచ్చటికి
రాజిల్లి తోడ్కొని రమ్ము పో" మ్మనిన
నరిగెడిపణిహారి నాధర్మసూనుఁ
డరుదారఁ బిలిచి యొయ్యన వానితోడ
"నీమొలు కెత్తురు నిల్చునందాఁక
నాయున్న యెడ బృహన్నల రాఁగ వలదు.
పరికింప నను భక్తిఁ బాటించుఁ గాన
విరటుఁ గోపించు నాత్రేటు చూచినను.

హితగతి నుత్తరు నిటఁ దెత్తు కాని
యతనిఁ దోడ్కొని రాకు" మని చెప్పి యనిపె.
నృపతియు "నిది యేమి యేకాంత" మనక
విపులహర్షావేశవివశుఁడై యుండె.
అత్తఱిఁ బడిహారి యాక్రీడి నిలిపి
యుత్తరుఁ దోడ్తెచ్చె నుర్వీశుకడకు.

ఉత్తరుఁడు తండ్రియొద్దకు
వచ్చుట.

అతఁడును సాష్టాంగ మపుడు గావింప
సుతుని రాఁ దిగిచి భాసురలీల నృపుఁడు
కౌఁగిటఁ జేర్చి గద్గదకంఠుఁ డగుచు
మూఁగినవేడ్క మోమున ముద్దు వెట్టి
కన్నీటఁ దోఁగి యాకస మొప్పఁజూచి
వెన్నప్పళించి దీవించుచో నతఁడు
నొక్కింతభీతితో నొగి ధర్మజునకు
మ్రొక్కుచు నతనిమోమున గంటిఁ జూచి
"ఇది యేమి?" యనిన ధాత్రీశుఁ డిట్లనియె
"నది నీకుఁ జెప్పెద నర్థితో వినుము:
నేటియుద్ధంబున నీగెల్పు గాఁగ
మాట లాడఁగఁ దాను మాటిమాటికిని

దనపేడి గెల్చె నుత్తరుఁడు గాఁ డనినఁ
గనలి నెత్తపుసారె గాఁడ నేసితిని.
ఇది స్వయంకృతదోష మీపహాని" కనిన
మదిలోన భీతుఁ డై మనుజేంద్రసుతుఁడు
"తగునయ్య కోపింపఁ? దప్పు చేసితిరి;
మగుడ నాడుదురయ్య మాన్యులే మనిన?
ఆడుట గాక నో నడచినా రతని!
పాడి దప్పినవారిఁ బాయదే లక్ష్మి?
కావున వీరి నిక్కడనె ప్రార్థింపఁ
డే వెంటఁ బోగులరా దీఘఁ్యమనసు.
కారణపురుషులు గారె వీ?" రనిన
ధారుణీనాథుండు తల్లడిల్లుచును
గంకుఁ బ్రార్థించినఁ గంకుఁ డిట్లనియె:
"శంకింప నేటికి జననాథతనయ
నాకుఁ గోపము లేదు; నరనాథుఁ డైన
నేకిల్బిషియుఁ గాఁడు హితకారిగాని.
పాడమె నూరక వాదు ప్రొద్దు కీ డనఁగ
జడియ నేల?" యటంచు శాంతంబు దోఁప
మనుజేంద్రునకుఁ దాను మంచివాఁ డగుట
ఘనత నుత్తరునకుఁ గాన్పించునంత

నరుఁడు ప్రవేశించి నరనాథుఁ గనినఁ
గర మర్థిఁ బ్రతినమస్కారముల్ చేసి
తగుచోట నునిచి యుత్తరువంకఁ జూచి
మొగమునఁ జిఱునవ్వు మొలవ భూవిభుఁడు
"ఉత్తర, నీవు లోకోత్తరప్రౌఢి
నొత్తినకౌరవవ్యూహంబుఁ జొచ్చి
కృపునిఁ గైకొనక గాంగేయుఁ గైకొనక
నృపునిఁ గైకొనక కానీనుఁ గైకొనక
గురుతనూజాతుని గురునిఁ గైకొనక
వెర వొప్ప సామంతవితతిఁ గైకొనక
కదుపులు మరలించి కదనంబు గెల్చి
త్రిదశవీరులు మెచ్చఁ దివిరి వచ్చితివి.
ఒకపౌఁజు విరిగిన నొకపౌఁజు గదియు
నొకవీరుఁ డోడిన నొకవీరుఁ డడరు!
ఓడినబల మైన నొకతేరివాని
నోడింతు మని కాని యులు కెత్తి పోదు.
నృపునిసన్నిధిఁ గాన నిఖలసైన్యములుఁ
గపటంబు లేక సంగ్రామంబు సేయు.
ధృతరాష్ట్రసుతు లన్న ధృతి నొక్కరొకరు
కుతలంబు గెలిచినక్రొవ్వాడిమగలు ;

దివ్యాస్త్రముల మించి దివ్యుల గెల్చి
భవ్యులై యున్న నేర్పరు లందులోన!
ఏరీతి మరలించి తివు గోగణము,
కౌరవసేన నొక్కటను గెల్చితివి?
రాణాజు విరిగి యారక యెట్లు పోయె?
నీరణస్థితి మాకు నెఱిగింపు'' మనిన

తండ్రి కుత్తరుఁడు కౌరవులతోడి
యుద్ధప్రకారముఁ దెలుపుట.

నుత్తరుం డిట్లను "నో మహీనాథ
చిత్తగింపవె యేను సేయు యుద్ధంబు;
గోవుల మరలింపఁ; గురుసేన నొంప.
ఆవేళ నొక్క పుణ్యాత్ముఁ డేతెంచి
తనమేను దేవేంద్రుతను వన నొప్పి
మనగోధనములు ద్రిమ్మర గెల్చె రిపుల.
అది విస్తరించెద నవనీశ వినుము:
కదనంబునకు నేను గర్వించి వెడలి
ధర సంచలింప నుద్ధతధూళి ముంప
నరుగుచు నున్నసైన్యము చూచి వెఱచి
యగదంబు డిగి పాఱ నతఁ డేగుదెంచి
తిరుగఁ దోడ్తెచ్చి యెత్తినభీతి మాన్చి

నన్ను సారథిఁ జేసి నయ మొప్పఁ దాను
సన్నుతి రథికుఁడై సైన్యంబు గదిసి
యందు భూపతిఁ జూచి యచట లే కున్న
ముందట మొనకు నై మున్నాడి పోయి
మొదవు లచ్చట నున్న ముదముతోఁ ద్రిప్పి
కదియుసేనల నెల్ల గాసిల్ల నేసి
సందడిఁ బడక గోచయ మేగునంత
ముందటఁ జను చున్న మొదటికౌరవులఁ
గనుఁగొని యసిసేయఁ గడఁగు చో బలము
జననాథుఁ గూడి యచ్చలముతో నిల్వ
వారితోఁ బోరాడ వసుధేశ వినుము
ధీరుఁ డానతనిమూర్తిని జూడ నరుఁడు
వైరులఁ బరిమార్చుపగిది చూపట్టె.
ఆరీతిపోరాట నతనిబాణముల
హతు లైరి సారథు లణఁగె రథ్యములు
గత మయ్యెఁ గరులు వ్రక్కలు వాసె హరులు
మొదసిరి భటులు భూమికి వ్రాలె విండ్లు
చిదిసిరి సంగ్రామచింతతో దొరలు.
అంతఁ గర్ణుఁడు దాఁకి యను వెల్లఁ బొలిసి
పంతంబు చెడి పాఱెఁ బ్రజ లెల్ల నవ్వ.

గురుఁడును దాఁకి నుగ్గులు గాఁగఁ బోరి
శరములు గాఁడి మూర్ఛను జెంది పోయె.
మఱియు నశ్వత్థామ మహితుఁ డై తాఁకి
నెఱియ నెన్నటికి మానిసి కాక పోయె.
అప్పుడు గాంగేయుఁ డాలంబు సొచ్చి
నిప్పులు గన్నుల నెఱయంగ నడరి
వితతశౌర్యాటోపవిభవంబు దోఁప
నతులదివ్యాస్త్రంబు లందందఁ బఱపి
పోరాడియును వైరిభూరిబాణముల
బారి బీరము సూప వలఁతి గాకకట
యురము బీటలు వార నొగిని మూర్ఛిల్లె.
అరిది శౌర్యము సూపి యమ్మహాపురుషుఁ
డెదు రైనవిరుల నిట్లు గెల్వఁగను
జెదరినసైన్యంబుఁ జేరంగఁ బిలిచి
తమ్ములుఁ దాను భూతలనాథుఁ డంత
నిమ్ముల నతనితో నెదిరి పోరాడ
నురములు వ్రక్క లై మూర్చలు వదలి
కరములు తెగి పోవ గళములు గ్రుచ్చి
ఫాలసీమలు నొచ్చి బదు లుచ్చి పోయి
కాలు చేయాడక గాసిల్లునంతఁ

గరి నెక్కి వచ్చి వికర్ణుఁ డడ్డంబు
చొరఁ బాఱి తూపులసోనలం గురిసి
తసలావు చూపుచోఁ దడఁబాటు లేక
యనువుగా నొకకోల నమ్మహాత్ముండు
వానియేనుఁగుఁ జంపి వానిఁ బోఁ దోలి
మానవేశ్వరుమీఁద మఱియు నేయుటయుఁ
బతి సచ్చె నని సేన భగ్నమై పాఱెఁ
బతియును బాఱె భూభాగంబు లగల.
అవీనుఁడును బాఱి యతనిఁ బోఁ దఱిమి
తా వచ్చె" ననిన భూతలనాథుఁ డలరి
"ఇట్టిపుణ్యాత్ముఁ డెయ్యెడ నుండు నిపుడు?
నెట్టనఁ దోడ్తేర నేర్వ లేవైతి;
అతనిఁ బూజింతు నర్ఘ్యపాద్యముల
నాతనిచరణంబు లర్థితోఁ గొలుతు;
అన్నన్న యతఁడు రాఁ డయ్యె నిచ్చటికి!
ఎన్నఁడు వీక్షింతు నే" నన్న నతఁడు
"తా వచ్చె. వచ్చి యంతర్ధానుఁ డయ్యె.
ఏవేళ వచ్చునో! యిట రాక పోఁడు.
దేవతాంశమువాఁడు దివ్యాస్త్రవిదుఁడు
భూవర మనకు నాపురమందు వచ్చి

చెలఁగి సంభావన సేయ నున్నాఁడు
నెలకొని మనల మన్నింప నున్నాఁడు.
మనవంశమునవారి మనుప నున్నాఁడు
మనభాగ్యదేవత మఱియు వే యేల?"
అని చెప్పి భూపాలు నాశ్చర్యపఱుప
ననుజన్ముఁ జూడక యపుడు ధర్మజుఁడు
తనవ్రేఁటుగంటిపైఁ దనశాటి వైచి
కినియక యుండెఁ జెక్కిటఁ జేయిఁ జేర్చి.
పతి యంత నిట్టిదోర్బలకళాలోలుఁ
డితఁడె కా యని నిర్ణయింప నేరమిని
"పేడి ర" మ్మని పిల్చి బీభత్సు ననిచి
వేడుకఁ దనపుత్త్రు వీడ్కొల్పి మఱియుఁ
గడుమంచిమణు లిచ్చి కంకు వీడ్కొల్పి
యడరి మంత్రుల నెల్ల ననిచి తా నపుడు
క్రన్ననఁ బోయి కేకయరాజపుత్త్రి
యున్నమందిరసీమ నుదకంబు లాడి
భోజనలేపనపుష్పభోగముల
నాజి చేసినదప్పి నణఁచి నిద్రించె.
అంత నుత్తరుఁ గూడి యతనిమాటలకు
సంతసిల్లుచు నాట్యశాలకై నరుఁడు

వచ్చి యచ్చటను భూపతిసూతి ననిపి
క్రచ్చర నుత్తరాంగనఁ జేరఁ బిలిచి
బొమ్మపాత్రిక లిచ్చి పొసఁగ మన్నించి
సమ్మతిఁ దన నివాసముఁ జేరి యుండె.
అప్పుడు దిననాథుఁ డస్తమించుటయు
నప్పాండుతనయులు నబ్జాక్షి తారు
యమనూనుఁ డున్నగృహంబందుఁ గూడి
విమతు లోడినవార్త విన్నవా రగుచుఁ
గడు సంతసిల్లి యగ్రజునంకఁ జూచి
వడముడితోడ విద్వత్తుఁ డిట్లనియె
"ఇప్పు డేమిటికిఁ గానితఁడు నావంకఁ
దప్పక చూడఁ డేతప్పు చేసితినో,
సమయంబు దప్పెనో, చలము రెట్టింప
విమతులఁ దోలినవిత మేమి తప్పొ?
ఏవెంట వెదకిన నీకారణంబు
భావింప నేర నేర్పుఁజుపవే" యనిన

విరటుఁడు ధర్మజుని సారెల వ్రేయుట విని
భీమార్జునులు రేఁగుట.

ననుజన్ము నీక్షించి యమసూతి పలికె
"విను మేదియును లేదు విరటుండు నేఁడు

తనకుమారుండు యుద్ధము గెల్చె ననుచుఁ
గొనియాడుటకు నిన్నుఁ గొనియాడ నేను
మనబృహన్నల గెల్చె మఱి గెల్చువారు
మనవీట లే రన్న మదిలోన మ్రంది
యుత్తరుజయ మాడ నోర్వ లే ననుచు
మొత్తె నెత్తురుసారె మోము దాఁకంగ.
ఆపోటుగంటి నీ కావేళఁ జూప
నోపక చీరమా టొనరించి నేను
నుండితి" నని గంటి నొయ్యనఁ జూప
గాండీవి లయకాలకాలుఁడై మండి
"వినుము గర్వించినవిరటు మర్దించి
మనము చేకొందము మత్స్యరాజ్యంబు;
తనుఁ దా నెఱుంగక తా నెంత చేసె!
అనుమాన మేల వీఁ డధముండు గాఁడె?
చెనఁటి యై మిము వ్రేయఁ జేతు లెట్లాడె?
పనుపుఁ డే గెద" నన్నఁ బలికె వాయుజుఁడు
"నీదాఁక నేటికి నెమ్మి నే నేగి
యాదుష్టమతిఁ గూల్చి యతనిచుట్టములఁ
బాల మొకయొకగాఁ బోరాడి చంపి
కలహంబు లేనియీకనలు పో విడుతుఁ

బోయెద" నని ధర్మపుత్త్రుఁ జూచుటయు
నాయుత్తముఁడు వారి నపుడు వారించి
"అక్కట మీర లిట్లన నేల? మనల
నిక్కపురూపులు నృపుఁ డేమి యెఱుఁగు?
ఎఱిఁగింత మెఱిఁగియు నిట్టివాఁ డైనఁ
దఱువాత నిట్టిది తలపోయఁ దగును.
వానిరాజ్యంబున వసియించి మనము
నానాసుఖంబులు నడపు చుండితిమి.
కడపట నొకతప్పు గాంచిన నేమి?
ఉడుగుఁ డాగ్రహ" మన్న నుడిగి రందఱును.
ఎలమిఁ బాండవు లిట్లు హితభాషణములఁ
దలకొన్న వేడ్క నెంతయుఁ బ్రొద్దు పుచ్చి
"యెల్లి వత్తము గాక యీరాజసభకుఁ
దొల్లిటిరూపులతో" నంచుఁ బలికి

పాండవులు విరాటునికొలువుగద్దియల
నలంకరించుట.

యారాత్రిఁ బుచ్చి పూర్వాద్రిపై నినుఁడు
తేరు ద్రిప్పకమున్నె తీర్థంబు లాడి
కాలోచితము లైనకర్మంబు లెల్ల
నాలోచితధ్యాను లై నిర్వహించి

ధవళవస్త్రంబులు ధవళగంధములు
ధవళమాల్యంబులు తగురీతిఁ దాల్చి
యేడుదీవులు నేలునృపులరీతిగను
జూడ నొప్పెడుభాతి సుభగవేషమున
ధరణీశునగరి నాస్థానంబుఁ జేరి
పరఁగంగఁ బసిఁడికంబములమధ్యమున
నలు వొప్పు సింహాసనముఁ జూచి యందుఁ
దలకొని కూర్చుండె ధర్మనందనుఁడు;
తమ్ములు నతనిపాదములు సేవించి
నెమ్మి నుండిరి రత్ననిచితపీఠముల.
ఆలోన విరటుఁ డింపారఁ గైసేసి
యోలి మంత్రులుఁ దాను నుత్తరుఁ గూడి
బోరున నాస్థానభూమి కేతెంచి
యారూక్షగతిఁ బాండవాగ్రజుఁ జూచి
"ఇది యేమి వివరింపుమీ కంకుభట్ట;
మదిలోన గర్వించి మమ్ముఁ గైకొనక
తగ వేది మాతోడ దట్టించి పలికి
జగడించితివి నిన్న సౌజన్య మేది
నెఱయ నంతటఁ బోక నేఁ డన్న నిట్లు
మెఱసి నాగద్దియమీఁ దెక్కి తిపుడు!

తలపోయ నిది నీకు ధర్మమే?" యనిన
వెలయ నించుక నవ్వి విజయుఁ డిట్లనియె

పాండవులు విరాటునకుఁ
దమ్మెఱింగించుకొనుట.

"ఇంక నెక్కుడికంటెఁ డితఁడు ధర్మజుఁడు
బొంకాడ నేరనిపుణ్యుఁ డీరాజు.
అవని నీతఁడు గాచు నవనీశు లితని
యవసరంబులు చూతు రతిభక్తితోడ;
ధరణి నీతఁడు ప్రోచు ధరణీధరములు
పరఁగంగ నీతనిపగవారి మోఁచు.
లలిఁ జక్రవాళశైలములలో నుండి
యిల నిండుశశిఁ బోలు నీరాజుకీర్తి.
రాజులధన మెల్ల రాజసూయమునఁ
బూజలు గొని యిచ్చెఁ బొసఁగ విప్రులకు.
ఇతనికై కరిగాఁపు లెల్లభూవిభులు;
ఇతనిబాహాశక్తి కెదురు లేదెందు.
ఇతఁ డుండఁ జెల్లు నయ్యింద్రాసనంబు
ధృతి నిట్టికుటుచగద్దియ కైనఁ దగఁడె?"
అనుటయు విని విస్మయమును సంశయము
దనుఁ జుట్టుకొనఁగ భూతలనాథుఁ డంత

“నితఁడు ధర్మజుఁ డైన నింక వాయుజుఁడు
హతవైరి క్రీడియు నా మాద్రిసుతులు
నెచ్చట నున్నవా? రేది పాంచాలి?
యచ్చుగా వివరింపు” మనిన నర్జునుఁడు
“వలలనామముఁ దాల్చి వంటకై నిన్నుఁ
గొలిచి కేసరిమల్లకుంజరంబులను
బానర మేడములోనఁ బోరాడి గెలిచెఁ
బెనుపొంద నతఁడె పో భీమసేనుండు.
మనుజేంద్ర మఱియు దామగ్రంథి యనఁగ
నినుఁ గొల్చి నీయశ్వనికరంబు నరసి
ప్రకటశాలిహోత్రపరుఁ డైనవాఁడు
నకులుండు మాద్రిమన్ననఁ గన్నవాఁడు.
తెఱఁ గొప్ప మఱియుఁ దంత్రీపాలుఁ డనఁగ
మెఱసి నీగోవుల మేపఁ బుచ్చుచును
గొల్లవాఁ డై నిన్నుఁ గొలిచినాతండు
అల్లవో సహదేవుఁ డని నిశ్చయింపు.
జననాథ నెండియు సైరంధ్రి యగుచు
నను పొంద మాలిని యనుపేరు దాల్చి
కేకయపుత్రి మిక్కిలి గారవింపఁ
బ్రాకటగతి నున్న భామ పాంచాలి.

పాంచాలికై కాదె పవమానసుతుఁడు
ద్రుంచె నక్కీచకుఁ దోడికీచకుల"
అని చెప్పుచున్నచో ననిలసంభవుఁడు
జనలోకపతికి వాసవపుత్త్రుఁ జూపి
"నరనాథ యీబృహన్నల గాఁడె నరుఁడు.
పొరసె నుర్వశిశాపమునఁ బేడితనము;
తగ నృత్తగీతవాద్యముల నుత్తరకు
మిగులంగ నేర్పినమేటి దా నితఁడు.
ఖాండవం బేర్చి యాఖండలుం గెలిచి
ఖండించె నతనికై కాలకేయులను.
గంధర్వపతి గెల్చి గాంధారిసుతుని
బంధమోక్షము చేసె బలియుఁడై యితఁడు.
మఱియు రాక్షసకోటి మర్దించె" ననిన
మెఱయ సంతోషించి మేదినీశ్వరుఁడు
ఆశ్చర్యమగ్నుఁడై యపుడైన వారి
నిశ్చయింపఁగ లేక నిర్విణ్ణుఁడైన
భూమీశ్వరున కింద్రపుత్త్రునిఁ జూపి
భూమింజయుఁడు పల్కెఁ బొలుపు దీపింప:
"ఇతఁడు నీతో మున్ను నెఱుఁగంగ నీక
ధృతి నాజ్ఞ చేసినఁ దెగి చెప్ప వెఱచి

యొడవె గెల్పు మహాత్ముఁ డొకఁ డుంట నంటిఁ
గదనంబు గెల్చినఘనుఁడు దా నితఁడు.
అరదంబు డిగ్గి యే నటు పాఱి పోనఁ
గురురాజు చూడఁగాఁ గూడ నే తెంచి
వెఱపు దీర్చినయట్టివీరవాక్యములు
మఱవంగ లేను, క్రమ్మఱఁ జెప్ప లేను.
తననామములు చెప్పి తనసహోదరులు
మనవీట నుండుట మఱి నాకుఁ జెప్పి
కదనంబులోఁ దేరు గదలింపు మనిన
నదిలోకవిపరీత మగుట నే నెఱుఁగ.
పోరిలో హయరత్నములఁ దోలి తోలి
వారక ధృతి దూలి వశము గాకున్నఁ
గుశలుఁ డై యితఁడు నాకును దోడు చేసె
వెస" నన్న నప్పుడు విరటభూవిభుఁడు

భయభక్తులు దోఁప విరటుఁడు
పాండవుల గౌరవించుట.

వెఱపు సంతోషంబుఁ విస్మయంబుఁ బ్రియము
నెఱయఁ బార్థునిఁ దాను నెఱిఁ గౌఁగలించి
పాండవాగ్రజునకు భక్తిసాష్టాంగ
దండప్రణామంబు తగ నాచరించి

యతనిఁ గౌఁగిటఁ జేర్చి యాభీము యనుల
నతిసంభ్రమంబున నంత వీక్షించి
చాల భీతిల్లి హ స్తము లొప్ప మొగిచి
మౌళిపైఁ జేర్చి ధర్మజుఁ జూచు చుండ
నతిసంభ్రమంబుతో నంత నవ్విభుని
సుతులు సోదరులును జుట్టాలు హితులు
దాదులుఁ బ్రజలుఁ బాంధవజనంబులును
భూదేవతలుఁ బాండుపుత్త్రులఁ జూడఁ
జనుదెంచి యందంద నందడించుటయు
జననాథుఁ డామూఁకఁ జదియ వేయించి
యమనందనునియాజ్ఞ ననుజులుఁ దాను
సముచితాసమునఁ జతురుఁ డై యుండి
కంచుకిచేతఁ గేకయరాజసుతకుఁ
బాంచాలిఁ గై సేయఁ బను పిచ్చి యనిపి
తనలోనఁ దాను సంతస మందువిభునిఁ
గనుఁగొని ప్రియముతో గాంఢీవిపలికె:
“ఏసంకటము లేక యిచట నజ్ఞాత
వాసవత్సరము నిర్వర్తింపఁ గలిగె.
ఈ వెఱుంగవుగాని యే మున్న తెఱఁగు
నే వెంటఁ గొదలేక హితము చేసితివి.

విరటుండు మేటి భూవిభులలో ననుచుఁ
బరికించి వచ్చె నీపాండవాగ్రజుఁడు.
వైరివంచితుల మై వచ్చి నీప్రాపు
చేరి యేకొఱద లేక చెలఁగితి" మనుడు
మది సంతసించి యామానవేశ్వరుఁడు
"ఇది నాతఫలం బిది నాదుకోర్కి
వసుధ మీమన్నించువారిలో నొకఁడఁ
బొసఁగ నన్యుఁడు గాఁగఁ బోహణింపకుఁడు;
నాపాలఁ గరుణించి ననుఁ బెద్ద చేసి
మీపూన్కి దీర్చుట మిగులంగ లెస్స.
ఏను ధర్మజునకు నీరాజ్య మిచ్చి
యే నున్న పురి నిచ్చి యిభకోటి నిచ్చి
ధనధాన్యమణు లిచ్చి దళ మెల్ల నిచ్చి
నను వచ్చి సేవించునాథుల నిచ్చి
హితులను మఱి పురోహితుల బాంధవుల
సుతుల మంత్రులఁ గూడి జోక మై నెపుడు
నితఁ డేడుగడయుగా నితనిపాదములు
చతురత్వమునఁ గొల్తు సర్వకాలంబు.
గజపురిపై దాడిగాఁ బుచ్చె నేని
భుజశక్తి నచటఁ జూపుదు నోపినంత"

అనిన నుత్తరునకు నామాట లెల్ల
మనసులో సొగయక మత్స్యేశుఁ జూచి

ఉత్తరుఁ డర్జునునకు నుత్తర నిచ్చి
పెండ్లి గావింపఁ గోరుట.

"రణములలో వీరు రక్షింప కున్న
గణుతింప నింక నెక్కడిది రాజ్యంబు!
ఈరీతి నీ వాకఁ డిచ్చువాఁడవును
గోరి వా రొగిఁ బుచ్చికొనెడివారలునె?
కానమి మన మింతకాలంబు వారిఁ
బూని కొల్వనితప్పు బుద్ధిఁ జింతింపు.
దీనికై మనము ప్రార్థించుట గాఁగ
మీనాక్షి నిత్తము మీతనూభవను;
మణులు రాజ్యంబును మనకుఁ బో బ్రాఁతి
తృణముగా నవి వారు దృష్టింతు" రనిన
మనసునఁ బ్రియ మంట మంత్రిపుంగవులఁ
గనుఁగొని వారి నాక్షణమె భూనాథుఁ
డుత్తరఁ గైసేసి యొనరఁ దెచ్చుటకుఁ
బుత్తెంచుటయు వారు పొంగుచు వచ్చి
పొలుపారఁ గేకయపుత్త్రితోఁ జెప్పఁ
జెలువ శృంగారింపఁ జెలులఁ బుచ్చుటయుఁ

బనిపూని వారలు పసిఁడికొప్పెరలఁ
గొని తెచ్చి యుదకంబు కొమ్మకు వార్చి
తనువు మెత్తనిచీరఁ దడి యొత్తి సతికిఁ
బొనర హంసావళిపుట్టంబు గట్టి
నిడుద లై యొప్పారునిండువెండ్రుకల
తడి యార్చి నవపుష్పదామము ల్దుఱిమి
పన్నీటఁ గుంకుమపద నిచ్చి కలిపి
నున్ననిమెయిపూఁత నుతలీలఁ బూసి
గోరోజనంబు చెక్కులఁ దీర్చి వ్రాసి
తోరమై నుదుటఁ గస్తురిబొట్టు వెట్టి
పలుకుల మెదిచినపచ్చకప్పురము
కలికికాటుకనీటఁ గనుదోయి దిద్ది
లత్తుకజిగి యూరులలితపాదముల
వాత్తించి కెమ్మోవి కది వన్నె వెట్టఁ
బసిఁడిమట్టియలును బసిఁడియందియలు
రశనాగుణంబులు రత్నముద్రికలు
మణిహారనాసికామణికంఠహార
మణికంకణంబులు మానుగాఁ బెట్టి
నీరజాక్షికి నష్టు నిలువుటద్దంబు
గారాముతోఁ జూపి కడుసంభ్రమమున

"అతివఁ గైసేసితి" మని ప్రధానులకు
నతియుక్తిఁ జూపుచో నాశ్చర్య మంది
"వలరాజుదీమమో వలుదముత్తియమొ
వెలలేనిపసిఁడియో విమలకౌముదియొ!
ఫులు గడిగినయాణిముత్తెంబు పోలె
నెలమిఁ గైసేసిన నిట్లుండ వలదె!"
అని మంత్రివరులు ముక్తాతపత్రములు
వనితకుఁ బట్టించి వరుసఁ దోడ్తేర
నెదు రేగి విరటుండు హితులును దాను
మదిరాక్షిఁ దెచ్చి ధర్మజుమ్రోల నిలిపి
"దేవ యీముద్దియ దేవేంద్రజునకు
దేవి గాఁ జను నని తెచ్చి చూపితిని.
ఈనాతి నీరీతి నితని కిప్పించి
మానేర్పు నేరము ల్మఱువంగ వలయు.
మీరు నిల్చుటచేసి మెఱసె నాభూమి
వారక దుర్భిక్షవర్జితం బయ్యె.
మీగు వచ్చుటచేసి మెఱసె నాకీర్తి
ధారుణి నాచంద్రతారకం బయ్యె.
మీరు వచ్చుటచేసి మెఱసి కౌరవులు
యూరక రారు నాయూరిచేరువను.

నావంశమును బావనం బయ్యె నింక
నీవారిరుహనేత్ర నిట్లు చేకొనుఁడు”
అన విని ధర్మజుం డమరేంద్రసుతుని
గనుఁగొన విరటుతో గాండీవి పలికె:

ఉత్తరను దనకోడలుగఁ గైకొన
నర్జునుం డొప్పికొనుట.

“నృత్తగీతంబులు నిఖిలవాద్యములు
నుత్తర నాచేత నొప్పుగా నేర్చె
కోడలై యుండఁ జేకొనువాఁడఁ గాని
వేడుక నీయింతి వింతగాఁ దలఁప
వావి దప్పినపనుల్ వరుసఁ బాండవులు
గావింప రది మీకుఁ గానవచ్చినది.
కావున నభిమన్యుఁ గల్యాణధన్యు
నావీరరాజన్యు నమరేంద్రమాన్యుఁ
బురుషుఁ జేసెదు కాక పువ్వుఁబోఁడికిని.
చిరకాల మిది నేను జింతించుచుంటి
నిది ధర్మసూనున కిది భీమునకును
ఇది బంధుజనులకు హితకార్య” మనిన
విరటుండు మోదించి విజయు నీక్షించి
చరితార్థుఁ డై యొప్పి సంభ్రమంబునను

"విను మేను నీతోడ వియ్య మందుటకుఁ
దనరి యోగ్యుఁడ నైతి ధన్యుండ నైతి.
హరికి మేనల్లుఁడు హరిపరాక్రముఁడు
మరునిఁ బోలినవాఁడు మాపుత్రిమగఁడు;
పరఁగఁ గులస్థానపౌరుషంబులకు
నిర వైనసుకుమారుఁ డీయింతిమగఁడు"
అని చేఁడు కొనియాడ నాధర్మసూనుఁ
డనయంబు వేడ్కతో నతని వీక్షించి
"పార్థుమాటల మాకుఁ బరితోష మయ్యె.
పార్థివ నీ వింక బంధువర్గములఁ
బిలిపింపు ముత్తరపెండ్లి వేగంబె
యొలమిఁ జేయుద" మన్న నెసఁగుమోదమున
మిన్ను దాఁకుచు మత్స్యమేదినీశ్వరుఁడు
క్రన్ననఁ దనపుత్రిఁ గౌంతేయులకును
మ్రొక్కించుటయు వారు ముదిత దీవించి
తక్కక యనిచి రంతఃపురంబునకు.
ఆవేళ విరటుఁ డత్యంతహర్షమున
దైవజ్ఞులను బిల్చి తాంబూల మిచ్చి
లలితవైవాహికలగ్ననిశ్చయము
తలకొని చేయించి తదనంతరమున

మెఱసి వారలుఁ దాను మేటికాలరులఁ
తఱిమి పాంచాలయాదవముఖ్యు లైన
చుట్టాల రండని శుభ రేఖ లనిపి
రట్టిచో ధర్మజుం డతని వీక్షించి
"వనవాసమున నుండి వచ్చి నీయింట
మనసులోపల నున్నమలినంబు మాన్చి
యఖిలభోగంబులు ననుభవించితిమి
సుఖ మయ్యె; నేఁ డిదె శుభము చేసితివి.
ఎందుఁ జూచినఁ గూర్మి యొసఁగంగ మాకు
విందవు నీవు గోవిందునియట్లు
ర" మ్మని తిగిచి విరటభూమిపాలుఁ
గ్రమ్మఱ బిగి యారఁ గౌఁగిలించుటయు
నతఁడు వారలకు మజ్జనము సేయించి
యతివేగమునఁ బ్రీతి నన్నపానములు
తనుపారఁ బెట్టించి తగుగౌరవంబు
లొనరించి గంధపుష్పోపహారములు
వితతాంబరంబులు వెలలేనిసొమ్ము
లతిభక్తితో నిచ్చి యామోద మందె.
ఇటఁ గౌరవాధీశుఁ డిభపురంబునకు
భటులుఁ దానును సిగ్గుపడి వచ్చుచుండి

యనువున మార్గమునందుఁ దా విడిసి
యినజుతో ననుజుతో నేకాంత మాడి
"సమయకాలము పోక చనుదెంచెఁ గ్రీడి
క్రమ మెఱుంగక చెప్పె గాంగేయుఁ డపుడు;
ధర్మచిత్తున కిది ధర్మరాజునకు
నర్థిలి నెఱిఁగింత" మని దూతఁ బనిచె.
ఆదూత చనుదెంచి యమసూతిఁ జూచి
చేదోయి ఫాలంబుఁ జేర్చి తాఁ బలికె:
"వడిఁ గ్రీడి యజ్ఞాతవాసవత్సరము
కడవక మున్నె సంగరకౌతుకమునఁ
గురుసేనతోడ మార్కొనఁ బేరువాడె;
విరటసూనుఁడు సాక్షి; వినుఁ డింక మీరు
పోయి తొల్లిటియట్ల భూరిదుర్గముల
జాయాసమేతులై చరియింప వలయు.
నీ వెఱుంగనికార్యనిచయంబు లేదు
భూవల్లభుఁడు చెప్పి పుత్తెంచె" ననఁగ
మానితసత్యుఁడై మహి నొప్పుధర్మ
సూనుఁ డిట్లను వానిఁ జూచి నవ్వుచును
"తమతోడఁ గ్రీడి యుద్ధము సేయునపుడు
సమయకాలము పోయెఁ జర్చింప మున్నె.

గురుభీష్ము లెఱుఁగంగఁ గోర్కి నీ వింకఁ
గురురాజునకుఁ బెద్దకొలువులోపలను
వారలసమయసంవత్సరం బెల్ల
పూరించి రని పల్కి పౌష్ము పౌ,, ష్మనచుఁ
గంటగించినఁ జోయి కౌరవేంద్రునకు
నంట ధర్మజుమాంల లతఁడు దెల్పుటయు

అర్జునుఁడు సమయంబు దాఁటె నని దుర్యోధనుని
భీష్ముఁడు నిందించుట.

బాలుపార వినియును బుద్ధిపెం పేది
కొలు విచ్చి యారాత్రిఁ గురుసైన్యవిభుఁడు
అనుజుఁడుఁ గృపుఁడు దివ్యాపగాసుతుఁడు
నినజుండు ద్రోణుండు నేతెంచి యుండ
దూతఁ బుచ్చుటయును దూత వచ్చుటయును
ఆతఁడిఁ జెప్పక యతఁ డిట్టు లనియె:
«ఒప్పార మఱచితి మొకదొడ్డపలుకు;
చెప్ప లే కైతిరి చేరి మీ రైన;
సమయకాలము మీఱె జంభారిసుతుఁడు
సమరంబు చేయుచోఁ జాలించి మనము
నిను నెఱెంగితి మన్న నిక్కృతుఁ డై పోఁడె?
పని లేనిపని గాదె వానితోఁ బోరు

టిది ధర్మరాజున కెఱిఁగింత" మనిన
నదయుఁడై కోపించి యాభీష్ముఁ డనియెః
"వినెడువారలు సర్వ విభుఁడవై యుండి
పనికి మాలినయట్టిపలుకు పల్కెదవు!
ఇది నీకు మఱచుట కేది కారణము?
మది నొవ్వ నాడెదు మఱింత" యనిన
నందఱు నామాట లగుఁ దప్ప వనిరి.
మందారదాముఁడై మఱునాఁడు పతియుఁ
జావఁగా మిగిలినసైన్యంబుతోఁడ
వేవేగ నగరప్రవేశంబు చేసి
క్రక్కున రేపాడి గగనభాగమునఁ
జుక్కలపస లేనిశుభ్రాంశుపగిదిఁ
బడి యాజిఁ గూలినవారిబంధువులు
విడువక వాపోవ వినుచు నేతెంచి
యమ్మకు నట మ్రొక్కి యాంబికేయునకు
నిమ్ముల మ్రొక్కి తొల్లిటియట్టు లుండె.
అట జమ్మి కడ కేగి యల్లపాండవులు
పటుతరాస్త్రంబులు భక్తి నర్చించి
కైకొని విరటభూకాంతుఁ దోడ్కొనుచుఁ
బ్రాకటగతి నుపప్లావ్యంబుఁ జొచ్చి

తమకు రాజులు కన్న దనియఁ గానుకలు
క్రమ మొప్ప నిచ్చినఁ గడఁగి కైకొనుచు
వేడుక లెట్టింప విరటభూపాలుఁ
డూడిగంబులు సేయ నున్నతస్థితిని

రామకృష్ణులు సకలయాదవాన్వితులై

యుపప్లావ్యంబుఁ జేరుట.

భాసిల్లుసంతలో బలుఁడు నచ్యుతుఁడు
నాసాత్యకియును భద్రాభిమన్యులును
దనరఁ బ్రద్యుమ్నుండుఁ దగ యుధామన్యుఁ
డనఘుఁ డక్రూరుండు నంత సాంబుండు
కృతవర్మ తారుఁ గ్రిక్కిఱిసి యాదవులు
అతివీరదండసేనాధినాయకులు
మణిరథారూఢు లై మత్తేభతురగ
మణులతోఁ గామినీమణులతోఁ గదిసి
పసిఁడియందలములుఁ బసిఁడిగొల్లెనలు
పస నారురథములుఁ బట్టయినబండ్లు
తగరుటెక్కెంబులుఁ దమ్మటంబులును
జగజంపుగొడుగులుఁ జామరంబులును
దమతోడనే తేరఁ దత్వైభవంబు
లమరంగ నెంతయు నానంద మలరఁ

బెను పొంద నభిమన్యుపెండ్లి గావింపఁ
బూనర నుపప్లావ్యపురగముఁ జొచ్చుటయు
"నదె కుమారులతోడ హరి వచ్చె" ననుచు
నెదు రేగి పాండవు లింపు సొం పొందఁ
బుండరీకాక్షుని భువనైకవంద్యుఁ
బాండుభూపతిఁ గన్నపగిది నీక్షించి
యానందవివశు లై యట మూర్ఛ దెలిసి
జా నొప్పఁ దగినయాచారంబు నడపి
యమరంగ బలముఖ్యు లగుయాదవులకు
సముచితభక్తితో సత్క్రియ లెన్నరపి
యెంతయుఁ బ్రీతిఁ దా మెసఁగు చుండఁగను
ఇంతులు తనుఁ గొల్వ నిభరాజగతుల
భాసిల్లి తనయుతోఁ బాంచాలికడకు
నాసుభద్రా దేవి యరుగఁ గానుకలు
సరస నభ్యంతరజనముతోఁ గూడఁ
గర మర్థిఁ బుచ్చుచోఁ గమలాప్తుఁ డంతఁ
బీతాంబరముఁ బోనిపృథులవస్త్రములు
భాతికౌస్తుభలీలఁ బరఁగురత్నములు
వైనతేయునికంటె వడి నేగుహరులు
పూని గోవర్ధనంబును బోనికరులు

పాండుపుత్త్రుని కిచ్చి పాంచాలికడకు
మెండైనతొడవులు మృదులవస్త్రములు
భాసిల్లునొకమంచిపసిఁడిగద్దియయు
దాసీజనంబులుఁ దగురీతి నిచ్చి
కౌంతేయులును దానుఁ గలసి యంతంత
సంతోషమున నున్నసమయంబునందు
ద్రుపదుండు హితులుఁ బుత్త్రులుఁ దానుఁ గూడి
విపులసమ్మోదాబ్ధివీచుల న్మునిఁగి
యుండఁగాఁ గాశీశుఁ డును శైబ్యపభుఁడు
దండ నేతేరఁగ ధర్మజాదులును
ఎదు రేగి తోడ్తెచ్చి యొలమిఁ బూజించి
ముద మావహించిరి మొగి నందఱకును.
వెండియుఁ దమరాజ్యవిభవంబు మెఱసి
పాండవవిరటభూపాలబంధువులు
వచ్చిన విరటుండు వారిఁ బూజించి
యిచ్చకుఁ దగినచో నిమ్ము గావించి
తనవీటిలోన నుత్తరపెండ్లి చాటఁ
బనిచిన భృత్యులుఁ బౌరు లాపురిని

### వివాహమహోత్సవంబునకుఁ బౌరులు మత్స్యపురం బలంకరించుట.

మేడలు ధవళించి మృగనాభి నలఁది
వాడలు శోధించి వఁబదము త్తైములఁ
జెలఁగి ముగ్గులు పెట్టి చీనాంబరముల
కలువడంబులు గట్టి కంబాలు పొదివి
పోఁకప్రమాకులు దాపి పువ్వులు నెఱపి
తాఁ కోర్వఁ దోరణ స్తంభము ల్నిలిపి
మణిగానసము చేసి మహితరీతులను
అను వొందఁ గల్యాణచిత్రము ల్వ్రాసి
ఘనసారధూళితోఁ గలిపి యొక్కింత
అను వైనజవ్వాజియట్టళ్లు మెత్తి
రంగు మీఱినగోపురములపై నున్న
బంగారుకుండలు ప్రభఁ గాంచఁ దోమి
వెండియుఁ గంబముల్ వివిధతోరణము
లాండొండ వీథుల నొప్పారఁ గట్టి
చెలువ వేగినఁ బ్రోది సేయుచందముల
నెలమిఁ బుష్పాళ్లతో నెల్లఁ గైసేసి
తొడరి కాలాగరుధూమ మెల్లడలఁ
నడలుకొనినఁ గాంతి కలిగి యప్పురము

మాయాపురము మించె మఱపించెఁ గాంచి
నాయయోధ్యను బోలె నాలంక గెలిచె.
అప్పు డాయధికారు లనుపమగతులఁ
దప్పక నగరిలోఁ దగ వారఁ జొచ్చి
పచ్చపట్టులభాతిఁ బవడాలు నిలిపి
పచ్చిదవనముతోఁ బందిళ్లు పెట్టి
కొలువుకూటంబులఁ గుంకుమం బలఁది
పొలు పారఁ గప్పురముగ్గులు పెట్టి
మాణిక్యదీపము ల్మణికవాటముల
రాణించి నిరుపమప్రభ గొల్పు చుండ
మొత్తని వెలిపట్టుమేల్కట్టు గట్టి
ముత్తెంబులును బుష్పములు వ్రేలఁ గట్టి
హయదంతిశాలలు నస్త్రశాలలును
నియతి శోధించి వెన్నెలనిగ్గు దొరయఁ
జతురత మఱి పెండ్లిచవికెయు నరుగు
నతివిచిత్రము గాఁగ నలవరించుటయుఁ
బవడంపుబోదలఁ బసిఁడివాసములు
నవరత్నమయము లౌనాల్గుకంబములు
వెండిపట్టెలు వట్టివేళుకప్పులను
ఒండొంటి మిగులంగ నొకవేది యందు

నొనరించి యొప్పుగా నొగి నందుమీఁదఁ
గనకపీఠము వెట్టి కడఁకతో మఱియు
వలయుకార్యంబుల వర్తించి రంత.
వెలఁదులఁ బిలిపించి విరటభూవిభుఁడు
ఘనలీల నుత్తరఁ గైసేయఁ బనిచె.
తనయులుఁ దమ్ములుఁ దానుఁ బత్నియును
బహుకుంకుమాంబరాభరణమాల్యముల
విహితవేదజ్ఞులౌవిప్రపుంగవులఁ
బిలిపించి పూజించి పేరటాండ్రకును
దిలకించుకట్నముల్ తెఱఁ గొప్ప నిచ్చి
మహితవైభవమున మఱియుఁ గొల్వుండి
మహితమోదము నొంది మది ధర్మజునకు
ననుపమం బగులగ్న మాయత్త మయ్యె
నని చెప్పి పంపిన నతఁడు వేగమున
వనజనాభునియాజ్ఞ వల నొప్పఁ బడసి
యనుజన్ములును దాను నర్థిఁ గైసేసి
శుభవేషయుతు లౌచుఁ జుట్టాలు గొల్వ
నభిమన్యుఁ బూజించి యక్కుమారకునిఁ
బట్టంపుటేనుఁగుపై నుండఁ బనిచి
నెట్టన శుభతూర్యనిచయంబు మ్రోయ

నుత్తుంగగజములు నుత్తమాశ్వములుఁ
గ్రొత్తగాఁ గై సేసి కొన్నింటిఁ గొనుచు
లెక్కకు మిగులుపల్లెకు లందు నిండి
చొక్కపుమణులు భాసురవస్త్రచయము
కలవస్తువులు దివ్యగంధముల్ మఱియుఁ
బాలు పైనతొడవులుఁ బుష్పమాలికలు
మధురభక్ష్యంబులు మఱియుఁ బెక్కైన
విధములక్రంతలు వింతగా నడువఁ
దగురీతి బ్రాహ్మణోత్తములదీవెనలు
మగువలపాటలు మాగధస్తుతులు
తరచుగా వినుచు ముందర శౌరి నడువఁ
దిర మొప్ప విరటుమందిరముఁ దాఁ గదిసి
భాసిల్లి యెదురుగాఁ బఱతెంచి సతులు
సేసలు చల్లుచోఁ జెలఁగి కైకొనుచుఁ
జటులఘంటాముఖసకలనాదముల
బటు వైనవిరటభూపతియిల్లు చొచ్చె.

ఉత్తరాభిమన్యులవివాహ
మహోత్సవము.

అతఁడు భీతియు సిగ్గు హర్షంబు దోఁప
వితతవైదికతంత్రవిభవంబు నడప

నాసుభద్రాసుతు నర్థిఁ దోడ్కొనుచు
వాసి మీఱఁగ వైభవంబు దళ్కొత్తఁ
గర మొప్పనుత్తరాంగనకు మా టున్న
తెరయొద్ద నిలిపినఁ దెర యొప్పెఁ జూడఁ
దొలఁగక దివసరాత్రులవెంట నడుమ
నిలిచినలేఁతవెన్నెలచాలు పోలె
దిననాథవికచపద్మినులమధ్యమునఁ
గనుపట్టునుదయరాగచ్ఛాయ పోలె.
ఆవేళ దైవజ్ఞు లఖిలదేవతల
భావించి కీర్తించి పరమమోదమున
రమణీయశుభతూర్యరవము రంజిల్ల
సుముఖులై దీవించి సుముహూర్త మనుచుఁ
దెరచీరఁ దిగిచిన దేవేంద్రుమనుమఁ
డరవిందముఖివక్త్ర మభిలాషఁ జూచె.
ఆచూపు లనుతేఁటు లామోద మంది
యేచినమాధుర్య మింపారఁ గ్రోలి
మగుడ నేరనిమాడ్కి మరగు చున్నంత
మగువయుఁ దనచూడ్కి మగనిపాదముల
నిలిపినఁ గస్తూరినీట నచ్చోటఁ
దొలికినచంద్రమె తోఁచెఁ జూపఱకు.

అంతఁ గ్రమ్మతి వచ్చి యభిమన్యుచూడ్కు-
లింతిబంగరుమేన నిర వొంది యలర
నాపొలంతుకచూపు లభిమన్యుమోముఁ
బ్రాపించి నిలువ నేరక సంచలించె.
అలఁతివేడ్కయు సిగ్గు నావేళఁ గలసి
తలఁపులు వెలిఁ బాఱఁ దడఁబాటు సూపఁ
బతిచూపు మఱి ద్రిప్పు భామచూ పలర
సతిచూపులను ద్రిప్పు సౌభద్రుచూపు.
అంతట మునులుఁ బుణ్యాంగన ల్విప్రు-
లెంతయు దీవింప నెలమిఁ గృష్ణుండు
ధర్మజాదుల వేడ్కఁ దగిలి కీర్తింపఁ
బేర్చి సౌభద్రుండు పృథులహర్షమునఁ
గలకంఠికంఠభాగమునఁ గీలించెఁ
గళల నింపొందుమంగళసూత్ర మెలమి.
తదనంతరంబ యిద్దఱుఁ దంత్ర మరసి
మున మొప్ప దోసిళ్ల ముత్యము ల్నించి
యొగిఁదీఁగయునుబ్రమానునొండొంటిమీఁదఁ
దగిలి యొయ్యన విరు ల్గమి రాల్చుకరణి
చెలువారఁ నొండొరు ల్శిరసులమీఁదఁ
దలఁబ్రాలు నించి రెంతయు సిగ్గు దోఁప.

అభిమన్యుఁ డప్పు డయ్యంగన కేలు
రభసవత్పులకాంగరాగుఁ డై పట్టి
చెలువారుజిగి మించుచిగురాకుసురియ
వెలయఁ బట్టినతియ్యవిలుకాఁడు పోలె
వెలఁదిఁ దోడ్కొని హేమవేది డగ్గఱుచు
నలు వొప్ప నేకాసనంబున నొప్పి
నొగి రోహిణిని గూడి యుదయాద్రిమీఁద
మిగులఁ జూపట్టినమృగధరు పోలె.
ఆలోన యాజ్ఞికు లన్నంబు దర్భ
పాలాశసమిధలు బ్రహ్మాసాశములు
వరశుభాక్షతలును బసిఁడిగిన్నియలు
సురభిగంధము నేయి స్రుక్స్రువంబులును
మొద లైనసద్ద్రవ్యములు గూర్చి క్రియలు
వదలక వానిచే వరుసఁ జేయింప
వారును సంతోషవనధి నోలాడి
కోరిక లారీతిఁ గొనసాగి వెలయఁ
దనువు లించుక సోఁకఁ దలచూపెఁ బులక
లానరేఁ జేతులు దాఁక నొడ లెల్లఁ జెమట;
హోమకార్యము దీర్చి యుర్వీదేవతలు
వేమాఱు నిచ్చుదీవెనలు గైకొనిరి.

విరటుఁడు కృష్ణాదులకు వస్త్రాభరణాదు లిచ్చి సత్కరించుట.

పెను పార నీరీతిఁ బెండ్లి చెల్లుటయు
ఘనుఁడు విరాటుఁ డగ్గలికతో నపుడు
పట్టుపచ్చడమును బంగారునగలుఁ
గట్టంగ మడుపులుఁ గంతమాలికలుఁ
బొసఁగఁ బూబంతులుఁ బోక లాకులును
బసిఁడిపళ్లెరములఁ బచరించి తెచ్చి
పొనర నచ్యుతునకుఁ బూజించి యిచ్చి
వినతిఁ బాండవులకు వేర్వేఱ నిచ్చి
తెఱఁ గొప్ప నా ద్రౌపదికి సుభద్రకును
నెఱయ భూషణవస్త్రనిచయంబు లిచ్చి
పదపడి పదివేలుభద్రనాగములు
చదు రొప్ప రథము లశ్వములు సద్భటులు
గణుతింప నైదులక్షలు పాడిపసులుఁ
బ్రణుతింప నరు దైనపసిఁడిటెక్కెములు
విభవంబు దైవార వేగఁ దెప్పించి
యభిమన్యునకుఁ గూర్మి నరణ మిప్పించి
యితరబాంధవులకు నింపు సొం పారఁ
బ్రతి లేనిభూషణాంబరము లిప్పించి

యనఘుఁ డై విప్రుల నధిక దానములఁ
దనిపెఁ బాయసపూపతతులతోఁ గూడ.
వివరింప నప్పుడు విరటుమందిరము
కవిలోకగోష్ఠీవికాసంబువలనఁ
జటులగీతంబుల సరసవాద్యముల
నటనటీజనఘననాట్యసంగతుల
యాదవపాంచాలు రాదిగాఁ గల్గు
మేదినీవిభులసమ్మేళంబువలన
లలి మీఱ దంపతులకు నివాళికలు
నలు వొప్ప నిచ్చుపుణ్యస్త్రీలవలనఁ
బ్రాకటశుభవేషభరితు లై వెలుఁగు
రాకొమారుల హాస్యరవములవలనఁ
గులపౌరుషము లెత్తి కుంభినీశ్వరులఁ
గలయఁ గీర్తించుమాగధపంక్తివలనఁ
బొనర మిన్నులు దాఁకుభూరిదక్షిణలఁ
దనిసినభూదేవతాకోటివలనఁ
జతురవిలాసినీచక్రంబువలన
నతిమనోహర మయ్యె నని చెప్పఁటయును
జాల సంతోషించి జనమేజయుండు
మే లైనపూజల మెప్పించె నతని.

పంచాక్షరీమంత్రపర సుతత్త్వజ్ఞ
పంచమవేదప్రపంచనిర్వాహణ
జనదోషహరణశిష్టప్రతిపాల
ఘనభుజాటోప మార్కండేయనిత్య
ప్రథితజంబూద్వీపభారథారేయ
పృథులసౌభాగ్యగంభీరసముద్ర
అని యిట్లు నృపతికి నభివృద్ధి గాఁగ
నెనసినవేడ్కతో నేఁ జెప్పినట్టి
యీపుణ్యకథ విన్న నెలమి వ్రాసినను
రూపించి చదివినరుచిరపుణ్యులకు
నరుదారఁ బుత్రపౌత్త్రాభివృద్ధియును
ఇహలోకపరలోకహిత మైనసుఖము
మహితాయురారోగ్యమంగళచయము
రమణ బల్లిపాటిరామలింగంబు
క్రమము దప్పక యిచ్చుఁ గలకాల మెల్ల.
ఆవేల్పు గొల్చినయనఘాత్ము పేర
సరణిగాఁ బంటవంశప్రభు పేర
మరియు జంగాలమ్మయధీరు పేర
సహజసజ్జను పేర సంప్రోక్త మైన
మహితకావ్యము ధాత్రి మను లెంతకాల

మినసోమతారక లెంతకాలంబు
ననుపమస్థితి నొప్పు నంతకాలంబు.
ఇది సదాశివభక్త హితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభసూరిసత్పుత్త్ర
మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచితవిరాటపర్వమున నాశ్వాస
మచితార్థయుతముగా నొప్పె నైదవది.

విరాటపర్వము.

సంపూర్ణము.

శ్రీ కృష్ణాయనమః.



# శుద్ధపత్రము.

| పుట. | గీత. | తప్పు. | సవరణము. |
|---|---|---|---|
| 3 | 14 | బ్రాహ్మణులు | విప్రులును. |
| 6 | 8 | బుద్ధికార్యంబు | బుద్ధిఁగార్యంబు. |
| 13 | 7 | మవసు | మనసు. |
| 16 | 10 | యొకమాట | యొకమాట. |
| 18 | 14 | కాంతలుసభ | కాంతలసభ. |
| 19 | 3 | హాస్యంబు | హాసంబు. |
| 26 | 5 | శాత్రువుల | శాత్రవుల. |
| 29 | 17 | జయంతుండును | జయంతుండు. |
| 31 | 15 | వచ్చుపట్లు | వచ్చునట్లు. |
| 46 | 13 | ఆనుచుండ | అనుచుండ. |
| 48 | 6 | జగదీశ | జగతీశ. |
| 55 | 19 | నీవుతల్చినయట్లు | నీతలంచినయట్లు. |
| 57 | 6 | తిమ్మననాధేయ | తిమ్మననామధేయ. |
| 78 | 5 | ఏలతీఁగలఁ | ఎలతీఁగలను. |
| 81 | 1 | ఏమిచేయుదు, | ఏమిచేయుందును, |
| 85 | 8 | ఏక్రియఁ | ఈక్రియఁ. |
| 89 | 15 | మాయంపుదప్పి | మాయప్పదప్పి. |
| 105 | 19 | పరహితదయా పరుఁడు | పరహితవరదయా పరుఁడు. |

| | | | |
|---|---|---|---|
| 111 | 15 | ధైర్యబు | ధైర్యంబు. |
| 127 | 1 | మోఁకాళ్లఁబోడువ | మోఁకాళ్లనుబోడువ |
| 133 | 4 | ఉచితార్థయుచితము | ఉచితార్థయుంతము |
| 135 | 13 | ఎయ్యాదిపాదము | ఎయ్యావిపాదము |
| | | లెయ్యాదికరములు | లెయ్యావికరములు. |
| 142 | 11 | చేతులు | చేతుల. |
| 148 | 9 | కారవధీశ్వరుండు | కారవాధీశ్వరుండు. |
| ,, | 10 | కాంతేయుల | కౌంతేయుల. |
| 156 | 13 | కర్ణాభిరథిక | కర్ణాదిరథిక. |
| 161 | 3 | పోవుచున్నాఁడు | పోవుచునున్నాఁడు. |
| 164 | 7 | వివరించినాము | వివరించినాఁడ. |
| 176 | 17 | అనజుండుఁ | అనుజులుఁ. |
| 180 | 1 | నీమూర్తి | మీమూర్తి. |
| 182 | 2 | కువలయాక్షులఁజేరి | కువలయాక్షులుచేరి. |
| 206 | 6 | తొల్లిటట్ల | తొంటియట్ల. |
| ,, | 13 | మద్యాద | మర్యాద |
| 208 | 1 | ఇవ్వారిలో | అవ్వారిలో |
| ,, | 20 | అది | ఇది. |
| 211 | 20 | తేలాడియు | తేలియుఁగడు. |
| 217 | 3 | ఏలయపుడు | ఏలయెపుడు. |
| 221 | 6 | తల్లడింపుదురె | తల్లడిల్లుదురె. |
| 224 | 4 | ఎపట్టియట | ఎపట్టియట. |

| | | | |
|---|---|---|---|
| ,, | 5 | తెఱంగంతను | తెఱంగంతయు. |
| 231 | 17 | ఎలమిరర్జునుని | ఎలమినర్జునుని. |
| 233 | 9 | అధికమాసములు | అధికమాసమ్ము. |
| 234 | 10 | గెలిచినెఱవాది | గెలిచిననెఱవాది. |
| 240 | 16 | క్రమమ్ముగానెఱిఁగి తామలరంగఁగ్రీడి | క్రమముగానెఱిఁగి లోఁగడఁగిరి, క్రీడి. |
| 289 | 14 | అవనిపైఁ | అతనిపైఁ. |
| 299 | 14 | మాతోడ | నాతోడ. |
| 336 | 1 | యనుల | యమల. |
| 337 | 6 | నాతఫఃలంబిది | నాతపఃఫలంబిది. |
| 347 | 8 | సాత్యకియును భద్రాభిమన్యులును | సాత్యకియు సుభద్రాభిమన్యులును. |
| ,, | 16 | పట్టయిన | పట్టైన. |
| 350 | 16 | లాండొండ | లాండొండ. |
| 351 | 8 | కప్పురమ్రుగ్గులు | కప్రంపుమ్రుగ్గులు. |
| 354 | 12 | నుమహారము | నుముహారము. |

కొన్నియెడల ధకారమునకు థకారమును, థకారమునకు ధకారమును బడియున్నవి. అర్ధానుస్వారములు కొన్నివిడివడి పోయెను. వీనిని జదువరులే సంస్కరించుకొందురుగాక.

చెన్నపురి మౌంటురోడ్డులో నున్న
శ్రీ వైజయంతీముద్రాశాలలో
దొరుకు గ్రంథములు.

## నాటకములు.

1. ధనంజయవిజయ వ్యాయోగము. (1902 సం॥ రం F. A. పరీక్షకు నిర్ణీతము.) బ్రహ్మశ్రీ, కొక్కొండ - వేంకటరత్నము పంతులుగారిచే రచితము ... ... 0 4 0

2. ఆంధ్రీకృతప్రసన్నరాఘవనాటకము. బ్రహ్మశ్రీ, కొక్కొండ - వేంకటరత్నము పంతులుగారిచే రచితము ... ... 0 8 0

౩. సత్యభామాపరిణయము. శ్రీమాన్ వింజమూరి - వీరరాఘవాచార్య విరచితము ... 0 6 0

4. విశ్వరూపసందర్శనము. శ్రీమాన్ వింజమూరి - వీరరాఘవాచార్యులుగారిచే విరచితము... 0 6 0

5. కనకాంగి. వ. శ్రీనివాసాచార్యులచే రచిత
మైన నూతన నాటకము ... ... 0 12 0

6. సైంధవవధ. వ. శ్రీనివాసాచార్యులచే రచిత
మైన నూతన నాటకము ... ... 0 12 0

7. భీష్మవిక్రమము. వవప్ప్రాకము - శ్రీనివాసా
చార్యులచే విరచితమయిన వ్యాయోగము. 0 12 0

8. ఘోషయాత్ర నాటకము. శ్రీమాన్ కిళాంబి-
వేంకటవరదాచార్య రచితము ... 0 8 0

## ప ద్య కా వ్య ము లు.

1. భరతాభ్యుదయము. శ్రీమాన్ విద్వానభినవ
పండితరాయ మాడభూషి వేంకటాచార్య
రచితము. B. A. పరీక్షకు ౨ పర్యాయ
ములు నిర్ణీతమయి యుండెను ... 1 0 0

2. వల్లీపల్లవోల్లాసము. విద్వాన్ మాడభూషి -
నరసింహాచార్య విరచిత మయిన మహా
కావ్యము ... ... .... 0 10 0

3. సతీమణి. ప. శ్రీనివాసాచార్యరచితము. (1901, 1911-వ సం॥ F. A. పరీక్షకు నిర్ణీతము.) కరుణారసప్రధానము ... 0 6 0

4. అనిరుద్ధచరిత్రము. కనుపర్తి. అబ్బయామాత్య ప్రణీతము. మహాకావ్యము ... 0 12 0

5. హంససందేశము శ్రీమాన్ అభినవ పండితరాయ మాడభూషి వేంకటాచార్యులచేతను శ్రీమాన్ కిళాంబి వేంకటవరదాచార్యుల చేతను ఆంధ్రీకృతంబు. ... ... 0 8 0

6. పారిజాతాపహరణము. నంది - తిమ్మనార్య విరచితము. పెద్ద యక్షరములతో మంచికాగితములపై ముద్రింపఁబడినది. M. A. పరీక్షకుఁ బఠనీయము. ... ... 0 6 0

7. భోజసుతాపరిణయము. కోటీశ్వకవిరచితము. 0 8 0

9. విక్టోరియా పంచరత్నములు. డయిమండు జూబిలీ మహోత్సవమునకై ప. శ్రీనివాసాచార్యులచే రచింపఁబడిన యాంధ్రపద్యములు. ఇందు రాణిగారిపటము నున్నది ... 0 2 0

# స్తోత్ర గ్రంథములు

## పద్యాత్మకములు.

1. రామశతకము. జయంతి - కామేశ్వరపంతులు గారిచే రచితము ... ... 0 1 0
2. జానకీవరశతకము. జయంతి - కామేశ్వర పంతులుగారిచే రచితము ... ... 0 1 0
3. రామపంచాశత్కందములు - జాలూరి అప్పయ్యగారిచే రచితము ... ... 0 2 0
4. యదువంశభూషణ శతకము - జాలూరి అప్పయ్యగారిచే రచితము ... ... 0 4 0

## వచనకావ్యములు.

1. ఖేచరోల్లాము. ప - శ్రీనివాసాచార్య రచితము ... ... ... 0 2 0
2. మంజువాణీవిజయము. శ్రీమాన్ హానరేబిల్ రాయబహద్దర్ ప - అనంతాచార్య విద్యావినోదిగారిచే రచితము. (౨-వ కూర్పు). 0 4 0

3. మదనమోహనచరిత్ర. శ్రీమాన్ విద్యాభినవ పండితరాయ మాడభూషి వేంకటాచార్యులు గారిచే రచితము ... ... 0 4 0

5. ప్రళయభైరవము. బ్రహ్మశ్రీ, కొండుభొట్ల- సుబ్రహ్మణ్యశాస్త్రులుగారిచే రచితము ... 0 12 0

6. సుశీల. ఒకానొక పతివ్రత చరిత్రము. ప. శ్రీనివాసాచార్యులచే రచితము. 0 4 0

---

## విద్యావిషయికోపన్యాసములు.

---

1. ఆంధ్రభారతమునందలి శంతనుపాత్రప్రభుత్వముంగూర్చినయుపన్యాసము. శ్రీమాన్ రాయబహద్దరు వ. అనంతాచార్యులు విద్యావినోది, విశారద గారిచే రచితము ... 0 1 0

2. ద్రుతస్వరూపనిర్ణయ విచారము. బ్రహ్మశ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రులు గారిచే రచితము ... ... ... 0 2 0

## ఇతర గ్రంథములు.

1. గీతరఘునందనము. బాలకాండము. బ్రహ్మశ్రీ తిరుమలభట్టారకకవి ప్రణీతమగు యక్షగానము ... ... ... 0 2 6
2. భ్రమరగీతాతత్త్వసారము. బమ్మెర పోతరాజు భాగవతమునందలి భ్రమర గీతలకు విశిష్టాద్వైతము ననుసరించిన వ్యాఖ్య. శ్రీమాన్ వింజమూరి వీరరాఘవాచార్యులు గారిచే రచితము. ... ... ... 0 3 0

## అచ్చుపడుచున్న గ్రంథములు.

1. కుచేలోపాఖ్యానము. ద్విపద.
2. భారతము. ద్విపద.
3. భాగవతము. ద్విపద.
4. పతివ్రతామాహాత్మ్యము. ద్విపద.
5. పరీక్షితహరిశ్చంద్రము. వచనము.

